# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
VEEKSHANAM, TELUGU MONTHLY
సంపుటి : 19 సంచిక : 12 హైదరాబాద్ 241 డిసెంబర్ 2021 పేజీలు : 68 రు. 25

- ❋ రైతు ఉద్యమ విజయం - ముందున్న సవాళ్లు
- ❋ వరి కొనుగోళ్ల సమస్య పూర్వాపరాలు
- ❋ ఆంధ్రప్రదేశ్ రాజధాని ప్రహసనం
- ❋ ఇంధన ధరల ఇరకాటంలో కేంద్రం
- ❋ పెగాసస్ దర్యాప్తు దరిచేరేనా?
- ❋ ప్రజల ఇక్కట్లు పట్టించుకోని తిట్ల పురాణం
- ❋ నిరాశ మిగిల్చిన కాప్ - 26 సదస్సు

# వీక్షణంలో అచ్చయిన వ్యాసానికి ప్రతిష్టాత్మక పురస్కారం

ఐక్యరాజ్యసమితి జనాభా నిధి (యునైటెడ్ నేషన్స్ పాపులేషన్ ఫండ్) సహకారంతో పాపులేషన్ ఫస్ట్ అనే సంస్థ భారతీయ ప్రచార మాధ్యమాలలో స్త్రీపురుష సమానత్వం గురించీ, జండర్ సెన్సిటివిటీ గురించీ వచ్చే కథనాలకు పది సంవత్సరాలుగా పురస్కారాలు అందజేస్తున్నది. ప్రింట్, ఎలక్ట్రానిక్, వెబ్ మాధ్యమాలలో వెలువడే ఇంగ్లిష్ వార్తా కథనాలకూ, అన్ని భారతీయ భాషల వార్తా కథనాలకూ ఇచ్చే ఈ పురస్కారం తూర్పు, పశ్చిమ, ఉత్తర, దక్షిణ ప్రాంతీయ స్థాయి లోనూ, దేశీయ స్థాయి లోనూ ఉంటుంది. వీక్షణం జనవరి 2020 సంచికలో అచ్చయిన, సి. వనజ రాసిన 'నిర్భయ నుంచి దిశ దాకా' అనే విశ్లేషణా వ్యాసానికి ఈ పురస్కారం దక్కింది.






11th EDITION 2021
LAADLI
MEDIA & ADVERTISING AWARDS
FOR GENDER SENSITIVITY
SUPPORTED BY UNFPA

C. VANAJA

PRINT | ARTICLE | TELUGU | NIRBHAYA NUNCHI DISHA DAAKA | VEEKSHNANAM MONTHLY MAGAZINE

For analyzing the roots of increasing rape culture

C. Vanaja powerfully examines the roots of the continually increasing rape culture present in our society. She takes two sensational incidents, the 2012 Nirbhaya case from New Delhi, and the 2019 case of Disha in Hyderabad, as examples and makes a strong case for the need for systematic institutional mechanisms to reduce the violence against women.

In appreciation of this analytical and detailed article addressing all facets of a serious crime that requires urgent corrective measures, C. Vanaja is presented the *Laadli* Media and Advertising Award for Gender Sensitivity 2021.

Mr. S. V. Sista (Executive Trustee) | Dr. A. L. Sharada (Director)

Supported by UNFPA | Norwegian Embassy New Delhi



241 ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాస పత్రిక

డిసెంబర్ 2021
సంపుటి : 19
సంచిక : 12





'వీక్షణం'లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు, డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం VEEKSHANAM

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫోన్ : 7330795849
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : నవ్య ప్రింటర్స్
అంబర్‌పేట్, హైదరాబాద్.

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 25 | రు. 25 |
| సంవత్సరం | రు. 300 | రు. 250 |
| మూడు సంవత్సరాలు | రు. 900 | రు. 650 |
| ఐదు సంవత్సరాలు | రు. 1500 | రు. 1100 |
| పది సంవత్సరాలు | రు. 3000 | రు. 2000 |

ఆన్‌లైన్ యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా ద్వారా డబ్బులు పంపేవారు బ్యాంక్ స్లిప్‌లపై **'VEEKSHANAM'** అని రాసి తమ పేరు కూడా రాయాలి. వీక్షణం అకౌంట్ నెంబర్ - **013911011002175** యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **UBIN0801399** నెంబర్‌తో పాటు తమ పేరు కూడా రాసి వేయాలి.

*వీక్షణం ఆర్థిక పరిస్థితిని వివరిస్తూ చేసిన విజ్ఞప్తికి స్పందిస్తూ వీక్షణంను నిలబెట్టుకోవాలనే తపనతో ఆర్థిక సహాయం అందించిన విష్ణుశ్రీ మెడికల్ అండ్ జనరల్ స్టోర్, రాజమండ్రి, తూర్పు గోదావరి - రు. 250; బోరెడ్డి మధుసూదన్‌రెడ్డి, సిద్దిపేట - రు. 2,000; మిత్రులకు కృతజ్ఞతలు - సం.*

నవంబర్ వీక్షణం సంచిక చదివాను. ఇందులో చాలా ముఖ్యమైన వ్యాసాలు వచ్చాయి. లఖింపూర్ ఖేరీ ఘటన నుండి పాండోరా పత్రాల వరకు కశ్మీర్ ప్రస్తుత స్థితి నుండి ఆకస్ కూటమి వరకు చాలా మంచి వ్యాసాలు ప్రచురించారు. ఇందులో ముఖ్యంగా మాట్లాడుకోవలసింది లఖింపూర్ ఖేరీ ఘటన గురించి. అధికార అహంకారం ఉచ్చ స్థితిలో ఉంటే ఏమి జరుగుతుందో ఈ ఘటన నిరూపించింది. సమాజానికి తమ మంచి ప్రవర్తనతో దారి చూపాల్సిన ప్రజా ప్రతినిధులే తమ బాధ్యత మరిస్తే, అధికార అహంకారంతో మాట్లాడితే ఎలా? శాంతియుతంగా నిరసన తెలుపుతున్న రైతులను అల్లరి మూకలు అని, తీవ్రవాదులు అని ముద్ర వేస్తే ఎలా తాము తలుచుకుంటే 2 నిమిషాలలో వారి పని పట్టగలమని పలకడం దేనికి నిదర్శనం?

రైతులపై నుండి కార్లు వెళ్లనిచ్చి వాళ్ల మరణానికి కారణం అయిన ఆజయ్ మిశ్రా కేంద్ర హోం శాఖ సహాయ మంత్రి కుమారుడు కావడం మరోవైపు, ఇంత వికృత చర్య జరిగిన తరువాత కూడా కేంద్ర పెద్దలు ఆ మహాశయుణ్ని పదవిలోనే ఉంచడం ద్వారా ఏమి సందేశం ఇస్తున్నట్టు? సుప్రీంకోర్టు చివాట్లు పెట్టేదాక అరెస్ట్ చేయకపోవడం దేనికి సంకేతం? దేశంలో బలమైన ప్రభుత్వం ఏర్పాటు అయితే సక్రమమైన పరిపాలన అందిస్తారని ఆశించిన వారికి ఆ బలమైన మెజారిటీని వికృత చర్యలు చేపట్టడానికి మాత్రమే ఉపయోగిస్తాం అని మోడీ ప్రభుత్వం సందేశం ఇస్తున్నది కదూ. మేధావులను హత్యలు చేస్తూ, రైతులను హత్యలు చేస్తూ ప్రభుత్వం వికృత క్రీడను కొనసాగిస్తున్నది. దేశానికి అన్నం పెట్టే రైతన్న తన ప్రాథమిక హక్కుల కోసం, తన న్యాయమైన డిమాండ్ల కోసం ఎముకలు కొరికే చలిలో నిరసన వ్యక్తం చేస్తుంటే ప్రభుత్వం ఇలా వ్యవహరించడం మంచిదికాదు. మరోవైపు సుప్రీంకోర్టు కూడా చివరి దాకా నిష్పక్ష పాతంగా విచారణ జరిపి నేరస్తులకు బలమైన శిక్షలు విధించి అధికారంలో ఉంటే ఏమైనా చేయొచ్చు అనే భావనను పోగొట్టాలి. ఇప్పటికైనా ప్రభుత్వం స్వామినాథన్ కమిటీ సూచనలను తూచ తప్పకుండా అమలు చేసి రైతుల పట్ల చిత్తశుద్ధిని నిరూపించుకోవాలి. ఎదురు లేదన్నట్టు ప్రవర్తిస్తే ప్రజలు సమాధానం చెప్పేరోజు తొందరలోనే వస్తుంది. ఇక్కడ మరో వ్యాసం గురించి కూడా మాట్లాడుకోవాలి. అనురాధ భాసీన్ రాసిన కశ్మీర్ వ్యాసంలో ఇప్పటి కశ్మీర్ స్థితి గురించి ఆమె చాలా బాగా వివరించారు. లడక్ వాసుల భయాలు, కశ్మీర్‌లో పెచ్చరిల్లుతున్న నిరుద్యోగం, మౌలిక వసతుల లేమి, ప్రభుత్వం మీడియా పైన విధిస్తున్న ఆంక్షల గురించి చాల బాగా వివరించారు. ప్రజాస్వామ్యానికి నాలుగో స్తంభంలా ఉండవలసిన మీడియా ఇంతలా దిగజారిపోవడం దురదృష్టకరం. కశ్మీర్ ప్రజలు తమకు రాజ్యాంగంలో పొందుపరిచిన ఆర్టికల్ 370, 35(ఏ)ని తిరిగి పొంది స్వేచ్ఛగా తమ వనరులు, ఉద్యోగాలు, భూమి పైన ఎవరి పెత్తనం లేకుండా తమకు తామే స్వయం పాలకులుగా మారి తమ ప్రతిపత్తిని తిరిగి సాధించుకుంటారని ఆశిద్దాం.

**– భారత అవినాష్**
*జనగామ*

చైనా కమ్యూనిస్టు పార్టీ విధానాలను వ్యతిరేకించేవారు చాలామంది వాస్తవాలను విస్మరించి లేదా వక్రీకరించి ఎలా విశ్లేషణలు చేస్తున్నారో వ్యాసకర్త (వీక్షణం నవంబర్ 2021) చక్కగా వివరించారు. చైనాని గుడ్డిగా వ్యతిరేకించడం, బలపరచడం కాక శాస్త్రీయంగా, ఆధారాలతో విశ్లేషించడం బాగుంది. పాశ్చాత్య మీడియా ప్రభావంతో ఇండియా మీడియా చైనాకు వ్యతిరేకంగా పనిగట్టుకొని ఎలా అసత్య ప్రచారం చేస్తున్నదో బట్టబయలు చేశారు. అత్యధికులు ఇలాంటి తప్పుడు ప్రచారంలో కొట్టుకు పోతున్నారు. నా సొంత అనుభవం చూడండి: చైనా విధానాల గురించి గూగుల్లో సెర్చి చేస్తే, దాదాపు ఎప్పుడూ పాశ్చాత్య మీడియా కథనాలే కనపడుతున్నాయి. చైనా అధికారిక మీడియా (ఉదా: గ్లోబల్ టైమ్స్) ఏం చెప్తున్నది అని ప్రత్యేకించి చూస్తే అప్పుడు కూడా అదికాక, దానిని పేర్కొనే పాశ్చాత్య మీడియా కథనాలు కనపడుతున్నాయి. చైనా అధికారిక మీడియానే కావాలని ప్రత్యేకంగా సెర్చిచేసి, ఓ పెన్ చేసిచూస్తే, "సెర్చిబార్"లో అనేకసార్లు 'ఇన్‌సెక్యూర్' (భద్రమైనది కాదు) అన్న హెచ్చరిక వస్తున్నది. అదే ఇరాక్, సిరియా, ఇజ్రాయెల్ యుద్ధ సంబంధిత వార్తలు చూస్తే అమెరికా అనుకూల కథనాలు మాత్రమే కనిపిస్తున్నాయి. పదుల లక్షల సంఖ్యలో అమెరికా అక్కడి పౌరులను చంపేసింది అన్న కోణంలో వార్తలే కన్పించవు. ఆఫ్ఘనిస్తాన్ వార్తలు చూస్తే, అమెరికా అక్కడ 20 ఏళ్లపాటు సైనిక దురాక్రమణ జరిపింది అన్న అంశం సూటిగా కనిపించడం లేదు. తాలిబాన్ దౌర్జన్యాల వార్తలు కనిపిస్తాయే గాని అమెరికా దురాక్రమణదారు అన్నది ఉండదు. చైనా గురించి అనేగాక మన ఛానెల్స్ అన్నీ దాదాపు అన్నిసార్లూ అవే కథనాలు ప్రసారం చేస్తున్నాయి. చైనా విషయంలో కూడా మీడియా తప్పుడు కథనాలు మనను ఎలా ప్రభావితం చేస్తున్నాయో ఈ వ్యాసం ద్వారా బాగా బోధపడింది.

చైనా పట్ల గుడ్డిద్వేషం ఎలా పెంచుతున్నారో ఇటీవలి మరో ఉదాహరణ జిన్ పింగ్ గురించిన కథనాలు. 68 ఏళ్ల 'వృద్ధుడైన' చైనా అధ్యక్షుడు మూడోసారి కూడా ఆ పదవి 'చేజిక్కించు'కున్నట్టు, 'జీవితాంతం' ఆయనే కొనసాగటానికి ఏర్పాట్లు చేసుకుంటున్నట్టు, ఇది ప్రజాస్వామ్య వ్యతిరేకం అనీ విపరీత ప్రచారం జరిగింది. నెహ్రూ ఇందిర మూడేసి సార్లు ప్రధానిగా ఉన్నారు; చనిపోకపోతే ఇందిర నాల్గోసారి కూడా ప్రయత్నించేవారే. మోదీ మూడోసారి ప్రధాని కావడానికి సన్నాహాలు సాగుతున్నాయి. మనదేశ ప్రధానులు చాలా మంది జిన్‌పింగ్ కన్నా చాలా వృద్ధులే: నెహ్రూ 74 ఏళ్లు, వాజపేయి 80, మొరార్జీ 83, చరణ్ సింగ్ 88, మన్మోహన్ 82, పివి నరసింహారావు 75, మోదీ 71. ఈ వాస్తవాలను దాదాపు చెప్పకుండా విపరీత ప్రచారం చేశారు. మనం గుడ్డిగా నమ్ముతున్నాం. లోగడ 'వీక్షణం'లో కూడా దీనిపై ప్రచురించినట్టు గుర్తు. మీరూ మేమూ ప్రజాస్వామ్య దేశాలు అని చెప్పుకుంటున్న అమెరికాతో మోదీ ప్రభుత్వం అంటకాగుతూ, చైనా వ్యతిరేక విధానాలను ఎలా కొనసాగిస్తున్నదో టివిలో రోజూ చూస్తున్నాం. మన 'బిగ్ మీడియా'లో

(మిగతా 60వ పేజీలో...)

కోవిడ్ వల్ల పత్రికలలో సాధారణ వార్తలు రావడం లేదు గనుక అసహజ మరణాల సూచి సమగ్రంగా తయారు చేయడం సాధ్యం కావడం లేదు. కొద్దికాలంగా అసహజ మరణాల సూచి వేయలేకపోతున్నందుకు చింతిస్తున్నాం. సం.

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ - సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; ఖమ్మం - సి.ఎచ్. గిరిజ; మెదక్ - ముత్తన్నగారి రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ - మహమ్మద్ ఇక్బాల్; వరంగల్ - ఓరగంటి ఎల్లయ్య

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ - కె. నాగేశ్వరాచారి; చిత్తూరు - పలమనేరు బాలాజి; కడప - కొండ్రాయుడు; కర్నూలు - జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి - కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం - ఆర్. శ్రీలత; విశాఖపట్నం - పి.వి. రమణ

# అపూర్వమైన ప్రజా విజయం, అయినా జాగ్రత్త!

కార్పొరేట్ ప్రయోజనాల కోసమే తయారైన, దుర్మార్గమైన మూడు వ్యవసాయ చట్టాలకు వ్యతిరేకంగా ఏడాదిగా వీరోచితంగా సాగుతున్న రైతాంగ ఉద్యమం ఇప్పటికి ఒక విజయం సాధించింది. ఏడాదిగా అపనిందలు, అబద్ధప్రచారాలు, ఆరోపణలు, లాఠీచార్జిలు, బాష్పవాయు ప్రయోగాలు, కాల్పులు, బారికేడ్లు, తప్పుడు కేసులు, అరెస్టులు, హత్యలు, హత్యాయత్నాలు, కుట్రలు, చీలిక ప్రయత్నాలు, బుజ్జగింపులు, బెదిరింపులు వంటి అనేక ప్రయత్నాలు చేసి కూడ రైతాంగ ఉద్యమాన్ని అణచలేకపోయిన మోడీ ప్రభుత్వం మూడు వ్యవసాయ చట్టాలను ఉపసంహరించుకుంటానని ప్రకటించింది. సంఘ్ పరివారానికి మొత్తంగానూ, నరేంద్ర మోడీ అనే వ్యక్తికి ప్రత్యేకంగానూ ఎంతమాత్రమూ తెలియని దిద్దుబాటును, పశ్చాత్తాపాన్ని వాళ్లనుంచి ఊహించలేం గనుక ఇది ఒక ఎత్తుగడే కావచ్చు. మరొక పెద్ద దాడికి రంగం సిద్ధం చేసుకోవడానికి వేసిన వెనుకడుగే కావచ్చు. ఆ కీడును కూడ ఊహిస్తూనే ఈ మేలును ఇంతవరకైనా ఆహ్వానించవలసి ఉంది. ఇది రైతుల విజయం. ఇది దేశవ్యాప్తంగా రైతులకు అందిన సంఘీభావానికి విజయం. ఇది ఇంత కష్టకాలంలో, మోడీ–షాల దుర్మార్గ పాలనలో కూడ ప్రజలు పట్టుదలతో నిలబడితే తమ ఆకాంక్షలు సాధించుకోగలరని చూపిన విజయం. అందువల్ల ఈ అపూర్వమైన ప్రజా విజయాన్ని తప్పనిసరిగా ఉత్సవ సందర్భంగా చూడవలసిందే. ఉపసంహరణ బిల్లును ఈ శీతాకాలం సమావేశాల్లోనే ప్రవేశపెడతామని వాగ్దానం చేశారు గనుక ఆ బిల్లు ఎలా తయారవుతుందో, దానిలో ఏమైనా లొసుగులు, నర్మగర్భమైన కుట్రలు ఉంటాయో త్వరలోనే తేలిపోతుంది. అలాగే, ఈ మూడు చట్టాల ఉపసంహరణ మాత్రమే కాక, విద్యుత్ బిల్లు ఉపసంహరణ, కనీస మద్దతు ధరను చట్టబద్ధం చేయడం, ఉద్యమకాలంలో రైతాంగం మీద పెట్టిన కేసులను ఎత్తివేయడం, ఉద్యమకాలంలో మరణించిన దాదాపు ఏడువందల మంది రైతుల కుటుంబాలకు నష్టపరిహారం చెల్లించడం వంటి అనేక డిమాండ్లు ఇంకా మిగిలే ఉన్నాయి. వాటి విషయంలో ప్రభుత్వం ఎటువంటి వైఖరి తీసుకుంటుందో కూడ త్వరలోనే తెలిసిపోతుంది. అంటే రానున్న కొద్ది నెలలు రైతాంగం, దేశప్రజానీకం మరింత జాగరూకతతో, శ్రద్ధాసక్తులతో రాజకీయ పరిణామాలను పరిశీలించవలసి ఉంటుంది. రైతాంగ ఉద్యమ నాయకత్వం ఇప్పటికే ఆ జాగరూకతను ప్రకటించడం అభినందనీయం.

ఈ సమీప భవిష్యత్తు సమస్యలు అలా ఉంచి, గడిచిన ఏడాది రైతాంగ ఉద్యమం, తత్సంబంధిత పరిణామాలు దేశం ముందు ఒక అద్భుతమైన చిత్రపటాన్ని ఆవిష్కరించాయి. ఆ పరిణామాలను అధ్యయనం చేస్తే, విశ్లేషిస్తే, నేర్చుకోదలచుకుంటే ఎవరికైనా పాలకవర్గ వైఖరుల గురించీ, ప్రజా ఉద్యమాలు అవలంబించవలసిన ఐక్యత గురించీ, ఎత్తుగడల గురించీ, తీసుకోవలసిన జాగ్రత్తల గురించీ ఎన్నెన్నో అనుకూల పాఠాలూ ప్రతికూల పాఠాలూ లభిస్తాయి. నవంబర్ 2020–నవంబర్ 2021 ఢిల్లీ సరిహద్దుల్లోనూ, పంజాబ్, హర్యానా, ఉత్తరప్రదేశ్ లలో ప్రధానంగా, మిగిలిన రాష్ట్రాలన్నిట్లో ఏదో ఒకస్థాయిలో జరిగిన ప్రతిఘటనా ఉద్యమం దేశ చరిత్రలో, ప్రజా ఉద్యమాల చరిత్రలో గొప్ప పాఠశాల.

ఇది మొట్టమొదట సామ్రాజ్యవాద, దళారీ కార్పొరేట్ సంస్థల ఆదేశాల మేరకు ఈ దేశ పాలకవర్గాలు ఎంత ప్రజావ్యతిరేకంగా, ఎంత దుర్మార్గంగా మారగలవో చూపింది. అందులోనూ, స్వదేశీ, దేశభక్తి, సాంస్కృతిక జాతీయవాదం అని గొప్పలు చెప్పుకునే సంఘ్ పరివార్ అసలు స్వభావం దేశీ విదేశీ సంపన్న, కార్పొరేట్ వర్గాలకు బానిసత్వ సేవ చేయడమేనని, ఆ పనిలో అవి ఎంతకైనా దిగజారగలవని ఈ ఉద్యమ క్రమం రుజువు చేసింది. భారత పాలకవర్గాల ఈ స్వభావం కేవలం ఇవాళ్టి అధికారపక్షం విషయంలో నగ్నంగా బైటపడిందనేది నిజమే గాని, గత మూడు దశాబ్దాలుగా అన్ని పార్లమెంటరీ రాజకీయపక్షాలూ, అన్ని పాలకవర్గ ముఠాలూ ఆ స్వభావాన్ని బైటపెట్టుకుంటూనే ఉన్నాయి. అందువల్లనే, కమ్యూనిస్టు పేరుతో ఉన్న పాలకవర్గ ముఠాలతో సహా ఏ ఒక్క ప్రతిపక్షం కూడ ఈ రైతాంగ ఉద్యమానికి నాయకత్వం అందించలేకపోయాయి, మార్గనిర్దేశనం చేయలేకపోయాయి, పాల్గొన్న సందర్భాల్లో కూడ అన్యమనస్కంగా, అరకొరగా, ఇది ఎన్నికల రాజకీయాలకు ఉపయోగపడుతుందా అనే ఆలోచనలతో పాల్గొన్నాయి. కనీసం సంపూర్ణంగా, సకలశక్తులతో పాల్గొని, దేశవ్యాపిత సంఘీభావాన్ని సమీకరించలేకపోయాయి. ఒక్కమాటలో చెప్పాలంటే ఈ రైతాంగ ఉద్యమం అన్ని పార్లమెంటరీ పక్షాల, అన్ని పాలకవర్గ ముఠాల డొల్లతనాన్ని, అసలు రంగును బహిర్గతం చేసింది. అదే విధంగా, జాతీయ మీడియా అని చెప్పుకునే ఇంగ్లిష్, హిందీ మాధ్యమాలు, ఆయా ప్రాంతాల భాషా మాధ్యమాలు రైతాంగ ఉద్యమానికి ఇవ్వవలసినంత ప్రాధాన్యత ఇవ్వకపోవడం ద్వారా, తప్పుడు వార్తలు ప్రచారం చేయడం ద్వారా, నిందాప్రచారపు విశ్లేషణల ద్వారా ఈ దేశం లోని నిజమైన ప్రజా ఉద్యమానికి, ప్రజలకు తాము చాల దూరంలో ఉన్నామని, తమకు ప్రకటిత ఆదర్శమైన “తటస్థత” కూడ లేదని, తాము కార్పొరేట్లకూ ప్రభుత్వానికీ బానిసలమని రుజువు చేసుకున్నాయి.

ఇలా ఏ ఒక్క అధికార, ప్రాబల్య వర్గపు సహకారమూ అందని కంటకావృత మార్గంలో కూడ రైతాంగం వీరోచిత ప్రతిఘటనను ప్రదర్శించారు. వారికి బలహీనంగానైనా సరే పౌరసమాజం నుంచే ఎంతో కొంత మద్దతు దొరికింది. దేశవ్యాప్తంగా అన్ని ప్రాంతాలలోనూ ప్రధానస్రవంతి రాజకీయాలకు దూరంగా ఉన్న పౌరసమాజ సంస్థలూ వ్యక్తులూ ఆలోచనాపరులూ రైతాంగ ఉద్యమానికి తమ సహాయ సహకారాలు అందించారు. అంటే దేశంలో ప్రజా ఉద్యమాలకు నాయకత్వం వహించే, మార్గదర్శకులుగా ఉండే శక్తిని పార్లమెంటరీ రాజకీయపక్షాలు కోల్పోయాయనీ, పార్లమెంటరీయేతర పౌర సమాజమే ఇక ముందు ఆ బాధ్యత తీసుకోవలసి ఉన్నదనీ ఈ రైతాంగ ఉద్యమం వేనోళ్ల చాటింది. భిన్నస్వరాలు వినిపించడానికి అవకాశం లేని అసహన, అణచివేత వాతావరణంలోనే ప్రజల ఐక్య, నిరంతరాయ, స్థిర ప్రతిఘటన విజయం సాధించగలదనే గొప్ప పాఠాన్ని నేర్పినందుకు రైతాంగానికి జేజేలు. ఇప్పుడిక ఆ పాఠం నేర్చుకుని తమ ప్రతిఘటనలను విశాల ఐక్యత వైపు, నిరంతరాయత వైపు, స్థిరత్వం వైపు నడపవలసిన బాధ్యత ప్రతి ప్రజా సమూహం మీద ఉంది. వీ

### సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# గమ్మతుగున్నది దొర ఇకుమత్!

ఉజురబాదల పైసలు ఉశికె లెక్క, శింత గింజల లెక్క, ప్యాలాల లెక్క ఎగజల్లి గుడ ఎల్లెలుకల బడె. ఇగ గప్పటి నించి తల్లడం మల్లడం అయితన్నట్టుంది. చెంగడ బింగడ ఎగురుతాండు, ఎన్నడు జెయ్యని పనులు జేత్తాండు. ఎన్నడు లేనిది వరుసగ పత్రికలోల్లతోని మాట్లాడ్తాండు. ఢిల్లి సర్కారు మీద ఎగిరెగిరి పడ్తాండు. అరె నిన్నటి దాంక ఇద్దరు అవ్వల్ దర్జ దోస్తులేనాయె, అచ్చుకాబుచ్చుకం ఉండిరి. గింతల్నె ఉప్పు నిప్పు ఎట్లయిపాయె అని అందరు అఫ్సోసు అయితాండ్రు. 'ఏహె గదంత ఉల్లెక్కాలనే, నువ్వు కొట్టినట్టు చెయ్యి, నేను ఏడ్శినట్టు జేత్త అని ఇద్దరు బదులుకోనే ఆడుతాండ్రీ నాటకాలు" అని గిట్టనోల్లు అనబట్టిరి. నిజం అవద్దం ఎవడెరుగును గని మొత్తం పరిషానుగున్నది. గమ్మతుగున్నది. దొర మాటలు ఇంటాంటె ఇచ్చిత్రమైతాంది. గాడ ఢిల్లిల, పంజాబుల, ఉత్తరప్రదేశుల సచ్చిపోయిన రైతులకు నపరి మూడు లచ్చలిత్తనని దొర ఏలాన్ జేశె. జెప్పున కీసల కెల్లి ఇరువై రెండు కోట్లు దీసి 'పొయి పంచి రాపోండ్లి' అని మంత్రులను గెదిమె. 'హారెవ్వా, ఎట్లనో ఉన్నది కత. దొర ఎక్కడ్నో సూటి బెట్టిండు, గీ పైసలు బంచి, ఆడ మంచోడనిపిచ్చుకోని, ఢిల్లి గద్దె గుడ ఎక్కుతడా ఏంది' అని కొందరు సోంచాయించబట్టిరి. 'గట్ల వశపెట్టకుండ పైసలు బంచినా గుడ ఉజురబాదల బర్కత్ దక్కలేదు గద. గిది గుడ గట్లనే అయితది తియి' అని గిట్టనోల్లు పాట మొదలు బెట్టిరి. గా ముచ్చెట గాదు గని, దొర మూడు లచ్చల ఏలాన్ కు రొండు గట్టి దెబ్బలు దగిలినయి. ఒగటేమొ, అయ్యా, నీ బాంచనైత గని, నువ్వు గద్దె ఎక్కిన కాడ్నించి మన తెలంగాణల్నే ఏడు వేల మంది రైతులు ఉరి బెట్టుకుని, ఇసం దాగి సచ్చిపాయిరి. 'మారె, వాల్లల్ల రెండు వేల మంది గుడ రైతులు గాదు, ఎగుసం దెబ్బదిని సావలేదు, ఇంకేదో ఒచ్చి సచ్చిండ్రు' అని సర్కారోల్లు రాశిరి. సరె, గదన్న గానియ్యి అంటె, దాంట్ల గుడ నూటికి పావులకు ఇయ్యకనే పోతివి. ఇచ్చినం అన్నోల్లకు గుడ నడిమిట్ల అఫ్సర్లు, బ్యాంకోల్లు, మీ పాల్టోల్లు, బ్రోకర్లు తలా ఇంత ఆపుకునిరి. గిట్ల కూట్లె రాయి దీయనోనివి, ఏట్లె రాయి దీత్తనని ఎట్ల బయలెల్లితివి దొరా అని ఎవడో ఒగడు అడుగుతడు గద. కొట్లాడి తెలంగాణ దెచ్చుకున్నదే, మనోల్లకు అన్నాలెం జరుగుతాంది, గది చెల్లది అనే గద. గిప్పుడు గా పంజాబోల్లకు సాతియ్యి, సౌలత్ జెయ్యి కాదంటలేం గని తెలంగాణ రైతులకు కావలిశింది జెయ్యకుంట, బైట ఎవలకో జేత్త అంటె ఎవలన్నా నమ్ముతరా? నమ్మినా నవ్వకుండ ఉంటరా? ఇంకొక దెబ్బ, ఇంకా అన్నాలెం. దొరను జూత్తె నాకే పాపమనిపిత్తాంది. దొర పైసలిత్తనని ఏలాన్ జేశినాంక శనార్థి దొర, మంచి పని జేశినవ్ అని గా రైతులు జరంత పబ్బతి గుడ పట్టకపాయిరి. ఇగ గా రైతుల పెద్ద ఉన్నడు గద, తికాయతో ఏందో గాయినె పేరు. గాయినె తీరా గింత దూరం పట్నం ఒచ్చి గుడ దొరను గలువలె. మీదినించి, 'గీ దొర గుడ పువ్వు గుర్తోల్ల సోపతిగాడే, మొదటి నించి ఆల్లు ఆడిచ్చినట్టె ఆడుతాండు, ఈడ రైతులకు గుడ అన్నాలెం జేత్తాండు, మీరు పైలంగుండాలె. గాయినె మాటలు నమ్మొద్దు' అని చెప్పుకొచ్చిండు. ఏందో దొర గాశారం బాగున్నట్టు లేదు... వీ

### సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# అసాధారణమైన రద్దు నిజమా, అబద్ధమా?

ఆంధ్రప్రదేశ్ రాజకీయాధికార పగ్గాలు చేపట్టగానే జగన్ మోహన్ రెడ్డి ప్రభుత్వం చేసిన పని రద్దులు. అమరావతిని రాజధానిగా రద్దు చేశారు. రాజధాని ప్రాంత అభివృద్ధి చట్టాన్ని రద్దు చేశారు. శాసనమండలిని రద్దు చేశారు. మూడు సంవత్సరాలు గడిచిన తర్వాత ఇప్పుడు తాను చేసిన రద్దులను రద్దు చేస్తున్నారు. రద్దును రద్దు చేస్తే యథాపూర్వ స్థితి వస్తుందా, ఈ మధ్య కాలపు పరిణామాల వల్ల ఆ యథాపూర్వ స్థితిలో ఏయే మార్పులు జరిగి ఉంటాయి, అసలు ఆ పాత స్థితిని పునరుద్ధరించే ఉద్దేశం ఈ పాలకులకు ఉందా, ఆ పాత స్థితి అయినా ప్రజా ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకున్నదేనా అనే ప్రశ్నలు చాల తలెత్తుతున్నాయి. ఈ దేశంలో, రాష్ట్రాలలో ప్రభుత్వ పాలన అనేది ఎంతమాత్రమూ ప్రజల కోసం, ప్రజా ప్రయోజనాల కోసం కాదని, అది అయితే రాచరిక యుగంలో లాగ అధికారం ఉన్నవారి ఇష్టారాజ్యమో లేదా, వారి ఆశ్రితుల ప్రయోజనాల కోసమో మాత్రమేనని మళ్లీ మళ్లీ రుజువవుతున్నది. ఒక రాష్ట్ర విభజన జరిగి కొత్త రాష్ట్రం ఏర్పడినప్పుడు, పాత రాజధాని మరొక రాష్ట్రంలో ఉండిపోయినప్పుడు తప్పనిసరిగా కొత్త రాష్ట్రానికి ఒక రాజధాని కావాలి. ఆ కొత్త రాజధాని ఎక్కడ ఎలా ఏర్పాటు చేయాలనేది చరిత్ర, సామాజికావసరాలు, సౌకర్యాలు, ప్రజా ఆకాంక్షలు వంటి అనేక కారణాలను పరిగణనలోకి తీసుకుని శాస్త్రీయంగా నిర్ధారించవచ్చు. నిజానికి ఆ పనికోసమే ఒక ఉన్నతాధికార కమిషన్ ఏర్పాటై, ప్రజలతో సంప్రదింపులు జరిపి కొన్ని సూచనలు చేసింది. అప్పుడు అధికారంలో ఉండిన వ్యక్తి ఆ సూచనలను బుట్టదాఖలు చేసి తన ఇష్టారాజ్యంగా, తన ఆశ్రితుల రియల్ ఎస్టేట్ ప్రయోజనాల కోసం ఒక రాజధాని రూపకల్పన చేశారు. ఆయన అధికారం అయిపోయి, కొత్తగా అధికారంలోకి వచ్చిన మరొక వ్యక్తి తన ఇష్టప్రకారం, తన ఆశ్రితుల రియల్ ఎస్టేట్ ప్రయోజనాల కోసం , లేదా పాత నిర్ణయపు ప్రయోజనం పొందుతున్న శక్తులను దెబ్బతీయడం కోసం ఆ రాజధానిని రద్దు చేశారు. ఆచరణ సాధ్యం కాని మూడు రాజధానుల ప్రతిపాదన తెచ్చారు. ఈ కొత్త ప్రతిపాదనకు అధికార వికేంద్రీకరణ అనే మేలిముసుగు తొడిగి ఆకర్షణ కలిగించడానికి ప్రయత్నించారు. ఆ ప్రతిపాదన మీద అటు న్యాయస్థానాలలో సవాళ్లు, ఇటు ప్రజాజీవితంలో నిజమైన, కల్పితమైన ఆందోళనలు మొదలయ్యాయి. రైతుల పాదయాత్ర పేరుతో ఒక ఆందోళన కూడ మొదలైంది. ఈలోగా శాసనసభలో మరొక విషయమై జరుగుతున్న చర్చలో అధికారపక్ష సభ్యులు ప్రతిపక్ష నాయకుడి సహచరి మీద అసభ్యకరమైన, గర్హనీయమైన పద్ధతిలో వ్యాఖ్యలు చేశారు. ప్రతిపక్ష సభ్యులు కూడ అదే తానులోని ముక్కలమని చూపుకున్నారు. ప్రతిపక్ష నాయకుడు బహిరంగంగా కన్నీరు పెట్టి సానుభూతి సంపాదించబోతున్నట్టు కనబడ్డారు. ఈ గందరగోళపు నేపథ్యంలో, మూడు రాజధానుల ప్రతిపాదన న్యాయస్థానంలో కొట్టుడు పోతుందనే భయం కూడ కలిసి ఆ ప్రతిపాదనను రద్దు చేసుకున్నారు. ఇప్పటికీ సాంకేతిక కారణాల మీద మాత్రమే రద్దు చేశారనీ, ఇంకొక రూపంలో మళ్లీ అదే నిర్ణయాన్ని ప్రకటిస్తారనీ ఊహాగానాలు వెలువడుతున్నాయి. అధికార ప్రతిపక్షాలు రెంటికీ సక్రమమైన, ఆమోదయోగ్యమైన చరిత్ర లేని ఈ మొత్తం ప్రహసనంలో వాస్తవంగా కనబడేదేమంటే ప్రజలకు అవసరమైన రాజధాని ఎంపికలో, మార్పులో, నిర్ణయాలలో ప్రజలకు ఎంతమాత్రమూ సంబంధం లేదనేది. అటూ ఇటూ వ్యక్తుల స్వార్థాలు, డాంబికాలు, అహంకారాలు, ఆశ్రితవర్గ ప్రయోజనాలు, ఇతరుల ప్రయోజనాలను దెబ్బతీసే ఎత్తుగడలు మినహా ప్రజలూ, ప్రజల ప్రయోజనాలూ లేవని గుర్తించడం అవసరం. వీ

# చైనా ఎదురులేని నేతగా జీ జిన్‌పింగ్

- ఎ. నర్సింహారెడ్డి

**వం**దేళ్ల కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ చైనా (సిపిసి) సాధించిన విజయాలను, జిన్‌పింగ్ నాయకత్వంలో గత పదేళ్లలో చైనా సాధించిన ఘనతలను, అభివృద్ధిని ప్రస్తుతిస్తూ అధికార సిపిసి 19వ కేంద్ర కమిటీ 6న ప్లీనరీలో తీర్మానాన్ని ఆమోదించింది. ఇలాంటి తీర్మానం ఆమోదించడం ఇది మూడవసారి. రాజధాని బీజింగ్‌లో నాలుగు రోజులపాటు నవంబర్ 8 నుంచి 11 వరకు జరిగిన ప్లీనరీలో పలు కీలకాంశాలు చర్చించారు. జిన్‌పింగ్ సిపిసి కేంద్ర కమిటీ పొలిటికల్ బ్యూరో తరపున వర్క్ రిపోర్ట్ సమర్పించారు. 2022 జూలైలో సిపిసి జాతీయ సదస్సు నిర్వహిస్తారు. అందులో మూడోసారి జిన్‌పింగ్ ఎన్నికను అధికారికంగా ప్రకటించడం ఇక లాంఛనమే. ఆయన ప్రస్తుత కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ చైనా ప్రధాన కార్యదర్శిగా, చైనా త్రివిధ దళాల సుప్రీం కమాండర్‌గా (సెంట్రల్ మిలటరీ కమీషన్ చైర్మన్), దేశాధ్యక్షుడిగా వ్యవహరిస్తున్నారు. ఏకవ్యక్తి పాలన, ఏకస్వామ్యం వైపు జిన్‌పింగ్ మొగ్గుచూపుతున్నారు. సమకాలీన చైనాలో తనకు ప్రత్యామ్నాయ నాయకుడు లేడని ప్రజల్లో బలమైన అభిప్రాయాన్ని కలిగించారు. పార్టీలో, కీలక అధికార పదవుల్లో తన వర్గీయులను నియమించుకోవడంతో స్వీయాధికారానికి ఎదురులేకుండా చేసుకున్నాడు. రెండోసారి అధ్యక్షుడిగా జిన్‌పింగ్ పదవీ కాలం వచ్చే ఏడాది ముగియనుంది. ప్రపంచంలోనే తిరుగులేని ఆర్థిక, సైనిక శక్తిగా మారుతూ అమెరికాను దీటుగా సవాలు చేస్తున్న చైనాలో జిన్‌పింగ్ స్థానాన్ని సుస్థిరం చేస్తూ సిపిసి తీర్మానించింది. చైనాలో మూడుసార్లు అధ్యక్ష పదవిని అధిష్టించే అవకాశం ఇప్పటిదాకా ఎవరికీ దక్కలేదు. 2018లో చేసిన రాజ్యాంగ సవరణ ప్రకారం జిన్‌పింగ్ జీవితకాలం అధ్యక్ష పదవిలో కొనసాగే వెసులుబాటు కూడా ఉంది. 21వ శతాబ్దాకి, సమకాలీన చైనాకు మార్క్సిజం అంటే జిన్‌పింగ్ ఆలోచనా విధానమే' అంటూ చైనా కమ్యూనిస్టు పార్టీ ప్లీనం తీర్మానాన్ని ఆమోదించింది. చైనా కమ్యూనిస్టు పార్టీలో జిన్‌పింగ్‌కు ముందు అధికార వికేంద్రీకరణ, బహుళ నాయకత్వం నెలకొంటున్న ధోరణి కనిపించింది. జిన్‌పింగ్ పగ్గాలు చేపట్టిన తరువాత అవినీతి ప్రక్షాళన పేర పార్టీలో ప్రత్యర్థులను వెంటాడారు. పార్టీని గుప్పిట పెట్టుకొని తానే జీవితాంతం అధికారంలో కొనసాగడానికి వీలుగా పావులు కదిపారు. 1970 దశకంలో మావో మరణం తరువాత డెంగ్ జియావోపింగ్ నాయకత్వంలో ఆర్థిక సరళీకరణ విధానాలు అమలవ్వడంతో సోషలిజం అటకెక్కింది. ఇప్పుడు కమ్యూనిస్టు పార్టీలో జిన్‌పింగ్ ముఠాకు ఎదురులేక పోవడంతో చైనా ప్రజలకు నామమాత్రపు హక్కులు కూడా కరువయ్యాయి. 1989 తియాన్‌మెన్ నిరసన అణచివేత నుంచి, ప్రజా వ్యతిరేకతను ప్రభుత్వం ఉక్కుపాదంతో అణచివేస్తోంది. మరోవైపు చైనా ప్రభుత్వం టిబెట్, హాంకాంగ్, ఉయిగర్ ప్రాంతాల ప్రజలను నిరంకుశ స్వభావంతో క్రూరంగా అణచివేస్తున్నది. శ్రామికులకు తగిన వేతనాలు ఇవ్వడం లేదు. ఆర్థిక, సైనిక శక్తిగా చైనా ఎదుగుతున్న క్రమంలో జిన్‌పింగ్ ప్రజల్లో జాతీయోన్మాదాన్ని రెచ్చగొట్టి తన ప్రభావాన్ని కాపాడుకుంటున్నారు. లాటిన్ అమెరికా, ఆసియా, ఆఫ్రికా ఖండాల్లోని పలు దేశాల్లో చైనా పెట్టుబడుల వరదను పారించి వ్యాపార సామ్రాజ్యాన్ని విస్తరింపజేసుకున్నది. బిఆర్ఐ రహదారిలో ఆసియా, ఆఫ్రికా, యూరప్‌లతో వాణిజ్య సంబంధాలు పెంచుకొంటున్నది. జిన్‌పింగ్ విధానాల వల్ల చైనాలో ప్రజల జీవన ప్రమాణాలు దిగజారాయి. ప్రజా వ్యతిరేకతను అణచివేయడానికి, ప్రజల దృష్టి మరల్చటానికి చైనా తన పొరుగున ఉన్న దేశాలతో ఘర్షణలకు దిగే ప్రమాదం పొంచి ఉన్నది. వీ





❖ **విశ్వమానవరాగం – లోహియా మానసగానం –** రావెల సాంబశివరావు – ఎమెస్కో బుక్స్ ప్రచురణ – 174 పేజీలు, 1/8 డెమీ, రు. 120, ప్రతులకు: ఎమెస్కో బుక్స్ ప్రై.లి., 1-2-7, బానూ కాలనీ, గగన్‌మహల్ రోడ్, దోమలగూడ, హైదరాబాద్ – 500029, ఫోన్ : 040-23264028



❖ **రసగంగాధర తిలకం –** అభిరుచులు-అలవాట్లు, ఇతర వ్యాసాలు – దేవరకొండ బాలగంగాధర తిలక్ – రచన: ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు – శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య ప్రచురణ – 318 పేజీలు, 1/8 డెమీ, రు. 300, ప్రతులకు: ప్రొ. టి.వి. సుబ్బారావు, నెం. 1708, 11వ క్రాస్, 1వ 'జి' మెయిన్, కెంగెరి సటిలైట్ పట్టణం, బెంగళూరు – 560060, ఫోన్: 9945422742



❖ **నేతాజీ మార్గంలో భారతదేశ పునర్నిర్మాణము –** అఖిల భారత ఫార్వర్డ్ బ్లాక్, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సమితి ప్రచురణ – 40 పేజీలు, 1/8 డెమీ, రు. 25, ప్రతులకు: అఖిల భారత ఫార్వర్డ్ బ్లాక్, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సమితి, ఇ.నెం. 42-3/1-97ఎ, రఘునాధరావు వీధి, రామకృష్ణాపురం, విజయవాడ – 520003, ఫోన్ : 9848654983



❖ **భారత రాజ్యాంగ నిర్మాణంలో నారీమణులు –** డా. భారతలక్ష్మి యం.వి. – 118 పేజీలు, 1/4 క్రౌన్, రు. అమూల్యం, ప్రతులకు: మిసిమి మాసపత్రిక కార్యాలయం, 1-1-60/5, ఆర్‌టిసి × రోడ్స్, ముషీరాబాద్, హైదరాబాద్ – 500020, ఫోన్ : 040 – 27612436 / 27645538



❖ **స్వేచ్ఛాగానం – కవిత్వం –** కరిపె రాజ్‌కుమార్ – పాలపిట్ట బుక్స్ ప్రచురణ – 192 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: పాలపిట్ట బుక్స్, 16-11-20/6/1/1, 403, విజయసాయి రెసిడెన్సీ, సలీమ్‌నగర్, మలక్‌పేట, హైదరాబాద్ – 500036, ఫోన్ : 9848787284



❖ **చలం మహర్షీ! –** శ్రీశ్రీ – కూర్పు: సింగంపల్లి అశోక్‌కుమార్ – శ్రీశ్రీ సాహిత్యనిధి ప్రచురణ – 40 పేజీలు, 1/8 డెమీ, రు. 40,



❖ **పద్మాలయ చిత్రాలలో శ్రీశ్రీ గీతాలు –** శ్రీశ్రీ – కూర్పు: సింగంపల్లి అశోక్‌కుమార్ – శ్రీశ్రీ సాహిత్యనిధి ప్రచురణ – 32 పేజీలు, 1/8 డెమీ, రు. 40,



❖ **వెండితెరపై విప్లవ శంఖం –** శ్రీశ్రీ – కూర్పు: సింగంపల్లి అశోక్‌కుమార్ – శ్రీశ్రీ సాహిత్యనిధి ప్రచురణ – 32 పేజీలు, 1/8 డెమీ, రు. 40, పై మూడు ప్రతులకు: శ్రీశ్రీ సాహిత్యనిధి, 305, ప్రగతి టవర్స్, వీరయ్య స్ట్రీట్, మారుతీనగర్, విజయవాడ – 520004, ఫోన్: 9246277375



❖ **కథా ప్రపంచం – 2020 –** మలిశెట్టి సీతారామ్ స్మారక పోటీకథల సంకలనం – మలిశెట్టి సీతారామ్ స్మారక ఎడ్యుకేషనల్ సొసైటీ ప్రచురణ – 128 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: మలిశెట్టి సీతారామ్ స్మారక ఎడ్యుకేషనల్ సొసైటీ, గుఱ్ఱం కొండ, చిత్తూరు – 517297, ఫోన్ : 9985013234



❖ **మట్టి పువ్వులు –** కవితల కూర్పు – కూర్పరి: అగరం వసంత్ – బస్తి యువక బృందం ప్రచురణ – 144 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: డా. ఎన్. వసంత్, బస్తి యువక బృందం, 2/1097, బస్తి, ఆవులపల్లి రోడ్డు, హోసూరు – 635109, కృష్ణగిరి జిల్లా, తమిళనాడు, ఫోన్ : 9488330209



❖ **దేశభక్తి కైతికాలు –** కైతిక కవిమిత్ర రాథోడ్ శ్రావణ్ – ఉట్నూరు సాహితీ వేదిక ప్రచురణ – 96 పేజీలు, 1/8 డెమీ, రు. 80, ప్రతులకు: రాథోడ్ శ్రావణ్, ఇ.నెం. 2-2/1, ఎల్.బి. సుభాష్ నగర్, ఉట్నూరు, ఆదిలాబాద్ – 504311, ఫోన్ : 9491467715



❖ **ప్రాణ గంధం –** కవిత్వం – బూర్ల వేంకటేశ్వర్లు – సాహితీ సోపతి ప్రచురణ – 168 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: బి. సంతోష, ఇ.నెం. 2-10-1524/10, ఫ్లాట్ నెం. 403, వెంకటేశ్వర టవర్స్, జ్యోతినగర్, కరీంనగర్ – 505001, ఫోన్ : 9491598040



❖ **ప్రాణదీపం –** కవిత్వం – గాజోజు నాగభూషణం – తెలంగాణ రచయితల వేదిక ప్రచురణ – 166 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: మునిగంటి శోభారాణి, ఇ.నెం. 8-2-462/2, కట్టరాంపూర్, కరీంనగర్ – 505001, ఫోన్ 9885462052



❖ **భావతరంగాలు –** కవిత్వం – సురేంద్ర రొద్ద – జ్ఞాపిక శీర్షిక సాహితీ ప్రచురణలు – 160 పేజీలు, 1/8 డెమీ, రు. 160, ప్రతులకు: రొద్ద ఉషా సురేంద్ర, ఫ్లాట్ నెం. 507, గరుడ గేట్‌వే అపార్ట్‌మెంట్, ఉప్పరపల్లి చెక్‌పోస్ట్, తిరుపతి, చిత్తూరు జిల్లా, ఫోన్ : 9491523570



❖ **బ్లూ స్కార్ఫ్ –** నవల – ఎం. విప్లవకుమార్ – మట్టి ముద్రణలు ప్రచురణ – 128 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: పుట్ట పుస్తక శిఖిరం, ఆలగడప, మిర్యాలగూడ – 508207, నల్లగొండ జిల్లా, ఫోన్: 9848015364, అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో



❖ **మానవ పరిసరాలు – జీవావరణము –** ముత్తన్నగారి రాజేందర్‌రెడ్డి – 56 పేజీలు, 1/8 డెమీ, రు. 80, ప్రతులకు: ముత్తన్నగారి రాజేందర్‌రెడ్డి, పాఠశాల సహాయోపాధ్యాయుడు (తెలుగు), జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, లచ్చపేట్, మండలం: దుబ్బాక, జిల్లా: సిద్దిపేట్ – 502103, ఫోన్ : 7416988768

# విజయోత్సవాల మధ్య రానున్న సమస్యలు

***రైతు ఉద్యమపు విజయాన్ని ఉత్సవంగా జరుపుకుంటూనే, ఇంకా సాధించవలసిన ఆకాంక్షలున్నాయని, అందుకోసం దీర్ఘకాలిక పోరాటం అవసరమనీ అంటున్నారు* జోగిందర్ సింగ్ ఉగ్రహాన్**

ఏడాదిన్నరగా ఎంతో ఓపికతో, మొక్కవోని సంకల్పంతో కష్టాలూ కడగండ్లూ అనుభవిస్తున్న లక్షలాది రైతులు ఎదురుచూస్తున్న రోజు చిట్టచివరికి వచ్చింది. వారి ఆకాంక్షలలో ప్రధానమైనవాటిని ఆమోదిస్తూ స్వయంగా ప్రధానమంత్రే ప్రకటన చేయవలసి వచ్చింది. ఈ ప్రకటనను దేశవ్యాప్తంగా రైతులూ, వారి పోరాటం పట్ల సానుభూతి ఉన్న శ్రామిక ప్రజానీకమూ ఊపిరి బిగబట్టి చాల శ్రద్ధగా విన్నారు. విజయధ్వానాలతో, ఉత్సవాలతో, పొంగిపొర్లుతున్న భావోద్వేగాలతో వాతావరణం ఒక్కసారిగా ఉత్తేజితమయింది. ఈ పోరాటంలో ప్రాణత్యాగం చేసిన వారి ముఖాలు కళ్లముందు సజీవంగా కదలాడాయి. వారి అమరత్వాన్ని సంస్మరించుకుని నివాళులర్పించారు. ఎన్నో ఎత్తు పల్లాలతో సాగిన ఈ పోరాటపు అత్యున్నత దశను ఈ దేశ శ్రామిక ప్రజానీకమంతా తమ ఐక్యతా స్ఫూర్తితో ఉత్సాహంతో స్వాగతించారు.

కాని మూడు చట్టాలను రద్దు చేసే నిర్ణయాన్ని ప్రకటించడంలో ప్రధానమంత్రి చేపట్టిన పద్ధతి, ఆయన ప్రజావ్యతిరేక ఫాసిస్టు మానసికస్థితికి మరొక సాక్ష్యాధారంగా రుజువైంది. ఈ నిర్ణయం కోసం ఒక మంత్రివర్గ సమావేశం జరపవలసిన అవసరాన్ని గుర్తించకపోవడం మాత్రమే కాదు, ఈ ఏకపక్ష ప్రకటన చేయడంలో ఆయన ఉద్యమ నాయకత్వాన్ని విస్మరించే ప్రయత్నం కూడ చేశారు. ఈ బ్రహ్మాండమైన ప్రజా ఉద్యమపు అత్యంత ప్రధాన ఆకాంక్షను ఆమోదిస్తూ నిర్ణయాన్ని ప్రకటించదలచుకున్నప్పుడు, ఇతర ముఖ్యాంశాల మీద రైతాంగ నాయకత్వంతో చర్చలు జరిపి, ఒక ఏకాభిప్రాయానికి రావడం సరైన పద్ధతి అయి ఉండేది. ఆ ప్రయత్నాలు చేసే బదులు, 'మోడీ ఉంటే ఇంకేమీ అక్కరలేదు' అని ఇప్పటికే తనగురించి రూపొంది ఉన్న ప్రతీకను బలోపేతం చేయడానికి ఆయన ప్రయత్నించారు. ఆ ప్రతీక ఇతరుల అభిప్రాయాలను లెక్క చేయదు. ఆ ప్రతీక ఆధారంగానే మోడీ ప్రతి ఒక్క భిన్నస్వరాన్నీ తోసివేస్తూ వచ్చారు, ప్రజల న్యాయమైన, నిజమైన ఆకాంక్షలను ఎంతమాత్రం లెక్క చేయకుండా ఉన్నారు. పోరాటంలో పదునెక్కిన ప్రజల విషయంలో ఆ ప్రతీక ఈ విజయపు అంతరార్థాన్ని మార్చలేదనేది పూర్తిగా భిన్నమైన విషయం.

మూడు చట్టాల ద్వారా ప్రవేశపెట్టదలచిన వ్యవసాయ కార్పొరేటీకరణ ప్రాధాన్యతను శక్తిమంతంగా సమర్థించుకోవడానికి ప్రధానమంత్రి తన ప్రసంగంలో ప్రయత్నించారు. మొత్తం దేశ రైతాంగం సార్వత్రికంగా ఈ చట్టాలను సమర్థిస్తున్నారని గొప్పలు చెప్పుకుంటూ, విస్తారమైన రైతాంగ ప్రతిఘటనను మాత్రం కేవలం ఒక చిన్న బృందపు అసంతృప్తిగా అభివర్ణించారు. వాస్తవంగా చెప్పాలంటే ఆయన క్షమాపణ చెప్పినది అంతర్జాతీయ, సామ్రాజ్యవాద కంపెనీలకూ, బడా కార్పొరేట్లకూ మాత్రమే. ఈ చట్టాల గురించి ప్రజలను మోసగించడంలో విజయం సాధించలేకపోయినందుకు ఆయన క్షమాపణ చెప్పారు. అదే సమయంలో తాను ఇంతకాలమూ నడిచిన దారిలోనే నడుస్తానని మరొకసారి తన నిబద్ధతను ప్రకటించుకున్నారు. 'సంస్కరణలు' అనబడేవాటి ప్రయోజనాల కోసమే జీరో బడ్జెట్, పంటల వైవిధ్యం వంటి భావనలను మరొకసారి చెప్పారు. ప్రధానమంత్రి ప్రసంగం అయిపోగానే ఇచ్చిన ప్రకటనల్లో నరేందర్ తోమర్ కూడ వ్యవసాయంలో 'సంస్కరణలు' ముందుకు తీసుకుపోవడానికి ప్రత్యామ్నాయ పద్ధతులు చేపట్టడం గురించి మాట్లాడారు.

వీటన్నిటిని బట్టి చాల స్పష్టంగా బైట పడేదేమంటే, వ్యవసాయ రంగంలోకి కార్పొరేట్ల చొరబాటు గురించి మోడీ ప్రభుత్వానికి ఉన్న నిబద్ధత అంతకు ముందు ఉన్నట్టుగానే ఉంది. ఆ గమ్యం చేరడానికి ప్రత్యామ్నాయ మార్గాలు ఏమన్నా ఉన్నాయా అని వెతకడానికి ప్రయత్నిస్తున్నది. కనీస మద్దతు ధర సమస్య గురించి ప్రతిపాదిస్తున్న కమిటీ ఏర్పాటు కూడ ఈ ప్రత్యామ్నాయ మార్గాలలో ఒకటి కావచ్చు. కార్పొరేట్ల ప్రయోజనాల పట్ల నిబద్ధత అంత బలోపేతమైనది అయినప్పుడు, ఇప్పుడు సాధించిన విజయాలు సులభమైనవి కాజాలవు. అలాగే సాధించిన విజయాలు కొట్టుకుపోయే ప్రమాదం కూడ గాలిలో వేలాడుతూనే ఉంటుంది. మూడు వ్యవసాయ చట్టాలను రద్దు చేస్తున్నామనే ప్రకటనతోనే, మన పొలాలకూ పంటలకూ వచ్చిన ప్రమాదం సమసిపోలేదు. ఆ ప్రయత్నాలు మళ్లీ మొదలుపెట్టడానికి ఎక్కువ రోజులు పట్టదు. ధాన్య సేకరణ నుంచి తప్పించుకోవాలనే ప్రయత్నం ఉద్యమ సమయం లో కూడ ప్రభుత్వ కార్యక్రమంలో భాగంగా ఉండింది. చట్టాలను రద్దు చేస్తున్న సమయంలో అందుకోసం వాడే సాంకేతిక పరిభాషను జాగ్రత్తగా చదవవలసిన అవసరం ఉంటుంది, దాగిన అర్థాల్ని కనిపెట్టవలసి ఉంటుంది. రైతుల ప్రయోజనాలను దెబ్బతీయడానికి వెనుక నుంచి జరిగే కుట్రల పట్ల జాగ్రత్త వహించవలసి ఉంటుంది. ప్రైవేట్ మండీలను ఏర్పాటు చేయడం ద్వారా రైతులకు 'స్వేచ్ఛ' ఇవ్వడమే తమ ఉద్దేశమని ఇప్పటికీ అంటున్నారంటేనే ప్రభుత్వపు అసలు ఉద్దేశాలు స్పష్టంగానే ఉన్నాయి. ప్రస్తుత విజయాన్ని ఒక ప్రామాణికమైన, సమగ్రమైన విజయంగా, రైతాంగ ప్రయోజనాలను ఇతోధికంగా సాధించే విజయంగా మార్చే ప్రయత్నాలను అడ్డుకోవడమే ఇప్పుడు కూడ ప్రభుత్వం చేస్తున్న పని.

# మట్టి మనుషుల పోరాటంలో ఓడిన మోడీ

***గత సంవత్సర కాలంగా రైతాంగం పోరాడి సాధించిన ఉద్యమ స్ఫూర్తితో పాలకులు అమలు చేస్తున్న ప్రజా వ్యతిరేక విధానాలను అడ్డుకోవాలని అంటున్నారు* ఎన్ నారాయణ రావు**

మన దేశానికి రైతాంగాన్ని వెన్నెముకగా భావిస్తాం. వారికి వ్యతిరేకంగా తీసుకువచ్చిన చట్టాలకు వ్యతిరేకంగా ఏడాది కాలంగా పోరాటం చేస్తున్నారు. ఆ పోరాటం పై లాఠీ పడని రోజు కాని, బెదిరించని సమయం కాని, చివరికి దేశ ద్రోహి అనే మాటను పడని రోజు కాని లేదు. చివరికి రైతులను దేశ ద్రోహులుగా, తీవ్ర వాదులుగా సంబోధించిన కంగనా లాంటి నటులకు పద్మశ్రీ ఇచ్చి సత్కరించిన దుర్మార్గపు సమాజంలో మనం బతుకుతున్నాం. దేశంలో రైతు తానే కాదు, దేశాన్నే బతికిస్తున్న స్థితిలో రైతును గుర్తించకుండా, పూర్తి నిర్బంధాలకు గురి చేస్తున్నాయి. నిర్బంధాలు అనేక మరణాలకు కారణమైన పరిస్థితి నుండి నేడు నన్ను క్షమించండి అనే ఒక మాటతో దీన్ని మనం ఎవరమైనా క్షమించవచ్చునేమో గాని రైతాంగం మాత్రం ఎన్నటికి క్షమించదు. మట్టి నుండి మెతుకు తీసే మనిషి గురించి పార్లమెంట్ సభ్యులు కాని, చివరికి ప్రధాని కూడా అర్థం చేసుకోలేరనే విషయం ఈ క్షమాపణలతో బహిర్గతమైంది. మరణించిన రైతు కుటుంబానికి ఖచ్చితంగా ఒక కోటి నష్టపరిహారం ఇవ్వాల్సిన కనీస బాధ్యత నేరస్థుడైన ప్రధాని మోడి మీద తప్పకుండా ఉంది.

మూడు వ్యవసాయ చట్టాలను కేంద్ర ప్రభుత్వం వెనక్కి తీసుకునేంతగా రైతులు చేసిన బలమైన పోరాటం వల్లే ఈ విజయం సాధ్యమైంది. ఈ వ్యవసాయ చట్టాలు సరియైనవి కావని, అనకుండా, కొందరు రైతులు ఒప్పుకోవడం లేదని ప్రధాని మాటల్లో స్పష్టమౌతున్నది. మీడియాలో కూడా 'గురునానక్ జయంతి సందర్భంగా' అని ఉటంకిస్తూ రైతుల త్యాగాలను అప్రధానం చేస్తున్నారు. ఏడాది కాలంగా రైతులు చేస్తున్న మొక్కవోని పోరాటాన్ని గుర్తించకుండా కేవలం గురునానక్ జయంతిని ప్రధానంగా మాట్లాడుతున్నారు. ఈ మోసాన్ని ప్రజాస్వామిక వాదులందరూ గుర్తించాల్సిందిగా తెలియజేస్తున్నాం. వ్యవసాయాధారిత దేశాన్ని ఆదాని, అంబాని దేశంగా మార్చే ప్రక్రియను రైతులు విరోచితంగా పోరాడి అడ్డుకోగలిగారు. ఏడు వందల మంది రైతుల ప్రాణాత్యాగాలతో కూడిన పోరాటాల ఫలితంగా విజయం సాధించారు. 700 మంది రైతుల మరణ త్యాగమే కాదు, మిగతా రైతులు, మహిళా రైతులు, రైతుల పిల్లలు కొనసాగించిన త్యాగపూరిత పోరాటమే ఈ విజయానికి కారణమైంది. తీవ్రమైన చలిని, వర్షాలను, ఎండలను ఎదుర్కొని పోరాటమే లక్ష్యంగా కొనసాగిన రైతాంగానికి, దేశ వ్యాప్త హక్కుల సంఘాల తరపున ధన్యవాదాలు తెలుపుతూనే, పోరాటాలే ఎప్పటికైనా విజయం సాధిస్తాయని, హక్కులను నిలబెట్టుకుంటారని మరొకసారి రైతులు నిరూపించిన వాస్తవాన్ని మనందరం గుర్తించాలి. జాలి, దయలపై

ఇతర డిమాండ్లను విస్మరించడం, కనీస మద్దతు ధర గురించి, ప్రజా పంపిణీ వ్యవస్థ గురించి ఎటువంటి హామీ గాని, కనీసం వాగ్దానం గాని ఇవ్వకుండా తప్పించుకోవడం, రైతాంగ నాయకులనూ, కార్యకర్తలనూ న్యాయస్థానాల కేసుల చిక్కుముడులలో కొనసాగించడం ప్రభుత్వ ఉద్దేశాలుగా కనబడుతున్నాయి.

అందువల్ల, జాగరూకతతో ఉండడం ద్వారా, మిగిలిన డిమాండ్లను ఆమోదించేదాకా పట్టువదలకుండా పోరాడడం ద్వారా ప్రభుత్వ ఉద్దేశాలను ఓడించడం ఇవాళ కాలం ఆదేశిస్తున్న కర్తవ్యం. మూడు చట్టాల రద్దును పార్లమెంటు ఆమోదించేదాకా, కనీస మద్దతు ధర, ప్రజా పంపిణీ వ్యవస్థ, విద్యుచ్ఛక్తి బిల్లు, కాలుష్య బిల్లు వంటి డిమాండ్ల మీద హామీ ఇచ్చేదాకా, కేసుల ఉపసంహరణ, నష్టపరిహారం వంటివి ఆమోదించేదాకా పోరాటం కొనసాగవలసి ఉంది. ధాన్య సేకరణ వ్యాపారంలోకి కార్పొరేట్ల ప్రవేశానికి వీలుకల్పించే చర్యల పట్ల మనం జాగరూకతతో ఉండవలసి ఉంది.

ఈ పనులన్నిటినీ కొత్త చట్టాల రూపంలో చేయవచ్చు. లేదా అధికారిక ఉత్తర్వుల ద్వారా చేయవచ్చు. లేదా మరేవైనా రహస్య చర్యల ద్వారా చేయవచ్చు. ప్రభుత్వం ఈ మార్గం నుంచి వైదొలగదనేది మాత్రం కచ్చితంగా చెప్పగలం. అందువల్ల జాగరూకతను, ఐక్యతను పెంపొందించుకుంటూనే, ప్రజలందరినీ ఈ విషయాల గురించి చైతన్యవంతులను చేయాలి. మనకు మన డిమాండ్ల గురించి స్పష్టత లేకపోతే, ప్రభుత్వాలు వాటిని మసిపూసి మారేడుకాయ చేస్తాయి, లేదా ఉక్కుపాదం కింద అణగదొక్కుతాయి. ''చట్టాలు రద్దయిపోయాయి'' అనే ఉత్సాహభరిత వాతావరణంలో, ఆ వాస్తవ ఉపసంహరణ చుట్టూ ఉన్న సమస్యలను, ఇతర సమస్యలను మరిచిపోవడానికి వీలు లేదు.

మన పోరాటంలో మొదటి దశలో విజయం సాధించామనడంలో సందేహం లేదు. కాని మండీల తొక్కిసలాటలో మన పంటలు అణగిపోకుండా ఉండాలంటే, వాటికి సరైన ధరలు దక్కాలంటే, ప్రజా పంపిణీ వ్యవస్థ ద్వారా మన శ్రామిక ప్రజానీకపు ఆహార హక్కు పరిరక్షించాలంటే ఒక దీర్ఘకాలిక పోరాటం అవసరం. రానున్న పోరాటం మరింత ఉన్నతమైన, మరింత దీర్ఘకాలికమైన ఐక్యతను కోరుతున్నది. విజయ ప్రకటనలు వాస్తవరూపం ధరించేదాకా ఈ పోరాటాల నిప్పు ఆరిపోకుండా కాపాడవలసిన అవసరం ఉంది. ప్రస్తుత ఉత్సవాల మధ్య, మరింత పెద్ద ఆకాంక్షలను మరిచిపోగూడదు.

*(రచయిత భారతీయ కిసాన్ యూనియన్ (ఉగ్రహాన్) అధ్యక్షులు)* వీ

ఆధారపడకుండా అన్యాయంపై పోరాటం చేయాలనేది ప్రధానం. బానిసల లాగా జీవించడం కన్నా బరిగీసి పోరాటం చేయాలని నిరూపించిన రైతాంగ ధైర్యాన్ని గుర్తిస్తూ, మనందరం మరొక అన్యాయ చట్టమైన ఊపా చట్టానికి వ్యతిరేకంగా దేశ వ్యాప్త పోరాటాన్ని నిర్మించాల్సిన అవసరం ఉంది. కేంద్ర ప్రభుత్వానికి తాను చేసిన తప్పును గుర్తించడానికి ఏడాది కాలం పడితే, 700 మంది చనిపోతే దానికి బాధ్యులెవరు? దీనికి నైతిక బాధ్యత వహిస్తూ ప్రధాన మోడి ఎందుకు రాజీనామా చేయ్యరు అని మనందరం ప్రశ్నించాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

మేధావుల, మా హక్కుల సంఘాల అంచనా ప్రకారం ఉత్తరప్రదేశ్, పంజాబ్ రాష్ట్రాలలో జరగబోయే ఎన్నికలే ప్రధాన కారణంగా ఈ వెనకడుగు. ఎన్నికలయ్యాక ఈ ప్రభుత్వం మళ్లీ మొదటికి వచ్చినా మనం ఆశ్చర్యపోవాల్సిందేమి లేదు. ప్రభుత్వం మరొక రూపంలో వీటిని తీసుకొని వచ్చే ప్రయత్నం తప్పకుండా చేస్తుంది. ఎందుకంటే నేటి రద్దు కాలంలో కూడా చట్టాలు సరియైనవి కావు అని ఒక చిత్తశుద్ధితో కూడిన ప్రకటన రావడం లేదు. ఇది ఎన్నికల స్టంట్‌గానే భావించాల్సి ఉంది. ఆదాని, అంబాని చేతుల్లో ప్రజాస్వామ్యం, ప్రధాని మోడి బంధీ అయ్యారని మనకర్థమౌతున్నది. ఈ స్థితిలో ఇంతకు మించి ప్రజాస్వామిక హక్కులను, విలువలను మనం చూడలేకపోతున్నాం. మన రాష్ట్రంలో కొనసాగిన సిరిసిల్ల, జగిత్యాల రైతాంగ పోరాట స్థాయిలో పోరాటాలు జరిగితేనే, రైతుల ఆత్మహత్యలు లేని సమాజాన్ని మనం చూడగలం. 10 కోట్లకు పైగా ఉన్న రైతాంగం ఏడాది కాలంగా చేసిన పోరాటానికి ఇది తాత్కాలిక విజయంగానే మనం భావించాలి.

ఒక వైపు వరి పండించకుండా కేంద్ర ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాలు రైతులను చాలా మనోవేధనకు గురి చేస్తున్నాయి. దీనిపై ప్రభుత్వాల నుండి ఒక స్పష్టమైన నిర్ణయం వచ్చేలోపే అనేకమంది రైతులు ఆత్మహత్యకు గురయ్యే పరిస్థితి ఉంది. కాబట్టి ప్రభుత్వాలు రైతులు పండించాల్సిన పంట విషయమై చాలా బాధ్యతగా వ్యవహరించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. దేశంలో కార్మికవర్గానికి ఉన్నత చైతన్యం కలిగి ఉండని మన రైతాంగం మన దేశంలో ఉంది.

రైతు అనేక ఆర్థిక సమస్యలతో నిత్యం మనసు కకావికలంగా ఉంటుంది, భవిష్యత్తును ఎదుర్కోలేని భయం ఎల్లప్పుడు వెంటాడుతూ ఉంటుంది. కాబట్టి శాశ్వతంగా ఈ మూడు చట్టాలను రద్దు చేయాలని, పాలన ప్రజాస్వామ్యబద్ధంగా కొనసాగించాల్సిందిగా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలను పౌరహక్కుల సంఘం డిమాండ్ చేస్తుంది. విద్యుత్ చట్టాలను రద్దు చేస్తూ, మద్దతు ధరకు భరోసా కల్పించాల్సిన బాధ్యత ప్రభుత్వాలపై ఉంది.

ఉత్తరప్రదేశ్‌లో రైతులను వాహనాలతో జంతువులను వేటాడినట్లు, వేటాడిన అజయ్ మిశ్రాను అరెస్టు చేయడానికి, కేసు నమోదు చేయడానికి ప్రజల నుండి, చివరికి సుప్రీం కోర్టు నుండి కూడా ఒత్తిడి రావల్సిన అవసరం ఏర్పడింది. దీనితోనే ప్రభుత్వంలోని మూడు చట్టాల పట్ల, ఆ చట్టాలకు వ్యతిరేకంగా చేస్తున్న రైతుల పోరాటాల పట్ల ప్రభుత్వ అప్రజాస్వామికతను ప్రజాస్వామిక వాదులందరూ అర్థం చేసుకోవచ్చు. ఉద్యమిస్తున్న రైతాంగంపై అణచివేత ఇందిరా ఎమర్జెన్సీ ఉక్కుపాదాన్ని మరిపించేంతగా కొనసాగింది. అక్రమ కేసులు, దుర్మార్గమైన లాఠీ చార్జీలు, గుర్తు తెలియని రైతులు చంపేసి ఆ శవాన్ని నిరసన ప్రదేశాల్లో వేలాడ దీయడం, చివరికి రైతులను, వారి ఉద్యమాన్ని గుర్తించకుండా, కేవలం ఆదాని అంబాని ప్రయోజనాల కోసమే వ్యవసాయ రంగాన్ని నిర్వీర్యం చేసే స్థితికి ప్రభుత్వం దిగజారింది.

సమాజంలో ఉత్పత్తి అయిన ఆహారాన్ని తీసుకోవడానికి కనీసంగా నైనా అర్హత లేని, ఆలోచన లేని ఒక నటిచే దేశద్రోహిగా మోడీ ప్రభుత్వం ప్రకటించి ఘోర తప్పిదం చేసింది. ఈ రైతాంగ చట్టాలు సరియైనవి కావని భావిస్తూ మోడి చేసిన ప్రకటనలను కూడా వ్యతిరేకిస్తూ, చట్టాలు సరైనవని ప్రకటన చేయడం ఇది పూర్తిగా దేశ రైతాంగాన్ని అవమానించడంగా మనందరం భావించాలి.

1947 తర్వాత వచ్చిన ప్రభుత్వాలు ప్రభుత్వ రంగాన్ని బలపర్చడం కోసం ముఖ్యంగాప్రధాని నెహ్రూ సోషలిజం పేరుతో అనేక భారీ పరిశ్రమలకు శ్రీకారం చుట్టాడు. అవి చాలా వరకు బలంగా కొనసాగాయి. కానీ ఈ మధ్య కాలంలో బలపడ్డ ప్రైవేటు పెట్టుబడి దారులు ఆ భారీ పరిశ్రమల్ని దివాళా తీస్తూ వాటిని అమ్మేసే విధంగా ప్రభుత్వాలపై ఒత్తిడి తెస్తూ, మొత్తంగానే ప్రభుత్వ రంగాన్ని ఘోరంగా నిర్వీర్యం చేసారు. ఆ స్థితి నుండి వారి గుప్పెట్లోకి వ్యవసాయ రంగాన్ని, విద్యుత్ రంగాన్ని పెట్టుకోవడం కోసం ఈ నూతన చట్టాలను తీసుకొచ్చారు. ఇది పూర్తిగా ప్రజాస్వామ్య విరుద్ధమైన చట్టాలు, నిర్ణయాలు. ప్రైవేటు పెట్టుబడిదారులు కేవలం తమ లాభం కోసమే పరిశ్రమలను నిర్మిస్తారు.

ప్రభుత్వాలు సేవా దృక్పథంతో ప్రజల అవసరాల కోసం పరిశ్రమలు కొనసాగిస్తారు. పెట్టుబడిదారుల బలానికి లోబడిపోయే అనేక ఫార్మాస్యూటికల్ ఐడిపిఎల్ లాంటి పరిశ్రమలను బిహెచ్ఇఎల్ లాంటి పరిశ్రమలను చివరికి అనేక లాభాలు వస్తున్నటువంటి విశాఖ ఉక్కుల ఆంటి పరిశ్రమలను కూడా ప్రైవేటీకరణ చేయడానికి సిద్దమౌతున్నాయి. ఇదంతా కూడా పెట్టుబడిదారుల అభివృద్ధి కోసమే జరుగుతున్న పాలన తప్ప ప్రజల కోసం జరుగుతున్న పాలనగా మనం ఎవరం భావించలేము. కాబట్టి ప్రైవేటీకరణ వ్యతిరేకంగా ప్రజాస్వామిక వాదులు ప్రజా సంఘాలు ముందుకు రావడం ద్వారానే రైతాంగాన్ని కార్మిక వర్గాన్ని ఈ దేశంలో రక్షించుకోగలం.

రైతుల హత్య పట్ల కూడా ప్రభుత్వం బాధ్యతగా స్పందించడం లేదు. ఆ కారణంగానే ఉత్తరప్రదేశ్ ఎన్నికల్లో తమ పార్టీ ఓటమికి గురవుతుందనే ఒక భయం రైతులకు 'మోడీ' క్షమాపణ చెప్పుకునే స్థితికి దిగజార్చింది. చరిత్రలో ప్రధాని స్థాయిలో ఇప్పటి వరకు ఇందిరాగాంధి తర్వాత మోడినే తీవ్రమైన తప్పిదాలు చేశారు. ఇందిరాగాంధి తన స్వార్థం కోసం ఎమర్జెన్సీని 17 నెలలు విధించి, అనేకమందిని నిర్బంధానికి, హత్యలకు పాల్పడేది. అదే స్థాయిలో నేడు రైతుల జీవన విధానాన్ని నాశనం చేసి ఆదాని, అంబానీలకు దేశాన్ని దోచిపెట్టే విధంగా నూతన రైతాంగ చట్టాలు తీసుకువచ్చి మోడి తప్పు చేసాడు. ఆ తప్పుకు క్షమాపణలు అడుగుతున్నాడు కూడా. కాని ఈ తప్పును గుర్తించడానికి ఏడాది కాలం పట్టిందంటే, అది కుట్రే తప్ప నిజాయితీ కాదు, చిత్తశుద్ధి కూడా లేదు. ఇందులో ప్రజాస్వామిక అసలే లేదు. కాబట్టి ప్రధాని స్థాయిలో తప్పు చేసిన వాళ్లు పాలించడానికి అర్హులు కారని, ప్రజాస్వామ్య విధానం చెబుతున్నది. దేశ రైతాంగానికి క్షమాపణలు చెప్పూ, ప్రధాని పదవి నుండి తప్పుకోవాల్సిందిగా పౌరహక్కుల సంఘం తెలియజేస్తుంది.

*(రచయిత ప్రధాన కార్యదర్శి, పౌరహక్కుల సంఘం)* వీ

# పెగాసస్ దర్యాప్తు దరి చేరేనా...?

***కేంద్ర ప్రభుత్వం పెగాసస్ సాఫ్ట్‌వేర్ ద్వారా దేశ ప్రజలపైనే గూఢచర్యానికి పాల్పడిందనే విషయాన్ని తేల్చడానికి సుప్రీం కోర్టు ఒక కమిటీని నియమించినా అది ఎంతవరకు సఫలమవుతుందని ప్రశ్నిస్తున్నారు*** **చుంచు శ్రీశైలం**

పెగాసస్ వ్యవహారంలో కేంద్ర ప్రభుత్వం వ్యవహరిస్తున్న తీరును బట్టి సొంత పౌరుల మీదనే అది గూఢచర్యానికి పాల్పడిందన్న పిటిషనర్ల వాదనను అంగీకరించాల్సి వస్తుందని సర్వోన్నత న్యాయస్థానం తన తీర్పులో వ్యాఖ్యానించింది. దీంతో జూలై నెలలో మొదలైన పెగాసస్ ప్రకంపనలు ఇంకా కొనసాగుతూనే ఉన్నాయి. ఇజ్రాయిల్‌కు చెందిన ఎన్.ఎస్.ఒ. (దాని వ్యవస్థాపకులు నివ్ కర్మి, షాలేవ్ హులియా, ఒమ్రిలావిల పేర్ల మీదుగా) అనే సంస్థ రూపొందించిన పెగాసస్ అనే సాఫ్ట్‌వేర్ ద్వారా దేశంలోని కొంతమంది రాజకీయ నాయకుల, జర్నలిస్టుల, ఉద్యమకారుల, హక్కుల కార్యకర్తల, న్యాయవాదుల మొబైల్ ఫోన్లు, ఇతర డిజిటల్ పరికరాలలోకి జొరబడి వాటిని నియంత్రించడం ద్వారా వారి వ్యక్తిగత కదలికలు, సంభాషణలు, ఫోటోలతో సహా రహస్యంగా గమనించడం, డేటాను తస్కరించడం జరిగిందని అమ్నెస్టీ ఇంటర్నేషనల్, ది వైర్‌తో సహా 17 మీడియా సంస్థలతో కూడిన కన్సార్టియం జూలై 18న ప్రపంచానికి ఆధారాలతో సహా వెల్లడించింది. దీని ద్వారా ప్రపంచ వ్యాప్తంగా 50 వేల మంది, భారతదేశంలో సుమారు 400 మంది పెగాసస్ నిఘాకు గురయ్యారని తెలిపింది.

ఈ ప్రకటన దేశంలో దుమారం రేపుతుండగానే ఈ సాఫ్ట్ వేర్‌ను ఇజ్రాయిల్ ప్రభుత్వ అనుమతితో ఆయా దేశాల ప్రభుత్వాలకు తప్ప ప్రైవేట్ సంస్థలు లేదా వ్యక్తులకు అమ్మలేదని ఎన్.ఎస్.ఒ. తన వెబ్‌సైట్ ద్వారా ఇచ్చిన వివరణ దేశంలో మరో సంచలనానికి తెరలేపింది. అంటే ఈ దేశ పౌరుల మీద పెగాసస్‌ను ఉపయోగించి గూఢచర్యానికి పాల్పడింది సాక్షాత్తు ఈ దేశ పాలకులేనని స్పష్టం అయింది. ఇదంతా సరిగ్గా వర్షాకాల పార్లమెంట్ సమావేశాలకు ఒక్కరోజు ముందు వెల్లడి కావడం, ప్రతిపక్షాలు దీనిపై ప్రభుత్వాన్ని నిలదీయడం జరిగింది. అయినప్పటికీ ప్రభుత్వం అవునని కానీ, కాదని కానీ చెప్పకుండా మౌనం వహించడంతో ఈ దేశ ప్రజాస్వామ్యం అవహేళనకు గురయ్యింది.

పౌరుల హక్కులను, వ్యక్తిగత గోప్యతను కాపాడాల్సిన ప్రభుత్వమే దొంగగా మారి, ప్రజల వ్యక్తిగత సమాచారాన్ని దొంగిలించడం, చట్ట విరుద్ధంగా వ్యవహరించడం సిగ్గుమాలిన చర్య పట్ల ఎన్ని అభ్యంతరాలు వెల్లువెత్తినా, ఎన్ని గళాలు ప్రశ్నించినా స్పందించకుండా తేలుకుట్టిన దొంగలా నిశ్శబ్దాన్ని పాటించింది. ఈ పరిస్థితుల్లో న్యాయవాది మదన్‌లాల్ శర్మ, ఎన్. రామ్, శశికుమార్ వంటి కొంతమంది జర్నలిస్టులు, ఎడిటర్స్ గిల్డ్ ఆఫ్ ఇండియా, కేంద్ర మాజీ మంత్రి యశ్వంత్ సిన్హా, పెగాసస్ బాధితులు తదితరులు అత్యున్నత న్యాయస్థానాన్ని ఆశ్రయించడం జరిగింది.

బాధితుల పిటిషన్‌ను సుప్రీంకోర్టు ధర్మాసనం విచారణకు స్వీకరించిన నాటి నుండి అది తన తీర్పును వెలువరించిన అక్టోబర్ 27 వరకు ప్రభుత్వ పన్నాగాలు, అబద్ధాలు, వక్రీకరణలు దాని స్థాయిని మరింత దిగజార్చాయి. పిటిషనర్ల అభ్యంతరాలు, ఆరోపణల పట్ల వాస్తవాలు తెలియపరుస్తూ అఫిడవిట్ దాఖలు చేయాలని ధర్మాసనం ప్రభుత్వాన్ని ఆదేశించింది. ఇందులో దేశభద్రత, రక్షణకు సంబంధించిన అంశాలు ఇమిడి ఉన్నాయని, అవి వెల్లడిస్తే తీవ్రవాదుల చేతుల్లో పడే అవకాశం ఉంది కాబట్టి, న్యాయస్థానం ముందుంచడం సాధ్యం కాదని పరిమిత అఫిడవిట్‌ను న్యాయస్థానం ముందుంచి నమ్మించే ప్రయత్నం చేసింది. ప్రభుత్వ న్యాయ ధిక్కారాన్ని, తప్పుదోవ పట్టించే ప్రయత్నాన్ని పసిగట్టిన ధర్మాసనం అన్ని అంశాలతో సవివరమైన అఫిడవిట్‌ను తమ ముందుంచాలని మరోసారి సూచించింది.

దేశ భద్రతకు సంబంధించిన అంశాల్లో తాము జోక్యం చేసుకోవాలని అనుకోవడం లేదని, ఆ వివరాలు వెల్లడించాలని కూడా తాము ఒత్తిడి చేయడం లేదని, పిటిషనర్ల ఉద్దేశ్యం కూడా అది కాదని కానీ, పౌరుల గోపనీయతను నియంత్రించడం రాజ్యాంగ పరిమితికి లోబడాలని, న్యాయ సమీక్షకు నిలబడాలని వ్యాఖ్యానించింది. 'ప్రస్తుత ప్రపంచంలో గోపనీయతను నియంత్రించడం జాతీయ భద్రతను పరిరక్షించేందుకు అవసరమైనప్పుడు మాత్రమే చేయాలి. కానీ ప్రతీసారి ఇదే అంశాన్ని ముందుపెట్టి తప్పించుకోలేరు. భద్రత పేరుతో న్యాయవ్యవస్థను భయపెట్టలేరు. జాతీయ భద్రతకు సంబంధించిన అంశాల్లో న్యాయస్థానం జోక్యం చేసుకోదు. అలా అని మౌన ప్రేక్షకుడిగా మాత్రం ఉండదు. న్యాయ సమీక్ష జరపకుండా ఎలాంటి నిషేధమూ లేదు.' అంటూ ప్రధాన న్యాయమూర్తి తీవ్రంగా హెచ్చరించారు.

సుప్రీంకోర్టు హెచ్చరికలు, ప్రజల, ప్రతిపక్షాల ఒత్తిళ్ల కారణంగా ఈ అంశంపై విచారణకు ప్రభుత్వం ఒక కమిటీని ఏర్పాటు చేస్తుందని అఫిడవిట్‌లో చెప్పుకొచ్చింది. ఒక దొంగ తన మీద తానే విచారణ జరుపుకోవడం అన్నమాట. ఇదే అభిప్రాయాన్ని తమ తీర్పులో ధర్మాసనం కూడా సంస్కారవంతంగా వెలిబుచ్చింది. పౌరుల హక్కుల ఉల్లంఘన అభియోగాలు ప్రభుత్వం మీదనే ఉన్నందున ప్రభుత్వమే ఏర్పాటు చేస్తామన్న నిపుణుల కమిటీని తాము తిరస్కరిస్తున్నామని తీర్పు ప్రతిలోని 57వ అంశంలో స్పష్టంచేశారు. ఇంకా 'న్యాయం చేయడం మాత్రమే కాదు, అది జరిగినట్లు కనబడాలి కూడాలి అంటూ స్పందించారు.

ప్రభుత్వం తన మౌనాన్ని వీడకపోవడం, పూర్తి వివరాలతో అఫిడవిట్ దాఖలు చేయకపోవడమనే కారణాలతో ఈ మొత్తం వ్యవహారం నిగ్గు తేల్చేందుకు నిపుణులతో కమిటీని ఏర్పాటు చేస్తూ ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ ఎన్.వి. రమణ, జస్టిస్ సూర్యకాంత్, జస్టిస్ హిమ కోహ్లీలతో కూడిన త్రిసభ్య ధర్మాసనం అక్టోబర్ 27న

చారిత్రాత్మక తీర్పును వెలువరించింది. దర్యాప్తుకు కమిటీని ఏర్పాటు చేస్తూ సాంకేతిక పరిజ్ఞానంలో అనుభవజ్ఞులు, నిష్ణాతులైన ముగ్గురు సభ్యులతో కూడిన ప్యానెల్‌ను నియమించింది. వారిలో గుజరాత్‌కు చెందిన సైబర్ సెక్యూరిటీ అండ్ డిజిటల్ ఫోరెన్సిక్ ప్రొఫెసర్, డీన్: నవీన్‌కుమార్ చౌదరి, కేరళలోని అమ్రిత విశ్వ విద్యాపీఠం అమృతాపురి ప్రొఫెసర్ పి. ప్రభాహరన్, ఐ.ఐ.టి బాంబే ప్రొఫెసర్ అశ్విన్ అనిల్ గుమస్తేలు ఉన్నారు. మాజీ న్యాయమూర్తి జస్టిస్ ఆర్.వి. రవీంద్రన్‌ను దర్యాప్తు పర్యవేక్షణాధికారిగా, ఆయనకు సహాయకులుగా మాజీ పోలీసు అధికారి ఆలోక్ జోషి, జాయింట్ టెక్నికల్ సబ్ కమిటీ చైర్మన్ డా. సందీప్ ఒబేరాయ్‌లను నియమించింది.

విచారణలో తమకు కావాల్సిన సమాచారాన్ని పొందేందుకు, వ్యక్తులను, సంస్థలను, అధికారులను, ఎవరినైనా విచారించే అధికారాన్ని కమిటీకి కల్పించింది. తమకు కావాల్సిన సిబ్బందిని కూడా సమకూర్చుకోవాలని సూచించింది. కమిటీ సభ్యుల, సిబ్బంది వేతనాలు, ఖర్చులను ప్రభుత్వం చెల్లించాలని నిర్దేశించింది. ఈ దర్యాప్తులో నిపుణుల బృందానికి, పర్యవేక్షణ కమిటీకి, ప్రభుత్వానికి మధ్య సమాచార సమన్వయం చేసే బాధ్యతలను సుప్రీంకోర్టు రిజిస్ట్రార్ వీరేందర్‌కుమార్ బన్సాల్‌కు అప్పగించింది. భారత పౌరుల ఫోన్లు, ఇతర పరికరాలపై పెగాసస్ స్పై వేర్‌ను వాడారా లేదా, వాడితే ఏ చట్టం, ఏ నిబంధన, ఏ మార్గదర్శకం, ఎలాంటి ప్రోటోకాల్, ఎలాంటి చట్టబద్ధ ప్రక్రియను అనుసరించారు? సంబంధిత అథారిటీ ఆమోదం ఉందా? అనే అంశాలపై దర్యాప్తు జరపాలని నిర్దేశించడం జరిగింది. ఇంకా 2019లోనే ఈ అంశం బయటకు వచ్చినట్టు, ప్రభుత్వం దృష్టిలో కూడా ఉన్నట్లు ఆధారాలున్నాయని, అయితే ఆనాటి నుంచి కేంద్ర ప్రభుత్వం ఏ చర్యలు చేపట్టిందో కూడా నివేదించాలని సూచించింది. ప్రజల వ్యక్తిగత గోప్యతా హక్కు రక్షణను మరింత మెరుగుపరచడానికి చర్యలు, సైబర్ భద్రతపై పౌరులు ఫిర్యాదు చేయడానికి అవసరమైన వ్యవస్థ ఏర్పాటు పట్ల, సైబర్ ముప్పు, దాడులపై దర్యాప్తునకు స్వతంత్ర సంస్థ ఏర్పాటు అంశాలపై సిఫార్సులు చేయాల్సిందిగా సూచించింది. పౌరుల హక్కుల పరిరక్షణ కొరకు న్యాయస్థానం చేపట్టదగిన తాత్కాలిక చర్యలను (పార్లమెంట్ చేపట్టే వరకు) కూడా నివేదించాలని చెప్పడం గమనించాల్సిన విషయం.

సుప్రీంకోర్టు ధర్మాసనం ఈ దేశ ప్రభుత్వంపై దర్యాప్తు చేయ నిర్ణయించడం, అందుకోసం కమిటీని ఏర్పాటు చేయడమే ఒక సంచలనంగా నిలిస్తే, ఈ నిర్ణయాన్ని వెలువరించే సందర్భంగా రూపొందించిన 46 పేజీల తీర్పు కాపీలో సంధించిన ప్రశ్నలు, గుర్తుచేసిన గత తీర్పులు, లేవనెత్తిన అంశాలు అంతకుమించిన ప్రాధాన్యతను సంతరించుకున్నాయి. న్యాయ వ్యవస్థ చరిత్రలో ప్రసిద్ధిగాంచిన తీర్పులలో ఒకటిగా నిలిచే అవకాశం ఉంది. ఈ స్ఫూర్తి కాగితాల్లో రాతలకే పరిమితం కాకుండా, ఆచరణలోనూ కొనసాగితే హర్షించదగ్గ విషయమే కాకుండా, దేశ మానవ హక్కుల పరిరక్షణకు వజ్రాయుధమే కాగలదు.

ఆ ఆచరణే దేశంలో అమలవుతున్న రాజ్యాంగ వ్యతిరేక (అన్ లాఫుల్ ఆక్టివిటీస్ ప్రివెన్షన్ ఆక్ట్) ఉ.పా., దేశద్రోహం వంటి చట్టాలను రద్దు చేయడానికి కూడా బాటలు వేయగలదు. 46 పేజీల తీర్పులో ధర్మాసనం వ్యాఖ్యలు హక్కుల ఉద్యమకారులు మాట్లాడినట్లుగానే అనిపించడం ఆశ్చర్యం కలిగించే విషయం. అలాగే హక్కుల ఉద్యమాలకు బలాన్నిచ్చే అంశం కూడా. ఈ సందర్భంగా రాజ్యాంగంలోని ఆర్టికల్ 21, 19ల ప్రకారం జీవించే హక్కు, వ్యక్తిగత స్వేచ్ఛ, భావ ప్రకటనా స్వేచ్ఛ ప్రాధాన్యతను ఈ తీర్పు ద్వారా మరింతగా విస్తృత పరిచినట్లైంది.

ప్రపంచ వ్యాప్తంగా ప్రసిద్ధిగాంచిన కేసులతో పాటు మన దేశంలోని కేశవానంద భారతి వర్సెస్ భారత ప్రభుత్వంతో సహా అనేక కేసులను ఈ తీర్పు ఉదహరించింది. ఇంగ్లండ్‌లోని 1604 సంవత్సరంలో ప్రఖ్యాతిగాంచిన 'ఎవరి ఇల్లు వారికి ఇంద్ర భవనం వంటిదేనన్న' గొప్ప అంశాన్ని ప్రస్తావించడం ద్వారా పౌరుల వ్యక్తిగత జీవితాల్లోకి చట్టవ్యతిరేకమైన చొరబాట్లను తీవ్రంగా ఆక్షేపించినట్లైంది. దీనికి కొనసాగింపుగా శిథిలావస్థలో ఉన్న ఒక 'నిరుపేద ఇంట్లోకి తీవ్ర గాలులు ప్రవేశించవచ్చు, తుఫాను, వర్షమూ వెళ్లవచ్చు కానీ, ఇంగ్లండ్ రాజు మాత్రం ప్రవేశించలేడు.' (విలియమ్ పిట్ – 1763 సం.) అన్న వ్యాఖ్యానాన్ని పొందుపరచడం ద్వారా అనుమతి లేనిదే ఎవరి వ్యక్తిగత జీవితాల్లోకి తొంగిచూసే హక్కు దైవాంశ సంభూతుడిగా భావించిన రాజుకే లేదని స్పష్టం చేశారు. వీటి వల్ల జీవించే హక్కు, వ్యక్తిగత స్వేచ్ఛ, వాక్ స్వాతంత్రాలు ప్రజాస్వామ్య దేశాలకు గుండె లాంటివని గుర్తుచేసిన విషయాన్ని పాలకులు ఇప్పటికైనా అర్థం చేసుకోవాలి.

జస్టిస్ ఎన్.వి. రమణ ప్రధాన న్యాయమూర్తిగా బాధ్యతలు స్వీకరించిన తర్వాత దుర్వినియోగం అవుతున్న బ్రిటిష్ కాలం నాటి దేశద్రోహం చట్టాన్ని కొనసాగించడంపై దేశవ్యాప్త చర్చ జరగాల్సిన అవసరం ఉందన్న ఆయన వ్యాఖ్యలను యధాలావంగా కొట్టివేయరాదన్న ఆలోచన అయితే ఈ తీర్పును చూసి కలుగక మానదు. అలాగే లఖింపూర్ ఖేరీ రైతుల హత్యాకాండను సుమోటోగా స్వీకరించడమే కాకుండా ఆ రాష్ట్ర ప్రభుత్వం అప్పగించిన సిట్ దర్యాప్తును వేరే రాష్ట్రానికి చెందిన మాజీ న్యాయమూర్తులతో పర్యవేక్షించ నిర్ణయించడం, త్రిపుర మతకల్లోలాల సందర్భంగా 102 మంది న్యాయవాదులు, పాత్రికేయులపై పెట్టిన దేశద్రోహం కేసుల విషయంలోనూ సుప్రీంకోర్టు వ్యవహరిస్తున్న తీరు ఇటీవల న్యాయవ్యవస్థ పట్ల సడలిన విశ్వాసాన్ని తిరిగి ప్రోది చేసుకుంటున్నట్లు కనపడుతుంది. ఇదే రాజ్యాంగ స్ఫూర్తి పౌరసత్వ సవరణ చట్టం, భీమా కోరేగాం వంటి కేసులలోనూ కనబరిస్తే, ప్రజల రాజ్యాంగ హక్కుల పరిరక్షణకు తోడ్పడుతూ, చట్టాల ఉల్లంఘనలను నిలువరించే దిశగా న్యాయస్థానం పయనిస్తుందని ప్రజలు భావిస్తారు.

అయితే ఈ తీర్పులో వెలువడ్డ రాజ్యాంగ స్ఫూర్తి, ధైర్యం కేసు దర్యాప్తులో కొనసాగాల్సిన అవసరం ఉంది. పెగాసస్ గూఢచర్యం నుండి ప్రభుత్వం తప్పించుకోవడానికి కావాల్సిన సమయాన్ని సమకూర్చే ఉపకారిగా ఈ కమిటీ నిలిచిపోకూడదు. 8 వారాల తర్వాత దర్యాప్తు పురోగతిని సమీక్షిస్తామని తప్ప తుది నివేదిక సమర్పించడానికి కాల పరిమితి నిర్దేశించకపోవడం ఈ అనుమానాలను బలపరిచే అంశం. ప్రజల ఆగ్రహావేశాలు చల్లార్చడానికి మొదట్లో ప్రజాను కూలంగా నడుచుకున్నట్లు భ్రమింప చేసి, పాలకుల, ఆధిపత్య వర్గాల పంచన చేరిన సంఘటనలు ఇంకా తాజాగానే ఉన్నాయి. ఇలాంటి గత అనుభవాలు ఎన్నో ప్రజల మదిలో సజీవంగా ఉన్నాయి. కమిటీలు అంటే కాలయాపనకే అన్న అభిప్రాయానికి ముగింపు పలకాల్సిన అవకాశం నేడు న్యాయవ్యవస్థ ఏర్పాటు చేసిన దర్యాప్తు కమిటీ చేతిలో ఉంది. లేదంటే న్యాయవ్యవస్థపై దేశ ప్రజల్లో మొలకెత్తిన ఆశలు

అదే దశలో తుడిచిపెట్టుకపోయే ప్రమాదం ఉంది.

పెగాసస్ దర్యాప్తు దానితో సారూప్యతను కలిగివున్న ఆర్సెనాల్ – భీమా కోరేగాం వంటి కుట్ర కేసులను కూడా ఛేధించేందుకు భూమికనివ్వాలి. ఇదే సమయంలో ఈ ఆశలు, ఆకాంక్షలు నెరవేరడం ఈ దేశంలో అంత తేలికైన విషయం కాదన్న వాస్తవాన్ని విస్మరిస్తే అది ఆత్మవంచనే అవుతుంది. బాబ్రీ మసీదు విధ్వంసం, గోద్రా మారణకాండ, సోహ్రాబుద్దీన్ ఎన్‌కౌంటర్ వంటి కేసులలో ఇచ్చిన తీర్పులలో న్యాయం సమాధి చేయబడిందని ప్రజలు భావించారు. సాక్షాత్తు న్యాయమూర్తులనే ప్రలోభాలకు గురిచేసి, లొంగకుంటే భయపెట్టి, బదిలీ చేసి, చివరకు చంపేసి, అనుకూలురైన వారిని ఆ స్థానాలలో కూర్చోబెట్టి తీర్పులను తారుమారు చేసిన సంఘటనలను గుర్తుచేసుకోక తప్పదు.

2002 గుజరాత్ అల్లర్ల కేసులో ప్రత్యేక దర్యాప్తు బృందం (సిట్) నిందితులకే కొమ్ము కాసిందని, ఆ కేసులో 64 మందిని (నాటి ముఖ్యమంత్రి మోడీతో సహా) నిర్దోషులుగా ప్రకటించిన తీర్పును సవాలు చేస్తూ ఇటీవలే జకియా జాఫ్రీ సుప్రీంకోర్టును ఆశ్రయించిన విషయ ప్రస్తావన ఇక్కడ సందర్భోచితం. అదే వ్యక్తులు ఇవ్వాళ దేశంలో అత్యంత అసాధారణ అధికారాన్ని అనుభవిస్తున్న సంగతి మరింత ఆందోళన కలిగిస్తోంది. ఇదే ఆందోళన ఈ 46 పేజీల తీర్పులో సర్వోన్నత న్యాయస్థానం కూడా పరోక్షంగా వ్యక్తం చేయడాన్ని గమనించాలి. నిజానికి ఈ ఆందోళన పెగాసస్‌ను మించినది. 'కమిటీ సభ్యులుగా నియమించడానికి నిపుణులను సంప్రదించేప్పుడు చాలా మంది సున్నితంగా తిరస్కరించారని' పేర్కొంది. ఈ తిరస్కరణకు కారణాలేంటో అందరికీ తెలిసినవే. దర్యాప్తు నిక్కచ్చిగా, నిజాయితీగా జరగడానికి అనేక అంశాలు తోడ్పాటును అందించాల్సి ఉంటుంది. అన్నింటికంటే ముఖ్యంగా విచారణకు కేంద్ర ప్రభుత్వంలోని పెద్దలు, ఉన్నతాధికారులు సహకరించడం మొత్తం ప్రక్రియలో అతి ముఖ్యమైనది. న్యాయవిచారణ సందర్భంగా అఫిడవిట్ దాఖలు చేయడంలో వివిధ సాకులతో మొండికేసి, సుప్రీంకోర్టు ధర్మాసనానికే సహకరించని ప్రభుత్వం కమిటీ ముందు విచారణకు సహకరిస్తుందని అనుకోవడం అమాయకత్వమే అవుతుంది. "పెగాసస్ దర్యాప్తు కమిటీకి సహకరిస్తాం. మోడీ సర్కార్ ఎలాంటి తప్పు చేయలేదు" అంటూ కేంద్ర ఐ.టి. శాఖ మంత్రి అశ్విని వైష్ణవ్ చేసిన ప్రకటన, నిర్ధారణ దేనికి సంకేతం?

ఏది ఏమైనా ఈ దర్యాప్తు సజావుగా సాగినా, సాగకున్నా ప్రభుత్వ చట్టవ్యతిరేకమైన గూఢచర్యాన్ని నిర్ధారించినా లేకపోయినా ప్రభుత్వానికి వచ్చిన ఇబ్బందేమి ఉండదనేది వాస్తవం. నిపుణుల కమిటీ తుది నివేదిక ఎలా వున్నా మాకొచ్చే ఇబ్బంది ఏమీ లేదన్న కేంద్ర మంత్రి అశ్విని వైష్ణవ్ ధీమా కూడా అదే. నిజానికి నైతికత అనేది కాలం చెల్లిన విలువగా మారింది కాబట్టే భారతీయ జనతా పార్టీ ఇంకా అధికారంలో కొనసాగుతుందనేది కూడా వాస్తవం. ఈ మొత్తం వ్యవహారం దేశంలో ప్రజల హక్కుల మీద జరుగుతున్న దాడులను, ఉల్లంఘనలను, రాజకీయ ప్రత్యర్థుల మీద చేస్తున్న కుట్రలను బహిర్గతం చేసింది. దేశ భద్రత, రక్షణ కోసం తీవ్రవాద కార్యకలాపాల మీద చేయవలసిన గూఢచర్యం సొంత ప్రజల మీదే జరుపుతున్నారనేది కూడా తేటతెల్లమైంది. దేశ రక్షణ ముసుగులో ప్రజాస్వామ్య స్ఫూర్తిని మంటగలిపి, సొంత రాజకీయ, అధికార ప్రయోజనాలను నెరవేర్చుకో జూస్తుందని నిరూపితమైంది.

దేశంలో తమ విధానాలను విభేదించే వారు, అసమ్మతిని ప్రకటించే వారు, ప్రశ్నించే వాళ్లు, నిరసనను ప్రదర్శించే ప్రజాస్వామిక వాదులందరినీ తీవ్రవాదులుగా, దేశ ద్రోహులుగా ముద్ర వేస్తున్నారని ప్రస్ఫుటంగా తేలింది. శాశ్వత అధికారం కోసం అవసరమైతే దేశ సార్వభౌమాధికారాన్ని కూడా ప్రమాదంలోకి నెట్టివేస్తామని, విదేశాలకు సాగిలపడతామని, తమది కుహనా జాతీయవాదం, నకిలీ దేశభక్తి అని నిరూపించబడింది. పెగాసస్ ద్వారా సేకరించిన భారతీయ ఆత్మ (అంతర్గత విషయాలు)ను ఆ సాఫ్ట్‌వేర్ రూపకర్తలు చేజిక్కించుకోగలరు, అగ్ర రాజ్యానికి అప్పగించనూగలరు. ఎందుకంటే కోడ్ రాయగలిగిన వాడికి డీకోడ్ ఎలాగూ తెలిసే ఉంటుంది. అంటే పెగాసస్ గూఢచర్యం ద్వారా పొందిన సమాచారం ఈ దేశ పాలకులతో పాటు ఇజ్రాయిల్, దాని అధినేత అమెరికా కూడా పొందగలిగే అవకాశం తప్పకుండా ఉంది. ఇంతటి ప్రమాదకర పరిస్థితులను ఈ వ్యవహారం, తీర్పు బట్టబయలు చేసింది. పాలకుల కుట్రలను, అధికార కాంక్షతో అమలుచేస్తున్న రాచరికపు విధానాల పట్ల దేశ ప్రజలను సమాయత్త పరచడానికి తానొక ఊతకర్ర కాగలనని ఈ తీర్పు చాటి చెప్పింది. ఆ దిశగా బుద్ధి జీవులకు కర్తవ్యాన్ని నిర్దేశిస్తూ, నిర్వర్తించడంలో వేగం పెంచాలని హెచ్చరిస్తుంది.

*(రచయిత ఉపాధ్యాయులు)*

వీ

## జంగ్ ప్రహ్లాద్ మృతి

*తెలంగాణ ఉద్యమకారుడు, జననాట్య మండలి కళాకారుడు, గేయ రచయిత జంగ్ ప్రహ్లాద్ అలియాస్ సాధినేని ప్రహ్లాద్ (55) నిమ్స్ ఆస్పత్రిలో చికిత్స పొందుతూ నవంబర్ 1న మృతిచెందారు. ప్రహ్లాద్ అక్టోబర్ 27న ద్విచక్ర వాహనంపై వెళ్తూ హైదరాబాద్‌లోని జగద్గిరిగుట్ట ఆల్విన్ కాలనీ వద్ద జరిగిన రోడ్డు ప్రమాదంలో పక్కటెముకలు విరగడంతో పాటు తలకు బలమైన గాయాలు కావడంతో నిమ్స్‌కు తరలించారు. వైద్యులు బ్రెయిన్‌డెడ్‌గా నిర్ధారించారు. వెంటిలేటర్‌పై చికిత్స పొందుతూ తుది శ్వాస విడిచారు. భువనగిరిలో హైస్కూల్ విద్యనభ్యసించారు. బాల్యంలోనే అభ్యుదయ భావాలు అలవర్చుకున్నారు. ఏడో తరగతిలో ఉండగానే 'తూర్పు చేను గట్టుకాడ, చెట్టు పుట్ట కొట్టేటోడా' అనే పాటతో ఆకట్టుకున్నారు. 1984లో హైదరాబాద్‌కు వచ్చి ఖైరతాబాద్‌లో ఇంటర్‌లో చేరి రాడికల్ స్టూడెంట్ యూనియన్‌లో చురుగ్గా పాల్గొన్నారు. మొదటి నుండి తెలంగాణ ఉద్యమంలో పాల్గొన్నారు. 1995లోనే మారోజు వీరన్న ఆధ్వర్యంలో వి. ప్రకాశ్, ఇన్నయ్యతో కలిసి భారీ బహిరంగ సభ నిర్వహించారు. 'అమ్మా తెలంగాణమా? ఆకలి కేకల గానమా?' అంటూ ఆ సభలో పాట పాడారు. కొంతకాలం జననాట్య మండలిలో, 2000–2003 మధ్య కెసిఆర్‌తో కలిసి పనిచేశారు. 2004 నుంచి గద్దర్‌తో కలిసి కార్యక్రమాల్లో పాల్గొన్నారు. తెలంగాణ ఉద్యమం ఉవ్వెత్తున సాగిన కాలంలో ప్రహ్లాద్ ఊరూరా తిరుగుతూ ధూందాంలు నిర్వహించి ప్రజలను చైతన్యం చేశారు. దళిత, బహుజన రాజ్యం రావాలని కోరుకునేవారు.*

# తెలంగాణలో అడుగంటిన పౌరహక్కులు

*పుస్తకావిష్కరణ సభను అడ్డుకోవడం, ప్రింటింగ్ ప్రెస్ నుంచి పుస్తకాలు ఎత్తుకుపోవడం వంటి చర్యలతో తెలంగాణలో పౌరహక్కుల ఉల్లంఘన మరింత దిగజారిందని అంటున్నారు* **రాజవరం పార్థసారథి**

పోలీసుల రాజ్యంలో పౌరహక్కులడుగంటెను, కోర్టులలో జనన్యాయం గొంతు నులిమి చంపబడెను అని విప్లవ కవి చెరబండరాజు యాభై సంవత్సరాల కింద రాసిన మాట తెలంగాణలో మరింతగా అక్షరసత్యమూ, మరింత దిగజారిన వాస్తవమూ అవుతున్నది. సభలు, సమావేశాలు ఏర్పాటు చేసుకునే సహజమైన హక్కు మీద, రాజ్యాంగం కూడ హామీ ఇచ్చిన హక్కు మీద పోలీసుల దాడి ఐదు దశాబ్దాలుగా తెలిసినదే. మరీ ముఖ్యంగా ఏడు సంవత్సరాలుగా తెలంగాణ రాష్ట్ర సమితి ప్రభుత్వం పాలనను పూర్తిగా పోలీసులకు అప్పగించిన తర్వాత ఈ దాడి మరింతగా పెరిగింది. మొత్తం రాష్ట్రంలో సభలు, సమావేశాలు జరగడానికి అవకాశాలున్నదే మూడు నాలుగు చోట్ల కాగా, వాటిని కూడ రద్దు చేసే ప్రయత్నాలు ఇటీవల మొదలయ్యాయి. ఆ సభ కేవలం పుస్తకావిష్కరణ సభే అయినా దాన్ని జరగకుండా చూడడం, హాలు యాజమాన్యాలను బెదిరించి, ఒత్తిడి తెచ్చి సభ జరగకుండా చూడడం, ప్రాంగణంలోపల, హాలు లోపల జరిగే సమావేశానికి పోలీసుల అనుమతి అవసరం లేకపోయినా అనుమతి తీసుకొమ్మని ఒత్తిడి తెచ్చి, అనుమతి నిరాకరించడం, చట్టబద్ధమైన నిషేధపుటుత్తర్వులు, గెజిట్ ప్రకటనలు ఏమీ లేకుండానే తమకు తోచిన కొన్ని ప్రజాసంఘాలను నిషిద్ధ సంఘాలుగా ప్రకటించడం పోలీసులు మరింత ఎక్కువగా చేస్తున్నారు. ఈ నిర్బంధ చర్యలన్నిటికీ పరాకాష్టగా, పచ్చి నియంతృత్వ పాలనలలో కూడ కనీవినీ ఎరగని విధంగా ఇప్పుడు జరగనున్న పుస్తకావిష్కరణ సభకు అవరోధాలు కల్పించడం మాత్రమే కాకుండా, సభ జరగడానికి ముందురోజు ప్రింటింగ్ ప్రెస్ మీద దాడి చేసి అచ్చయిన పుస్తకం కాపీలన్నీ ఎత్తుకుపోయిన చట్టవ్యతిరేక, అక్రమ చర్యలకు తలపడ్డారు.

నవంబర్ 12న హైదరాబాద్ లో నవ్య ప్రింటర్స్ మీద భారీ సంఖ్యలో పోలీసులు దాడి చేసి, లోపలికి ప్రవేశించిన వెంటనే సిబ్బందిలో ప్రతి ఒక్కరి ఫోన్లను గుంజుకుని, బైటికి సమాచారం అందకుండా చేశారు. మూడు నాలుగు గంటలపాటు ప్రింటింగ్ ప్రెస్ లో సోదాలు నిర్వహించి, అచ్చయి, బైండింగ్ అయి ఉన్న 'సాయుధ శాంతి స్వప్నం' అనే పుస్తకం కాపీలను, ఇంకా బైండింగ్ జరగని ఫారాలను, ప్రింటింగ్ ప్లేట్లను, ప్రెస్ లోని కంప్యూటర్ పరికరాలను జప్తు చేసుకున్నారు. ప్రెస్‌లో ప్రవేశించడానికి ముందే యజమాని రామకృష్ణారెడ్డి అనుమతి తీసుకోవలసి ఉండగా, ఈ దాడి, సోదా అంతా అయిపోయిన తర్వాత, నాలుగు గంటల తర్వాత యజమానికి తెలియజేసి, ఆయన మీద, ఆయన సహచరి సంధ్య మీద కేసు పెట్టారు. ఈ చర్యలన్నీ తెలంగాణలో కనీస, రాజ్యాంగబద్ధ, చట్టబద్ధ ప్రాథమిక హక్కులను కూడ ప్రభుత్వం గౌరవించదలచుకోలేదనడానికి చిహ్నం.

ఒక పుస్తకంలోని రచనలు, వివరాలు తెలియకుండా దాన్ని నిషేధించడానికి వీలు లేదు. ఆ వివరాలన్నీ తెలియజేస్తూ, వాటిలో ఏది అభ్యంతరకరమో, శాంతిభద్రతలకు భంగకరమో చూపుతూ ఆ పుస్తకాన్ని నిషేధించడానికి, ఆ నిషేధాన్ని గెజిట్ లో ప్రకటించడానికి ప్రభుత్వానికి చట్టబద్ధంగానే అధికారం ఉంది. అలా నిషేధించబడిన పుస్తకాన్ని తప్ప మరే పుస్తకాన్నీ జప్తు చేయడానికి ఎవరికీ అధికారం లేదు. అది ఇంకా బైటికి రాకముందే ప్రింటింగ్ ప్రెస్‌లో ఉండగానే జప్తు చేయడం నూటికి నూరు శాతం అక్రమం. అది అచ్చువేసిన వ్యాపార సంస్థ యాజమానుల మీద కేసు పెట్టడం రాజ్యాంగబద్ధ హక్కు అయిన వ్యాపార స్వేచ్ఛను ఉల్లంఘించడమే. వ్యాపారంగా నడుపుకునే ప్రింటింగ్ ప్రెస్ కు ఎవరు వచ్చి ఏది అచ్చువేసి పెట్టమని అడిగినా, దాని విషయంతో సంబంధం లేకుండా కేవలం వ్యాపారంగా అచ్చు వేసిపెడతారు. వారికీ పుస్తకం లోని విషయానికీ ఎటువంటి సంబంధమూ ఉండదు. అటువంటి యజమానుల మీద కేసు పెట్టడం అక్రమం, చట్టవ్యతిరేకం.

అలాగే పుస్తకంలో ఏమున్నదో తెలియకుండానే, కేవలం ప్రచారంలోకి వచ్చిన పుస్తకం శీర్షికను బట్టి ఆ పుస్తకావిష్కరణ సభను అడ్డుకోవడం, హాలు యజమానుల మీద ఒత్తిడి తేవడం కూడ తెలంగాణలో కనీస పౌరహక్కులు మృగ్యమైపోతున్నాయనడానికి గుర్తు.

మొట్టమొదట కలుసుకోవడం, కలిసి మాట్లాడుకోవడం, సమావేశం పెట్టుకోవడం మనుషుల నైసర్గిక లక్షణాలు. వాటినే హక్కులుగా గుర్తించి రాజ్యాంగం హామీ ఇచ్చింది. రాజ్యాంగ ప్రకారమే అటువంటి సభలు, సమావేశాల మీద కొన్ని ప్రత్యేక సందర్భాలలో "సహేతుకమైన ఆంక్షలు విధించడానికి" మాత్రమే ప్రభుత్వానికి అధికారం ఉంది గాని ఆ హక్కును పూర్తిగా కొల్లగొట్టి సభను రద్దు చెయ్యడానికి, అనుమతి నిరాకరించడానికి అధికారం లేదు. అసలు ఒక సభకు, సమావేశానికి అనుమతి కోరవలసిన అవసరమే లేదు. ఆ సభ వల్ల ట్రాఫిక్ కు అంతరాయం, మైకుల వల్ల పరిసర ప్రజలకు ఇబ్బంది కలుగుతాయనుకుంటే, ఆ ఇబ్బందులను నియంత్రించడం కోసం పోలీసులకు సమాచారం ఇవ్వడం మాత్రమే నిర్వాహకుల బాధ్యత. అది బహిరంగ ప్రదేశాలలో జరిగే సమావేశాలకు మాత్రమే. ప్రాంగణం లోపల, హాలు లోపల జరిగే సభలకు అనుమతి కోరనవసరమూ లేదు, సమాచారం ఇవ్వవలసిన అవసరమూ లేదు. కాని నానాటికీ పెరిగిపోతున్న పోలీసు రాజ్యం తనకు లేని అధికారాన్ని చేపట్టి సభలకు అనుమతి కోరాలనే అక్రమ శాసనాన్ని విధిస్తున్నది. హాలు యజమానులను బెదిరించి, హాలుకు అడ్డంగా నిలబడి సభకు

# ఇంధన ధరల ఇరకాటంలో కేంద్రం

*అంతర్జాతీయ మార్కెట్‌లో చమురు ధరలు తగ్గినా కేంద్రం దేశంలో వాటి ధరలను అంతకంతకూ పెంచుతూ రాష్ట్రాలకు ఇవ్వాల్సిన వాటాను కూడా ఇవ్వకుండా సమాఖ్య స్ఫూర్తిని దెబ్బతీస్తుందని అంటున్నారు* **డా. ఎ. పున్నయ్య**

ఏడున్నర సంత్సరాలుగా ఎగిసిపడిన పెట్రోల్ ధరల అగ్ని కీలలకు బలి అయ్యే అనివార్య పరిస్థితుల నేపథ్యంలో నుండి బయట పడడానికి కేంద్రం ఉక్కిరి బిక్కిరి అవుతుంది. దేశవ్యాప్తంగా సామాన్య మధ్యతరగతి ప్రజల్లో నిశ్శబ్ద వ్యతిరేకత గూడుకట్టుకుంటున్న వైనం ఒక వైపు ఉండగా, మరొకవైపు ఇటీవలి దేశవ్యాప్త వివిధ రాష్ట్రాల్లో శాసనసభ, పార్లమెంట్ స్థానాల ఉప ఎన్నికల్లో వెలిసిపోయిన కాషాయాన్ని చూసి కళ్లు బైర్లు కమ్మిన కేంద్రం ఒక్క సారిగా ఉలిక్కి పడింది. తమ సంపాదనను ఇబ్బడి ముబ్బడిగా పెంచుకోవడానికి సహకరించిన కేంద్రానికి కృతజ్ఞతగా అదానీ, అంబానీ లాంటి కార్పొరేట్ సంస్థలు కురిపించే కాసులకు ఓట్లు రాలవని, సీట్లు దక్కవని తెలుసుకున్న ప్రభుత్వం ప్రజానుకూల పల్లవి ఎత్తుకుంది. స్వయం కృతాపరాదానికి రాబోయే రాష్ట్రాల అసెంబ్లీ ఎన్నికల్లో మరిన్ని దుష్ఫలితాలను చవిచూడాల్సి వస్తుందన్న వాస్తవాన్ని గ్రహించి దిద్దుబాటు చర్యల్లో భాగంగా పెట్రో ధరల నామమాత్రపు తగ్గింపు ప్రకటించి ప్రజల అభిమానాన్ని చూరగొనాలని ఎత్తుగడ వేసింది. ప్రభుత్వం పశ్చాత్తాపంతో ఈ పనిచేసింది అనడం అనేదానికన్నా పలుచనైపోతున్న తమ అధికార బలాన్ని కాపాడుకోవడానికి పెట్రోల్ ధరల తగ్గుదలకు పూనుకుందన్న ప్రచారమే ప్రబలమైంది. ఇందులో ప్రభుత్వ ఆలోచన దాని పర్యవసానాలను, ప్రభుత్వం ప్రజల పక్షాన ఆలోచించాల్సిన అవసరం గురించి చర్చించాల్సి ఉంది.

ఇటీవల దేశవ్యాప్తంగా ఉప ఎన్నికల్లో ప్రజలు ఇచ్చిన తీర్పు ఫలితంగా నిత్యావసర ఇంధనాలైన పెట్రోల్, డీజీల్ ధరలను నామమాత్రంగా పెట్రోల్‌పై రు. 10, డీజీల్‌పై రు. 5 తగ్గించింది. ఇది పేద, మధ్యతరగతి ప్రజలపై ప్రేమతో కాదు, ప్రభుత్వం ప్రకటించినట్లు దీపావళి కానుక కాదు. అట్లాగే దేశం కోసం ఎంతగానో శ్రమిస్తున్న రైతులకు ప్రయోజనం కలిగించడానికి కానేకాదు. వాస్తవానికి ఈ రెండూ అసలు కారణాలు కావని, ఉప ఎన్నికల్లో ఈ ప్రభుత్వానికి ఊహించని ఎదురు దెబ్బలు తగిలినందున ఈ ధరల తగ్గింపుకు తప్పనిసరై తలవంచింది. ఉత్తరప్రదేశ్, హర్యానా, ఉత్తరాఖండ్, పంజాబ్, గోవా రాష్ట్రాల అసెంబ్లీలకు ఎన్నికలు సమీపిస్తుండడంతో పరాజయం పాలవుతామన్న భయంతో ఇంధన సుంకం స్వల్పంగా తగ్గించిందన్నది బహిరంగ రహస్యం. నిజానికి ఈ సంవత్సర కాలంలో పెంచింది కొండంత, ఇప్పుడు తగ్గించినది రవ్వంత. ప్రభుత్వం చేస్తున్న ప్రచారం ఆకాశమంత. ఈ తగ్గింపు అనంతరం కూడా ఈ రెండు ఇంధనాల ధరలు రు. 100కు పైగా ఉండడం గమనార్హం. ప్రస్తుత తగ్గింపు ప్రజల్లో ఉత్సాహం, సానుభూతి కలిగిస్తుందని ప్రభుత్వం భావించింది. కానీ ప్రభుత్వం ఊహించినట్టు ఈ తగ్గింపు ప్రభుత్వానికి ఎటువంటి ప్రయోజనం కల్గించలేకపోయింది. పిసరంత ధరలు తగ్గించగలిగిన కేంద్రం ఈ పనిని చాలా కాలం ముందే చేసి అక్కడి నుంచి వాటిని పెరగకుండా చూసి ఉంటే ప్రజలకు నికరమైన ప్రయోజనం కలిగి ఉండేది. నియంత్రిత ధరల విధానానికి స్వస్తి చెప్పామని, అంతర్జాతీయ క్రూడాయిల్ ధరను బట్టి దేశంలో పెట్రోల్, డీజీల్ వాటంతట అవే ప్రియమైపోతాయని, తామేమీ చేయలేమని కేంద్ర పాలకులు చెప్పిన మాటల గారడీని ప్రజలు అర్థం చేసుకోవడంతో ఇప్పుడెలా తగ్గించగలిగారు అనే ప్రశ్న ప్రజల్లో సహజంగానే ఉత్పన్నమౌతుంది.

### తగ్గింపుకు తలొగ్గని రాష్ట్రాలు – తత్కారణాలు

కేంద్రం పెట్రల్, డీజీల్ ధరలను నామమాత్రంగా తగ్గించగానే బిజెపి పాలనలో గల రాష్ట్రాలు తగ్గించడం వెనుక ప్రధానంగా ఇతర పార్టీల పాలనలోని రాష్ట్రాలపై ఒత్తిడి తీసుకురావడంవంటి భారీ రాజకీయ వ్యూహం దాగి ఉంది. నిజానికి కేంద్రంలో ఈ ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తర్వాత పెట్రోల్, డీజీల్‌పై అకారణంగా, అదే పనిగా ఎక్సైజ్ సుంకాన్ని పెంచివేస్తూ వచ్చింది. గత ఆరు ఆర్థిక సంవత్సరాల్లో ఈ రెండు ఇంధనాలపై ఎక్సైజ్ సుంకాన్ని కేంద్రం 307 శాతం పెంచేసింది. పెట్రోల్‌పై 206 శాతం, డీజీల్‌పై 377

---

వస్తున్నవారిని అరెస్టు చేసి ప్రాంగణం లోపలి సభలు కూడ జరగకుండా చేస్తున్నది. అలా నవంబర్ 14న జరగవలసిన పుస్తకావిష్కరణ సభ జరగకుండా చేసింది.

ఆ పుస్తకం ఇటీవల అనారోగ్యంతో మరణించిన విప్లవోద్యమ నాయకుడు రామకృష్ణ మీద వచ్చిన సంస్మరణ రచనల, రామకృష్ణ రచనల సంకలనం అని నవంబర్ 15న జరిగిన పత్రికా సమావేశంలో ఆయన సహచరి శిరీష చెప్పారు. అందులో రామకృష్ణ మరణానంతరం స్పందనగా వచ్చిన పాటలు, కవితలు, వ్యాసాలు, సంతాప ప్రకటనలు, శిరీష ఇంటర్వ్యూలు ఉన్నాయి. ప్రభుత్వానికీ విప్లవోద్యమ నాయకులకూ జరిగిన చర్చల సందర్భంలో రామకృష్ణ రాసిన వ్యాసాలు, ఇచ్చిన ఇంటర్వ్యూలు కూడా ఉన్నాయి. ఆ రచనలన్నీ ఇదివరకే పత్రికల్లో, టివి ఛానళ్లలో, సోషల్ మీడియాలో వెలువడినవే. అలా ఇప్పటికే అచ్చయిన, వెలుగుచూసిన రచనలను సంకలనంగా ప్రచురించడాన్ని నిషేధించవలసిన చర్యగా చూడడం తెలంగాణ ప్రభుత్వం సాగిస్తున్న ప్రాథమిక హక్కుల హననానికి పరాకాష్ట.

*(రచయిత జర్నలిస్టు)* వీ

శాతం పెరిగింది. 2014లో పెట్రోల్‌పై లీటర్‌కు రు.9.48గా ఉన్న ఎక్సైజ్ సుంకం ఇప్పుడు 32.90కి చేరింది. అలాగే డీజీల్‌పై సుంకం రు. 3.56 నుంచి 31.80కి ఎగబాకింది. డీజీల్ ప్రజా రవాణా ఇంధనం గనుక ప్రెటోల్ ధర కంటే 10 నుండి 15 రూపాయలు తక్కువగా ఉండేది. ఈ ప్రభుత్వం ఆ వ్యత్యాసాన్ని కూడా తొలగించి వేసింది. 2020 ఏప్రిల్, 2021 జనవరి మధ్య వీటిపై పెంచిన ఎక్సైజ్ సుంకం నుంచి కేంద్రానికి రు. 2.94 లక్షల కోట్ల ఆదాయం సంక్రమించింది. 2014-15లో పెట్రోల్, డీజీల్‌పై సెంట్రల్ ఎక్సైజ్ సుంకం 5.4 శాతం మాత్రమే ఉండేది. 2020-21లో అంతర్జాతీయంగా క్రూడాయిల్ ధరలు బాగా తగ్గినప్పుడు కూడా ఇది 12.2 శాతానికి చేరుకొంది. కన్ను గానని ప్రభుత్వం గత ఏడాది క్రూడాయిల్ ధరలు పడిపోయినా సరే లీటర్ పెట్రోల్‌పై రు. 13, డీజీల్‌పై రు. 16 వంతున ఎక్సైజ్ బాదుడు బాదింది. ప్రజలు ప్రభుత్వ విధానాలను క్రమంగా అర్థం చేసుకొని వ్యక్తం చేయలేని అసహాయ స్థితికి చేరుకొని అవకాశం కోసం ఎదురు చూస్తున్నారు.

### అంతర్జాతీయంగా తగ్గిన క్రూడాయిల్ ధరలు

2014-15 నుంచి పెట్రోల్, డీజీల్‌పై కేంద్ర పన్నుల ఆదాయం 126 శాతం పెరిగింది. ఇటీవలి కొవిడ్ కాలంలో అంతర్జాతీయంగా క్రూడాయిల్ ధరలు గత రెండు దశాబ్దాల్లో ఎన్నడూ లేనంత దిగువకు పడిపోయాయి. అనియంత్రిత ధరల వ్యవస్థ ప్రకారమైతే ఆ సమయంలో దేశంలో పెట్రోల్, డీజీల్ చిల్లర ధరలు బాగా తగ్గిపోయి ఉండాల్సింది. దశాబ్దాల కాలంగా ప్రభుత్వాలు పెట్రోల్ ధరలను పెంచుతున్నప్పటికీ ఈ ప్రభుత్వం మొదటి సారిగా అధికారంలోకి వచ్చే నాటికి 2014 మేలో అంతర్జాతీయ మార్కెట్‌లో బ్యారెల్ ముడి చమురు ధర 109 డాలర్లు కాగా, దేశంలో లీటర్ పెట్రోల్ రు.72, డీజీల్ రు. 55 ఉండేది. ప్రస్తుతం ముడి చమురు ధర 83 డాలర్లకు తగ్గినా పెట్రోల్, డీజీల్ ధరలు వంద దాటిన దుస్థితి నెలకొంది. ఈ ఏడేండ్లలో బ్యారెల్ ముడి చమురు ధర కనిష్ఠంగా 37 డాలర్లకు కూడా పడిపోయింది. ఇంత తగ్గినా కూడా కేంద్రం చమురు ధరలు తగ్గించకపోగా పెంచుతూ పోయింది. అది కూడా రాష్ట్రాలకు ఎక్కడ పంచి ఇవ్వాల్సి వస్తుందోనని పన్ను రూపంలో కాకుండా సెస్ రూపంలో పెంచింది. తద్వారా రాష్ట్రాలకు రాజ్యాంగబద్ధంగా దక్కాల్సిన వాటా ఇవ్వకుండా మొత్తం పెంపును ఖజానాలో నింపుకొన్నది. రు.40 వరకూ పెంచిన పెట్రోల్ మీద రు.10, రు. 50 పెంచి డీజీల్ మీద రు. 5 తగ్గించడాన్ని చూసి అటు రాష్ట్రాలతో పాటు ఇటు ప్రజలు నవ్వుకుంటున్నారు.

### రాజ్యాంగ స్ఫూర్తికి విరుద్ధమైన సెస్ పెంపుదల

15వ ఫైనాన్స్ కమిషన్ వెల్లడించిన వివరాల ప్రకారం కేంద్రం తన ఆదాయాన్ని పెంచుకుంటూ రాష్ట్రాలకు మొండిచేయి చూపుతుంది. నిజానికి రాష్ట్రాలపై 62 శాతం వ్యయ బాధ్యతలున్నాయి. కానీ రెవెన్యూలో రాష్ట్రాలకు దాదాపు 37 శాతం వాటానే అందిస్తుంది. కేంద్రానికి ఉన్న వ్యయ బాధ్యతలు 38 శాతముంటే రెవెన్యూలో దాదాపు 63 శాతం పొందుతున్నది. కానీ కేంద్రం పన్ను రూపంలో వసూలు అయ్యే మొత్తంలో రాష్ట్రాలకు వాటా ఇవ్వాల్సి వస్తుందని, సెస్‌ను పెంచుకుంటూ పోతున్నది. డివిజిబుల్ పూల్ పన్ను జిడిపిలో 8.05 శాతం ఉండగా సెస్ 1.85 శాతంగా ఉండబోతున్నది. దీనివల్ల ప్రత్యక్షంగా పరోక్షంగా ప్రజల నడ్డివిరిచి వసూలు చేస్తూనే, రాష్ట్రాలకు వాటా ఎగ్గొడుతున్నది. ఇది రాజ్యాంగ స్ఫూర్తికి విరుద్ధమే.

### 'సెస్'తో రాష్ట్రాల ఆదాయానికి గండి కొడుతున్న కేంద్రం

పన్నుల మీద పన్ను వేస్తే దానిని 'సెస్' అంటారు. మొదట్లో కేంద్ర ప్రభుత్వం విధించే ఈ సెస్‌లో రాష్ట్రాలకు కూడా భాగస్వామ్యం ఉండేది. కానీ 80వ రాజ్యాంగ సవరణ ఆర్టికల్ 269, 270, 272ను సవరించి 'సెస్'ను డివిజిబుల్ పూల్ (రాష్ట్రాలతో పంచుకునే పన్నులు) నుంచి మినహాయించింది. ఈ సవరణ వల్ల సెస్‌లను, సర్‌ఛార్జ్‌లను కేంద్ర ప్రభుత్వం రాష్ట్రాలతో పంచుకునే అవకాశం లేకుండా పోయింది. (జిఎస్‌టిలో మాత్రం సెస్‌ను చేర్చారు) కేంద్రం సెస్‌ను కానీ, సర్‌ఛార్జీని కానీ ఏదైనా నిర్దిష్ట ప్రయోజనం కోసం సేకరించవచ్చు. దాన్ని మొదట కన్సాలిడేటెడ్ ఫండ్‌లో జమచేసి, పార్లమెంట్‌లో ఆమోదం తదుపరి ఆ ప్రత్యేకమైన ప్రయోజనం కోసం ఖర్చు చేయవలసి ఉంటుంది. 2014లో లీటర్ పెట్రోల్‌పై ఎక్సైజ్ సుంకం రు.10 కాగా ఇప్పుడు రు.33, డీజీల్‌పై రు.5 కాస్తా రు. 32 అయింది. పెట్రో ఉత్పత్తుల విక్రయంపై పన్నుల ద్వారా కేంద్రానికి 2014లో రు.75 వేల కోట్ల ఆదాయం రాగా, 2021లో రు. 3.60 లక్షల కోట్లు. కరోనా మహమ్మారి సమయంలోనూ పన్నుల బాదుడు ఆగలేదు సరికదా అప్రతిహతంగా సాగింది. నిర్దిష్ట ప్రయోజనం కోసమని ప్రవేశపెట్టిన ఈ వెసులుబాటును కేంద్రం ఏ విధంగా ఉపయోగించు కుంటున్నదనేది గమనార్హం. కాలక్రమేణా కేంద్ర ప్రభుత్వం వసూలు చేసే సెస్ మొత్తం విపరీతంగా పెరిగింది. 2011-12కు ముందు 92,537 కోట్లుగా ఉన్న సెస్ 2020-21 నాటికి సుమారు 4,81,767 కోట్లకు చేరుకున్నది. ఈ పెరుగుదల ఒక దశాబ్ద కాలంలో 5 రెట్లుగా నమోదైంది. ఇప్పటికీ పెట్రోల్‌పై లీటర్‌కు రు. 20.5 సెస్ ఉండగా, డీజీల్‌పై లీటర్‌కు రు. 22 ఉంది. రాజ్యాంగం ప్రతిపాదించిన ఆర్థిక సమాఖ్య వాదాన్ని బిజెపి తుంగలో తొక్కుతూ, సెస్‌ను విపరీతంగా పెంచుతూ రాష్ట్రాలకు మొండి చేయి చూపుతున్నది. రాష్ట్రాల ఆదాయానికి గండి కొడుతూనే, మరో వైపు పెట్రోల్, డీజీల్ ధరలను తగ్గించాలని రాష్ట్రాలకు సూచించడం రాజ్యాంగ స్ఫూర్తికి విరుద్ధం.

### పెట్రోలియం పన్నులతో పెరిగిన కేంద్ర ఆదాయం

కేంద్రం రోజురోజుకు పెంచుతూ వస్తున్న పెట్రోలియం పన్నుల ద్వారా గడిచిన అయిదు సంవత్సరాల్లో కేంద్రానికి లభించిన ఆదాయం ద్విగుణీకృతమైంది. పెట్రోలియమ్ ప్లానింగ్ అండ్ ఎనాలసిస్ సెల్ డేటా ప్రకారం పెట్రోలియమ్ రంగంపై వివిధ రకాల పన్నుల ద్వారా కేంద్రానికి 2014-15లో రు. 1.72 లక్షల కోట్లు వస్తే, ఇప్పుడది ఏకంగా రు. 3.35 లక్షల కోట్లకు చేరింది. అందులో రాష్ట్రాలకు దక్కేది రు. 19,475 కోట్లే. అంటే 5.8 శాతమే. ఒకవైపున అంతర్జాతీయ సగటు క్రూడాయిల్ ధరలు గణనీయంగా తగ్గినా సరే, సామాన్యుడు కొనే పెట్రోల్, డీజీల్ రేట్లు చుక్కలనంటాయి. 2019 మేలో లీటర్ పెట్రోల్ రు. 76.89, డీజీల్ రు. 71.50 ఉండేవి. పాలకుల విధానాల ఫలితంగా రెండున్నరేళ్లలో ఈ ఏడాది నవంబర్ 1 నాటికి పెట్రోల్ రు. 115.99, డీజీల్ రు. 108.66కు సర్రున పెరిగాయి. ఇది కళ్లెదుటి నిజం. గడచిన రెండేళ్లలో పెట్రోల్, డీజీల్ రేట్లపై విధించే ఎక్సైజ్ సుంకం రూపురేఖలనే కేంద్ర సర్కారు

మార్చేసింది. నిజానికి ఇంధనంపై కేంద్రం వసూలు చేసే పన్నుల్లో 41 శాతం వాటాను రాష్ట్రాలకు పంచవలసి ఉంటుంది. కానీ, కేంద్రం తెలివిగా పెరిగిన పెట్రోల్ ఆదాయం డివిజబుల్ పూల్‌లోకి రాకుండా, సెస్‌లు, సర్‌ఛార్జ్‌ల రూపంలోనే రు. 2,87,500 కోట్లు వసూలు చేసింది. అలా వచ్చినదాన్ని రాష్ట్రాలకు ఇచ్చే పని లేకుండా, తన దగ్గరే ఉండిపోయేలా కేంద్రం ఎత్తు వేసింది. న్యాయబద్ధంగా తమకు రావాల్సిన వాటాకు కేంద్రం ఇలా గండి కొట్టడంతో, రాష్ట్రాలు గతంలో సాక్షాత్తూ 15వ ఆర్థిక సంఘానికి ఫిర్యాదు కూడా చేశాయి.

**కేంద్రం రాజ్యాంగబద్ధంగా వ్యవహరించాలి**

కేంద్రం ఫెడరల్ స్ఫూర్తితో వ్యవహరించాలి. రాష్ట్రాలకు రావాల్సిన వాటాను ఏప్పటికప్పుడు పంపిణీ చేయాలి. సెస్, సర్‌ఛార్జీల రూపంలో తన ఖజానాను నింపుకుంటున్న కేంద్రం ఆ నిష్పత్తిలో రాష్ట్రాల ఆదాయ పెరుగుదలకు సహకరించాల్సి ఉంటుంది. కానీ వాస్తవ పాలనలో ఈ ఆలోచన కరువైంది. అందుకే కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు కేంద్రం ఇచ్చిన ఆదేశ సూత్రాల వంటి విజ్ఞప్తిని తోసిపుచ్చాయి. ఇటీవల చమురు మీద రాష్ట్ర ప్రభుత్వం విధిస్తున్న వ్యాట్‌పై గత ఆరేండ్లలో నయా పైసా పెంచలేదని, కాబట్టి తాము ఎందుకు తగ్గించాలని కొన్ని రాష్ట్రాల ముఖ్యమంత్రులు కేంద్రాన్ని ప్రశ్నించడం న్యాయంగానే కన్పిస్తుంది. కేంద్రానికి నిజంగా చిత్తశుద్ధి ఉంటే విచక్షణారహితంగా పెంచిన సెస్‌ను ఇప్పటికైనా ఉపసంహరించుకోవాలి. కానీ, కేంద్ర సర్కార్‌లో ఆ భావన ఉన్నట్లు కనిపించడం లేదు. దిశా నిర్దేశం చేయాల్సిన కేంద్రం ప్రతి అంశాన్నీ రాజకీయ కోణంలో చూడడం దేశానికి మంచిది కాదు. అడ్డూ అదుపూ లేకుండా పెట్రోల్ ధరలు, తద్వారా నిత్యావసరాల ధరలు పెరిగిపోతే అది ద్రవ్యోల్బణానికి దారితీసే ప్రమాదమున్నదని ఆర్థికవేత్తలు హెచ్చరిస్తున్నారు. కేంద్రం ఈ మాటలను ఇప్పటికైనా చెవిన పెట్టాలి. ఏకపక్ష వైఖరిని మానుకొని రాజ్యాంగబద్ధంగా వ్యవహరించాలి.

**సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాలు - ఇంధన ధరల పెంపు:**

ప్రభుత్వాలు అనుసరించిన నయా ఉదారవాద ఆర్థిక విధానాలే ఇంధన ధరల పెంపుకు కారణమయ్యాయి. ఇటీవల వాస్తవానికి కొవిడ్ కోట్లాది మంది సాధారణ ప్రజల ఉద్యోగాలను, ఉపాధులను నాశనం చేసింది. పేద, మధ్యతరగతి కుటుంబాలతో క్రూర క్రీడ సాగించింది. ఆ సమయంలో అంతర్జాతీయ క్రూడాయిల్ ధరను బట్టి ఇక్కడ పెట్రోల్, డీజీల్ ధరలు తగ్గించాల్సిన ప్రభుత్వం పేద జనం జేబులకు పెట్రోల్ ధరల మంటలను అంటించింది. అభివృద్ధి చెందిన దేశాల ప్రభుత్వాలు సాధారణ ప్రజలకు ఊరట కలిగించడం కోసం సంపన్నుల పన్నులను పెంచడానికి నిర్ణయించింది. కానీ ఈ సంక్షోభ సమయంలో కూడా మన కేంద్ర పాలకులు మాత్రం పేదల నుండి వసూలు చేసి కార్పొరేట్లకు మేలు చేసే విధానాన్నే కొనసాగించారు. దేశంలో 1991లో పి.వి. నర్సింహారావు హయాంలో మొదలైన సరళీకరణ శకంతో క్రమంగా చమురు రంగాన్ని మార్కెట్ శక్తుల పరం చేయనారంభమైంది. వాజ్‌పేయ్ ప్రభుత్వంలో పెట్రోల్, డీజీల్ ధరలపై నియంత్రణ ఎత్తివేసేందుకు గట్టి ప్రయత్నం జరిగింది. యుపిఎ-1లో ఆ ప్రయత్నం జరిగినప్పటికీ, లెఫ్ట్ మద్దతుపై ప్రభుత్వ మనుగడ ఆధారపడినందున అంతలా కుదరలేదు. యుపిఎ-2 ప్రభుత్వం వచ్చాక 2010లో పెట్రోల్‌పై కంట్రోల్ పూర్తిగా ఎత్తేశారు.

2014లో మోడీ రాగానే డీజీల్ పైనా నియంత్రణ రద్దు చేశారు. ఎప్పుడైతే ప్రభుత్వ కంట్రోల్ ఎత్తేశారో అప్పటి నుండి ఇంధన ధరలు రోజుకో తీరుగా మారుతున్నాయి. ధరల నిర్ణయంలో హేతుబద్ధత కొరవడింది. ఇంధన రంగ దిగ్గజాలైన రిలయన్స్ వంటివి సహజ వనరులను, మార్కెట్‌ను తమ గుప్పెట్లో పెట్టుకుంటున్నాయి. ఈ విధానమే ఇంధన ధరల పెరుగుదలకు మూలం. సదరు విధానాలను ప్రజలు ప్రతిఘటిస్తేనే ఇంధన ధరల పెరుగుదల నుండి విముక్తి లభిస్తుంది. పెట్రోల్, డీజీల్‌ను ఆదాయ వనరుగా, రాజకీయ అస్త్రంగా ప్రభుత్వాలు భావించడం వాటి మనుగడకే ప్రమాదమన్నంత తీవ్ర స్థాయిలో అవకాశం వచ్చినప్పుడల్లా ఉద్యమించినప్పుడే ప్రభుత్వాలు కళ్లు తెరుస్తాయి. దీనికి తాజాగా అలుపెరగని పోరాటంతో ప్రభుత్వం అహంకార పూరితంగా చేసిన శాసనాలకు, చట్టాలకు మరణశాసనం రాసిన సైనికుల సమరశీల పోరాటమే ప్రత్యక్ష తార్కాణం. ఆ ఉద్యమం పరోక్షంగా ఓటు రూపంలో కావచ్చు, ప్రత్యక్ష నిరసన రూపం కావచ్చు. అంతిమంగా అది ప్రజలు నిర్వహించవల్సిందే.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలంగాణ విశ్వవిద్యాలయం)*

వీ

## జలజం సత్యనారాయణ స్మృతి

*పాలమూరు జిల్లాకు చెందిన ప్రముఖ విద్యావేత్త, పత్రికా సంపాదకులు, తెలంగాణ ఉద్యమనాయకులు జలజం సత్యనారాయణ (77) నవంబర్ 4న మరణించారు. పాలమూరు జిల్లా బాలానగర్ మండలం రంగారెడ్డిగూడకు చెందిన జలజం సత్యనారాయణ జడ్చర్ల, వనపర్తి, నిజామాబాద్, మహబూబ్‌నగర్, హైదరాబాద్‌లలో ఉపాధ్యాయుడిగా, జూనియర్, డిగ్రీ కళాశాలల అధ్యాపకుడిగా పనిచేశారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో రాజనీతి శాస్త్రంలో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా కూడా పనిచేశారు. లిటిల్ స్కాలర్స్ హైస్కూల్ మహబూబ్‌నగర్, బోధి పబ్లిక్ స్కూల్ హైదరాబాద్ జిల్లాల్లో స్థాపించి అనేకమంది విద్యార్థులను ఉన్నత స్థాయిలో తీర్చిదిద్దారు. నిరుపేద విద్యార్థులకు ఉచితంగా ఉత్తమ విద్యను అందించారు. అనేక హిందీ, ఉర్దూ, ఆంగ్ల, చైనా భాషా గ్రంథాలను తెలుగులోకి అనువదించి తెలుగులో అనువాద సాహిత్యానికి ఒక బలమైన ముద్ర వేశారు. తొలి, మలి దశ తెలంగాణ ఉద్యమాలలో చురుకుగా పాల్గొన్న తెలంగాణ ఉద్యమనాయకుడు. ప్రముఖ సాహితీవేత్త కాళోజీ నారాయణరావు, విప్లవ రచయితల సంఘం నేత వరవరరావులకు దగ్గరి సన్నిహితుడు. అభ్యుదయ భావాలతో, మానవీయ కవితా స్ఫూర్తితో కవితలను సేకరించి తన సంపాదకత్వంలో 'మానవుడే మా సందేశం' అనే సంకలనానికి సంపాదకత్వం వహించారు. 1970 లలో మహబూబ్‌నగర్‌లో 'న్యూ థింకర్స్ ఫోరమ్' అనే సంస్థను స్థాపించి అనేక కార్యక్రమాలను నిర్వహించారు. 'ధ్వని''అనే సాహిత్య సాంస్కృతిక సంస్థను స్థాపించి వందలాది సాహిత్య, సాంస్కృతిక, సామాజిక కార్యక్రమాలను ఏర్పాటు చేశారు.*

# వరి సమస్యపై బిజెపి, టిఆర్ఎస్ నాటకాలు

*కేంద్ర, రాష్ట్ర అధికార పార్టీల మధ్య వివాదంగా మారిన వరి సమస్యను సమగ్రంగా చూపుతూ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు, రైతులు వహించవలసిన బాధ్యతను గుర్తు చేస్తున్నారు* **కన్నెగంటి రవి**

తెలంగాణలో వరి సేద్యం చేస్తున్న రైతులు తీవ్రమైన ఆందోళనలో ఉన్నారు. రోజురోజుకూ వరి పంట ఉత్పత్తి ఖర్చులు పెరిగిపోతున్నా, రుణమాఫీ హామీ అమలు కాక బ్యాంకుల నుండి పెట్టుబడికి అవసరమైన పంట రుణాలు అందకపోయినా, ఎక్కువ వడ్డీలతో ప్రైవేట్ రుణాల ఊబిలో కూరుకు పోతున్నా, రకరకాల తెగుళ్లతో ప్రతి సీజన్‌లో వరి పంట సగటు దిగుబడులు తగ్గిపోతున్నా, భారీ వర్షాలతో పంట నష్టపోయి బీమా పరిహారం రాకపోయినా, రైతులు కష్ట నష్టాల కోర్చి వరి సాగు చేస్తూనే ఉన్నారు.

రైతులకు గత రెండేళ్లుగా – పంట పండించడం ఒక ఎత్తైతే, పంటను అమ్ముకోవడం మరో ఎత్తు అవుతోంది. ఈ కారణంగా గతంలో పత్తి పంటకు మాత్రమే పరిమితమైన రైతుల బలవన్మరణాలు ఇప్పుడు వరి రైతులలోనూ చూస్తున్నాం. వరి సేద్యానికి భూముల కౌలు ధరలు భారీగా పెరిగిపోయి కౌలు రైతులు మరింత నష్ట పోతున్నారు.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు, ఆ ప్రభుత్వాలను నడుపుతున్న బిజెపి, టిఆర్ఎస్ పార్టీలు వరి పంట విషయంలో స్పష్టమైన విధాన ప్రకటనలు చేసి రైతులను ఆదుకోవడానికి ప్రయత్నం చేయకుండా, రాజకీయ వీధినాటకాలు ఆడుతున్నాయి. పరస్పరం విమర్శలు చేసుకుంటూ రోడ్లపై ధర్నాలకు దిగుతున్నాయి. పోటాపోటీగా యాత్రలకు పూనుకుంటున్నాయి. పరస్పరం రాళ్ల దాడులకు పాల్పడుతున్నారు. ఈ పరిస్థితిలో ఎవరు నిజం చెబుతున్నారో, ఎవరు అబద్ధాలు చెబుతున్నారో అర్థంకాక నిజంగా సమస్యను ఎదుర్కొంటున్న రైతులు మరింత గందరగోళంలో పడిపోతున్నారు.

నిజంగా పంటల సేకరణ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలలో ఎవరి బాధ్యతో, సేకరణ కేంద్రాల కోసం ఎవరిని నిలదీసి అడగాలో కూడా అర్థం కాక రైతులు సతమతమవుతున్నారు. కొన్ని ప్రాథమిక విషయాలను రైతులు అర్థం చేసుకోగలిగితే మాత్రమే ఏ ప్రభుత్వాన్ని ఏమి డిమాండ్ చేయాలో అర్థం అవుతుంది. రైతులు స్వయంగా తాము మార్చుకోవలసిన అంశాలు ఏమిటో కూడా అర్థం చేసుకుంటారు.

దశాబ్దాలుగా వరి సాగు చేస్తున్న రైతులకు కూడా – రా రైస్, బాయిల్డ్ రైస్ – లాంటి పదాలు అర్థం కావడం లేదు. నిజానికి ఇందులో గూఢార్థాలు ఏమీ లేవు. వరి ధాన్యంపై పొట్టు (ఊక), తవుడు తీసేసి బియ్యం చేయడం (ఎన్ని పొరల తవుడు తీసేస్తాం) అన్న దానిపై ఆధారపడి వాటిని పాలిష్డ్ బియ్యం, సెమీ పాలిష్డ్ బియ్యం, ముడి బియ్యం (బ్రౌన్ రైస్) అంటారు. సన్న ధాన్యమైనా, దొడ్డు ధాన్యమైనా ఖరీఫ్ సీజన్‌లో ఈ పద్ధతిలో ప్రధానంగా మిల్లింగ్ చేస్తారు. ధాన్యాన్ని వేడినీళ్లలో ఉడకపెట్టి, వేడి ఆవిరి పంపి, తిరిగి చల్లార్చి ధాన్యాన్ని మర (మిల్లింగ్) పట్టిస్తే వచ్చే బియ్యాన్ని పార్ బాయిల్డ్ రైస్ అంటారు. యాసంగిలో ఏప్రిల్, మే నెలలలో వచ్చే ధాన్యాన్ని ఈ పద్ధతిలో ఎక్కువ మిల్లింగ్ చేస్తారు. అధిక ఉష్ణోగ్రతల వల్ల, ధాన్యం మిల్లింగ్‌లో నూకలు ఎక్కువ అయ్యే అవకాశం ఉన్నందున, ఈ పద్ధతిలో మిల్లింగ్ చేస్తారనేది కొంత వాస్తవం. పార్ బాయిల్డ్ రైస్ కేరళ, తమిళనాడు లాంటి కొన్ని రాష్ట్రాల ప్రజలు తింటారు. తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలలో తినరు.

నిజానికి మామూలు బియ్యం కంటే పార్ బాయిల్డ్ రైస్‌లో పోషకాలు ఎక్కువ ఉంటాయి. కాని ఆహార అలవాట్లలో వచ్చిన మార్పుల వల్ల, ఆయా రాష్ట్రాలలో ప్రజలు సాధారణ మిల్లింగ్ నుండి వచ్చిన బియ్యంతో పోల్చినప్పుడు పార్ బాయిల్డ్ రైస్ వినియోగాన్ని తగ్గించారు. అందువల్ల ఎఫ్‌సిఐ కూడా పార్ బాయిల్డ్ రైస్ సేకరణను తగ్గిస్తున్నది. మరీ ముఖ్యంగా తెలంగాణతో సహా కొన్ని రాష్ట్రాలలో యాసంగిలో ఎక్కువ పార్ బాయిల్డ్ రైస్ వస్తున్నది కాబట్టి, ఆయా రాష్ట్రాల నుండి యాసంగిలో పార్ బాయిల్డ్ రైస్ సేకరించలేమని ఆగస్ట్‌లో జరిగిన అన్ని రాష్ట్రాల పౌర సరఫరా శాఖల అధికారుల సమావేశంలోనే ఎఫ్‌సిఐ చెప్పింది. ఆ తర్వాత కూడా రాష్ట్ర ప్రభుత్వాలతో జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలలో అదే విషయాన్ని స్పష్టం చేసింది. ఎఫ్‌సిఐ చెప్పిన దానిని రాష్ట్ర ప్రభుత్వం కూడా ఆమోదించింది.

పంజాబ్‌లో సేకరించి, తెలంగాణలో ఎఫ్‌సిఐ ఎందుకు సేకరించదు అని రాష్ట్ర ప్రభుత్వం ఇప్పుడు గగ్గోలు పెట్టడం కొన్నిసార్లు న్యాయంగానే కనిపించవచ్చు కానీ, ఆ వాదన సరిపోదు. పంజాబ్‌లో ఖరీఫ్‌లో ఎక్కువ బియ్యం సేకరిస్తారు. యాసంగిలో ఎక్కువ గోధుమలు సేకరిస్తారు. తెలంగాణలో రెండు సీజన్‌లలోనూ బియ్యమే సేకరిస్తారు.

పంజాబ్‌లో వరి ధాన్యం వినియోగం తక్కువ. కాని ఆ రాష్ట్రం వరి ధాన్యం పండిస్తున్నది. 1960 దశకంలో హరిత విప్లవ నమూనాగా ఆ రాష్ట్రం గుర్తింపు పొందింది. కారణాలు ఏమైనా, గత 50 ఏళ్లుగా పంజాబ్ ఆ కీర్తితో, కేంద్రం నుండి అన్నివిధాలా సహకారం పొంది, తన మార్కెట్ ను విస్తరించుకున్నది. సాగునీరు అందుబాటులో ఉండడంతో పాటు, మొదటి నుండీ హరిత విప్లవం పేరుతో అన్ని ప్రభుత్వాలూ వరి, గోధుమ పంటలనే ఆ రాష్ట్రంలో ప్రోత్సహిస్తూ వచ్చాయి. కేంద్ర, పంజాబ్ రాష్ట్ర ప్రభుత్వాల ఈ వైఖరి పంజాబ్ కు అన్నివిధాలా నష్టమే చేసింది. మిగిలిన రాష్ట్రాలకూ నష్టమే చేసింది. ఆ నష్టాల నుండి అన్ని ప్రభుత్వాలూ గుణపాఠాలు నేర్చుకోవాలి.

ఎఫ్‌సిఐ సేకరణ రీత్యా చూస్తే, పంజాబ్ తర్వాత తెలంగాణ మంచి ప్రయోజనమే పొందింది. నిజానికి ఇప్పుడు చేస్తున్న ప్రయత్నాలు ఫలించి, పంజాబ్‌లో ఖరీఫ్‌లో పంట మార్పిడి జరిగి ఎఫ్‌సిఐ అక్కడ ధాన్యం సేకరణ కొంత తగ్గిస్తే అప్పుడు నిజంగా ధాన్యం ఎక్కువ పండించే, తక్కువ సేకరణ జరిగే మరి కొన్ని రాష్ట్రాలకు

ప్రయోజనం లభిస్తుంది. తెలంగాణలో ఉండే ప్రత్యేక పరిస్థితుల దృష్ట్యా (ఖరీదైన విద్యుత్ వినియోగంతో సాగునీటి సరఫరా) ఎప్పుడైనా తెలంగాణలో వరి విస్తీర్ణాన్ని తగ్గించుకోవడం మంచిదే. ఈ విషయంలో పంజాబ్‌తో తెలంగాణా పోటీ పడనక్కర లేదు.

**ఆహార ధాన్యం సేకరణ - అంతర్జాతీయ ఒత్తిళ్లు**

వరి ధాన్యం సేకరణ మనకేదో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల లేదా బిజెపి-తెరాస వివాదంగా కనిపిస్తుంది కాని దీని వెనుక బయటకు కనిపించని ఆర్థిక, రాజకీయ అంశాలున్నాయి. ఈ వివాదం ఇప్పుడే ప్రారంభం కాలేదు. ఈ వివాదం ఇప్పుడే ముగిసేది కాదు. ఆ అంశాలను అర్థం చేసుకోవడం మనం మరింత జాగరూకులమై ఉండడానికి తోడ్పడుతుంది.

1990 దశకంలో భారతదేశంలో ప్రారంభమయిన నూతన ఆర్థిక, పారిశ్రామిక విధానాలు ఈ వివాదానికి ప్రాణం పోశాయి. సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ నినాదాలతో సాగుతున్న ఈ విధానాలు దేశంలో ప్రభుత్వరంగ సంస్థల ప్రాణం తీయడానికి పూనుకున్నాయి. అందులో భాగమే భారత ఆహార సంస్థ (ఎఫ్‌సిఐ)ను బలహీన పరచడం, అప్పుల ఊబిలో దింపేయడం. దేశ ప్రజా పంపిణీ వ్యవస్థ అవసరాలకు అనుగుణంగా సంస్థను తీర్చి దిద్దకుండా, కేవలం బియ్యం, గోధుమలు సేకరించే సంస్థగా, సేకరించిన బియ్యాన్ని అతి తక్కువ ధరలకు బడా వ్యాపారులకు, సంస్థలకు ధారపోసే సంస్థగా (ఇందులో అవినీతి అంతర్భాగం), ధాన్యం గిడ్డంగులను, నిల్వలను సరిగా నిర్వహించలేని సంస్థగా దిగజార్చేశారు.

1995లో పురుడు పోసుకున్న ప్రపంచ వాణిజ్య సంస్థ పేద దేశాల ఆహార భద్రతను మరింత సంక్షోభంలోకి నెట్టింది. ధనిక దేశాల పాలకులు తమ దేశాల రైతులకు/వ్యవసాయ కంపెనీలకు వివిధ పేర్లతో ఇచ్చే భారీ సబ్సిడీలను ఏ మాత్రం ప్రశ్నించని ఈ సంస్థ, పేద దేశాలలో రైతులకు ఇచ్చే సబ్సిడీలను తగ్గించాలని ఒత్తిడి చేస్తున్నది. డబ్ల్యుటిఓ ఉనికిలోకి వచ్చాక దిగుమతులపై ఆంక్షలకు అవకాశం లేకుండా పోయింది. భారత పాలకులు బడా వాణిజ్య సంస్థలకు అనుకూలంగా నిర్ణయాలు తీసుకుని వ్యవసాయ ఉత్పత్తుల దిగుమతులకు అనుమతులు ఇవ్వడం, ఫలితంగా మన దగ్గర సాగు చేసేందుకు అవకాశం ఉన్న అనేక వ్యవసాయ ఉత్పత్తులు చౌక ధరలతో భారత మార్కెట్‌ను ముంచెత్తడం ప్రారంభించాయి. దీనివల్ల భారత రైతులకు తాము పండించే పంటలకు సరైన ధరలు దొరకడం లేదు.

ప్రపంచీకరణ విధానాల వల్ల విదేశీ బడా బహుళ జాతి సంస్థలు భారతదేశంలోకి జొరబడ్డాయి. ముఖ్యంగా రిటైల్ రంగంలోకి ప్రవేశిస్తున్న విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు, రిటైల్ సంస్థలు (వాల్ మార్ట్, మెట్రో, అమెజాన్, ఫ్లిప్ కార్ట్ లాంటివి) మొత్తం వ్యవసాయ ఉత్పత్తుల రంగంపై పెత్తనానికి ఉవ్విళ్లూరుతున్నాయి. దేశీయ బడా వాణిజ్య సంస్థలు (రిలయెన్స్, అదానీ, టాటా, బిర్లా, డి-మార్ట్ , స్పెన్సర్స్ లాంటి సంస్థలు) విదేశీ రిటైల్ సంస్థలతో జట్టు కడుతున్నాయి. సంవత్సరానికి రు. 45 లక్షల కోట్ల విలువైన వ్యవసాయ రంగ ఉత్పత్తులపై పూర్తి ఆధిపత్యం సాధించాలని ఈ సంస్థలు ఎదురు చూస్తున్నాయి. అందుకు అనుగుణంగా దేశంలో ఉన్న మౌలిక వనరులపై ఇప్పటికే ఆధిపత్యం సాధిస్తున్నాయి. ఓడరేవులు, విమానాశ్రయాలు, గిడ్డంగులు, భూములు, ఖనిజాలు, అడవులు, నదీజలాలు ఈ సంస్థలకు అప్పగించి, ప్రభుత్వరంగాన్ని పూర్తిగా నిర్వీర్యం చేయడానికి కేంద్ర ప్రభుత్వం వేగంగా చర్యలు చేపడుతున్నది.

2020 జూన్ 6 నుండి అమలులోకి తెచ్చిన మూడు రైతు వ్యతిరేక, దేశ వ్యతిరేక చట్టాలు ఇందులో భాగమే. 2021లో పార్లమెంట్‌లో ప్రవేశపెట్టిన విద్యుత్ బిల్లు ఇందులో భాగమే. నదీజలాలపై, నిర్మాణమై ఉన్న ప్రాజెక్టులపై పెత్తనాన్ని కేంద్రం చేతుల్లోకి తీసుకోవడం కూడా ఇందులో భాగమే. మొత్తం ప్రభుత్వరంగ సంస్థలను 25 సంవత్సరాల లీజ్‌కు (మానెటైజేషన్) ఇవ్వడానికి కేంద్రం చేసిన నిర్ణయం ఆ వైపు వేసిన అతి పెద్ద అడుగు.

ప్రపంచబ్యాంకు సుదీర్ఘకాలంగా భారత ఆర్థిక వ్యవస్థను శాసిస్తూ వచ్చింది. ప్రభుత్వరంగ సంస్థల ప్రైవేటీకరణ, సబ్సిడీ పథకాల కుదింపు, నేరుగా నగదు బదిలీ పథకాల రూపకల్పన లాంటివి ప్రపంచబ్యాంకు ముద్దుబిడ్డలే. కేంద్రం, రాష్ట్రాలు చేసే అప్పులకు, తాను నిర్దేశించిన విధానాలకు ముడిపెట్టే విషయంలో ఎప్పుడూ ప్రపంచబ్యాంకు వెనక్కు పోలేదు. ఎరువులపై సబ్సిడీ తగ్గింపు, డీజిల్ సబ్సిడీ తగ్గింపు, రేషన్ దుకాణాల స్థానంలో ఆహార భద్రతా కూపన్లను ప్రవేశ పెట్టడం లాంటి పథకాలను చాలా కాలం క్రితమే కేంద్రంలో అధికారంలో ఉన్న ప్రభుత్వాలు ప్రవేశపెట్టడానికి ప్రపంచ బ్యాంకు ఒత్తిళ్లే కారణం.

ఆహార భద్రతా చట్టానికి తూట్లు పొడవాలని ప్రస్తుత కేంద్ర ప్రభుత్వం సీరియస్ గా ఆలోచిస్తున్నది. ఇప్పుడు ఆహార భద్రత కింద ఇస్తున్న బడ్జెట్ కేటాయింపుల రూపం మార్చాలని చూస్తున్నది. బియ్యం, గోధుమల సేకరణ నిలిపివేయాలని ఆలోచిస్తున్నది. ఇప్పటికే ఉన్న కొన్ని గిడ్డంగుల నిర్వహణను ఎఫ్‌సిఐ నుండి తొలగించి, అదానీ గ్రూప్‌కు ఇవ్వడం ఈ వైపు వేస్తున్న తొలి అడుగులుగా చెప్పుకోవచ్చు. ప్రజా పంపిణీ వ్యవస్థను (రేషన్ షాపులను) తొలగించి, బియ్యం సబ్సిడీ మొత్తాన్ని, నేరుగా నగదు బదిలీ రూపంలో లబ్ధిదారుల ఖాతాలలో వేయాలని ఆలోచిస్తున్నది. ఉదాహరణకు ఇప్పుడు 30 కిలోల బియ్యంపై కిలోకు 30 రూపాయల చొప్పున సబ్సిడీ ఇస్తుందనుకోండి. ఇకపై రేషన్ షాపుల ద్వారా బియ్యం సరఫరా చేయకుండా ఆ 900 రూపాయలను కార్డ్ హోల్డర్ ఖాతాలో వేస్తారన్న మాట. ఇందుకు అనుగుణంగా ఆహార కూపన్‌లు ముద్రించి ఇవ్వవచ్చు. అమెరికాలో పేదల కోసం ఇప్పటికే ఈ పద్ధతి అమలులో ఉంది. ఆ కూపన్ లు తీసుకుని మీరు మీకు నచ్చిన దుకాణం నుండి ఆహార ఉత్పత్తులు కొనుక్కోవచ్చు. దీనితో రేషన్ షాపులు మూతపడతాయి. ఈ రేషన్ షాపుల కోసం వరి ధాన్యం, గోధుమలు రాష్ట్రాల నుండి సేకరించాల్సిన పనే లేదు. ఈ సేకరణ కోసం కనీస మద్దతు ధరలను ప్రకటించాల్సిన పనే లేదు. ఉన్న గిడ్డంగులను ఎఫ్‌సిఐ నిర్వహించకుండా ఎంచక్కా అంబానీ, అదానీలకు కట్ట బెట్టవచ్చు.

రైతు వ్యతిరేక చట్టాలు ఈ ప్రక్రియలో భాగంగా తెచ్చినవే. అందుకే ఆ చట్టాలలో ఎక్కడా కనీస మద్దతు ధర ప్రస్తావన లేదు. ఈ చట్టాలు అమలు జరిగి ఉంటే పైన రాసినదంతా మరో రెండేళ్లలో కేంద్ర ప్రభుత్వం పూర్తి చేసేది. కాని రైతులు అడ్డం తిరిగారు. చట్టాల ప్రమాదాన్ని అర్థం చేసుకున్నారు. చట్టాల రద్దు కోసం పోరాడుతున్నారు. కేంద్ర ప్రభుత్వం ఒక అడుగు వెనక్కు వేయాల్సి వచ్చింది. ఇప్పటికీ ఇంకా పూర్తిగా ఆ చట్టాల రద్దుకు సిద్ధపడడం లేదు. ఆ చట్టాలను వెనక్కు తీసుకుంటే ఇప్పట్లో దేశంలో తాను అనుకుంటున్న, బడా కంపెనీలు కోరుకుంటున్న విధానాలు అమలు కావు. అందుకే పంటల సేకరణ విషయంలో రైతులకు ఇబ్బంది కలిగేలా, అనేక నాణ్యతా ప్రమాణాలను నిర్దేశిస్తున్నది. ఆ ప్రమాణాలను రైతులు తట్టుకోలేరు. అందుకే ప్రైవేట్ వ్యాపారులకు తక్కువ ధరలకే తెగనమ్ముకుంటున్నారు.

ప్రతి సంవత్సరం సేకరించే పరిమాణంపై ఎఫ్‌సిఐ కోతలు విధిస్తున్నది. రాష్ట్రాలతో గిల్లికజ్జాలు పెట్టుకుంటున్నది. ఇప్పటికే నాఫెడ్ సంస్థ కూడా తెలంగాణలో పప్పుధాన్యాలను, నూనె గింజలను రైతుల నుండి నేరుగా సేకరించడం మానేసింది.

దేశంలో ఏదో ఒక మూల నిరంతరాయంగా జరిగే ఎన్నికలు కూడా కేంద్ర ప్రభుత్వ దూకుడుకు కళ్లెం వేస్తున్నాయి. ప్రజల ఓట్లతో అధికార పగ్గాలను చేపట్టాల్సిన స్థితి ఈ పార్టీలకు ఉంది కనుక, కొన్నిసార్లు ఈ విధానాలు నెమ్మదిగా నడుస్తున్నాయి. కాని ఇప్పుడు అధికారంలో ఉన్న అన్ని పార్టీలకూ ఈ విధానాల పట్ల ఏకీభావం ఉంది కనుక, ఎవరు దిగి, ఎవరు గద్దె ఎక్కినా ఈ విధానాల అమలు కోసమే ప్రయత్నిస్తారు. ఆ మేరకు ప్రపంచబ్యాంకు, ప్రపంచ వాణిజ్య సంస్థ, బహుళ జాతి సంస్థలు, వాటికి దన్నుగా నిలబడి ఉండే అమెరికా, యూరప్, చైనా లాంటి సామ్రాజ్యవాద దేశాలు ఈ విధానాలను భారతదేశంలో వేగంగా అమలు చేయించడానికి ముందుకు తోస్తూనే ఉంటాయి. దేశ రైతాంగం లాగే, ప్రజలందరూ ఈ విధానాలలోతును అర్థం చేసుకోగలిగితే వీటిని వెనక్కు కొట్టగలరు. ప్రజానుకూల చట్టాలను సాధించుకోగలరు. విధానాలను అమలు చేయించుకోగలరు.

కేంద్రానికీ, తెలంగాణ ప్రభుత్వానికీ మధ్య ఇప్పుడు నడుస్తున్న కుమ్మక్కు పోరాటాలను ఈ దృష్టితో అర్థం చేసుకోవాలి. ఇప్పటికే అమలవుతున్న విధానాలు, మనపై పడుతున్న వాటి ప్రభావాలనులోతుగా అర్థం చేసుకోవాలి. ఈ రెండు ప్రభుత్వాలూ, లేదా ఈ రెండు పార్టీలూ, నిజమైన సమస్యను బయట పెట్టకుండా, ఊరికే వీధి నాటకాలు ప్రదర్శిస్తున్నాయని గమనించాలి.

ఈ నేపథ్యంలో మనం రాజ్యాంగపరంగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు ధాన్యం సేకరణ విషయంలో ఉన్న బాధ్యతలను కూడా అర్థం చేసుకోవాలి. ఏ విషయానికి ఎవరు బాధ్యులైతే వారిని నిలదీయాలి.

### కేంద్ర ప్రభుత్వ పాత్ర /బాధ్యత

దేశానికి స్వాతంత్ర్యం వచ్చి 75 సంవత్సరాలు నిండుతున్నా దేశ ప్రజలలో అత్యధికులు ఇప్పటికీ దారిద్ర్యరేఖకు దిగువన పేదరికంలో ఉన్నారు. బయట మార్కెట్‌లో ఆహార ధాన్యాలను ఎక్కువ ధరలకు కొని, తినలేని ఈ ప్రజలకు ఆహారాన్ని తక్కువ ధరలకు అందించాల్సిన బాధ్యత కేంద్ర ప్రభుత్వానిదే. 2013లో యుపిఎ ప్రభుత్వం తెచ్చిన ఆహార భద్రతా చట్టం ఈ లక్ష్యంతో వచ్చిందే. ఈ చట్టం ప్రకారం ఆయా రాష్ట్రాలలో ప్రజల ఆహార అలవాట్లను బట్టి బియ్యం, గోధుమలను ప్రజా పంపిణీ వ్యవస్థ ద్వారా రేషన్ కార్డులపై సరఫరా చేయాల్సిన బాధ్యత కేంద్ర ప్రభుత్వానిది. కేవలం బియ్యం, గోధుమలే కాకుండా, పోషక విలువలు అందించే చిరు ధాన్యాలు (రాగులు, కొర్రలు, జొన్నలు, సామలు, ఆరికలు, సజ్జలు లాంటివి) కూడా ఈ దుకాణాల ద్వారా సరఫరా చేయాలని చట్టం స్పష్టంగా చెబుతోంది.

ఈ చట్టాన్ని అమలు చేయడానికి కేంద్ర ప్రభుత్వం ప్రతి సంవత్సరం కేంద్ర బడ్జెట్‌లో నిధులను కేటాయిస్తుంది. కేంద్ర ప్రభుత్వ సంస్థ ఎఫ్‌సిఐ ద్వారా బియ్యం, గోధుమలను సేకరిస్తోంది. ప్రజా పంపిణీ వ్యవస్థ కోసమే కాకుండా, దేశంలో కరువు కాటకాలు వచ్చినప్పుడు, ప్రకృతి వైపరీత్యాలు, యుద్ధాలు సంభవించినప్పుడు, దేశ ప్రజలు ఆకలికి గురి కాకుండా అదనపు నిల్వలు (బఫర్ స్టాక్) నిర్వహించాల్సిన బాధ్యత ఈ సంస్థదే.

ఒక్కోసారి జాతీయ వ్యవసాయ మార్కెటింగ్ సహకార సమాఖ్య (నాఫెడ్) ద్వారా పప్పుధాన్యాలు , నూనె గింజలు కూడా వివిధ పథకాల కింద సేకరించి, వాటిని కూడా ఆయా ప్రత్యేక సందర్భాలలో ప్రజలకు ప్రజా పంపిణీ వ్యవస్థ ద్వారా అందచేస్తుంది. కరోనా లాక్ డౌన్ సమయంలో కేంద్రం ప్రజలకు కందిపప్పు లాంటివి అలాగే సరఫరా చేసింది. ఎక్కువ భాగం సేకరించిన ఈ పప్పు ధాన్యాలను అతి తక్కువ ధరలకే టెండర్లు పిలిచి వ్యాపారులకు అమ్మేస్తుంటుంది. ఈ వ్యవహారం వల్ల రైతుల మార్కెట్‌పై తీవ్ర ప్రభావం పడి రైతుల పంటలకు మద్దతు ధరలు అందడం లేదు.

తన బాధ్యతను నిర్వర్తించడానికి కేంద్ర ప్రభుత్వ సంస్థ ఎఫ్‌సిఐ, బియ్యం పండించే వివిధ రాష్ట్రాల ప్రభుత్వాలతో ముందుగానే చర్చించి, ఆయా రాష్ట్రాలకు సేకరణ కోసం ముందుగానే ఆర్డర్లు పెడుతుంది. అయితే ఈ ఆర్డర్లు పెట్టడంలో కేంద్రంలో అధికారంలో ఉండే పార్టీని తక్షణ రాజకీయ ప్రయోజనాలు కూడా ప్రభావితం చేస్తుంటాయి. ధాన్యం, బియ్యం సేకరణకు అవసరమైన నాణ్యతా ప్రమాణాలను కూడా ఎఫ్‌సిఐ నిర్ణయించి చెబుతుంది.

ఆయా రాష్ట్రాలలో పండే మొత్తం వరి ధాన్యం, గోధుమలు ఎఫ్‌సిఐ కొనాలని రూలేమీ లేదు. అలాగే నాఫెడ్ సంస్థ ఆయా రాష్ట్రాలలో పండే అన్ని రకాల పప్పుధాన్యాలను, నూనె గింజలను పూర్తిగా కొనాలని చట్టమేమీ లేదు.

ఇతర దేశాలకు ధాన్యం ఎగుమతులకు అనుమతులు ఇవ్వడం, ఇతర దేశాల నుండి వ్యవసాయ ఉత్పత్తుల దిగుమతులపై దిగుమతి సుంకాలు విధించడం లాంటివి కూడా కేంద్రానిదే బాధ్యత. ఈ విషయంలో కూడా కేంద్ర ప్రభుత్వం ప్రజల ప్రయోజనాలను కాకుండా, ఎగుమతి, దిగుమతి వ్యాపారుల, దేశీయ, బహుళ జాతి బడా కంపెనీల వాణిజ్య ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకుని మాత్రమే వ్యవహరిస్తున్నది. నిర్ణయాలు చేస్తున్నది. ప్రపంచ వాణిజ్య సంస్థ ఆంక్షలు, నిబంధనలతో పాటు, వివిధ దేశాలతో, లేదా కొన్ని దేశాలతో కేంద్ర ప్రభుత్వం విడివిడిగా లేదా ఉమ్మడిగా చేసుకునే స్వేచ్ఛా వాణిజ్య ఒప్పందాలు కూడా దేశ రైతుల ప్రయోజనాలను దెబ్బ తీస్తున్నాయి.

ఎగుమతి, దిగుమతుల సమయం, ఎగుమతి సబ్సిడీలు, దిగుమతి సుంకాలు నిర్ణయించేటప్పుడు దేశ రైతుల, వినియోగదారుల ప్రయోజనాలను కేంద్రం ఎప్పుడూ దృష్టిలో ఉంచుకోవడం లేదు. రైతులెవరూ స్వయంగా దగ్గరలోని పట్టణాలకు వెళ్లి కూడా నేరుగా వినియోగదారులకు, వ్యాపారులకు తమ ఉత్పత్తులను అమ్ముకోలేని స్థితిలో, ఇతర దేశాలకు తమ ఉత్పత్తులను నేరుగా ఎగుమతి చేయగలుగుతారని ఆశించలేము. అందుకే, కేంద్రం చేసే ఎగుమతి, దిగుమతి విధానాలు వ్యాపారులకు తప్ప రైతులకు, వినియోగ దారులకు ఉపయోగ పడడం లేదు.

ఇలాంటి సందర్భాలలో, రైతులకు లాభదాయకంగా ఉండేలా ప్రభుత్వరంగ సంస్థల ద్వారా ఎగుమతి అవకాశాలను కేంద్రం పరిశీలిస్తే తప్పకుండా రైతులకు, ఆయా రాష్ట్రాలకు ఉపయోగ పడుతుంది.

### రాష్ట్ర ప్రభుత్వ పాత్ర / బాధ్యత

నిజానికి భారత రాజ్యాంగం వ్యవసాయ రంగంపై ఎక్కువ బాధ్యతలను రాష్ట్రాలకు, రాష్ట్ర ప్రభుత్వాలకు ఇచ్చింది. వివిధ రాష్ట్రాలలో ఉండే వాతావరణ పరిస్థితులు, భూముల స్వభావం, సాగునీరు అందుబాటు, ప్రజల సాంస్కృతిక జీవితం, వేరు వేరు ఆహార అలవాట్లు ఇందుకు ప్రధాన కారణం. అందుకే ఏ రాష్ట్ర ప్రభుత్వం అయినా తమ

రాష్ట్ర ప్రజల ఆహార అవసరాలు, పశువుల ఆహార అవసరాలు, స్థానిక వ్యవసాయ ఆధారిత పరిశ్రమల ముడి సరుకు అవసరాలు ప్రాతిపదికగా పంటల ప్రణాళిక చేసుకోవాల్సి ఉంటుంది.

కాని రాష్ట్ర ప్రభుత్వాలు పంటల వైవిధ్యాన్ని కాకుండా, విచక్షణారహితంగా రెండు మూడు పంటలనే ప్రోత్సహించే ధోరణి తీసుకుంటే ఎప్పుడైనా రైతులకు మార్కెట్ కష్టమే అవుతుంది. మిగిలిన పంటలకు ప్రభుత్వాల నుండి ఎటువంటి మద్దతు అందక ఆయా పంటలు రాష్ట్రంలో మాయమైపోతాయి. తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం కూడా ఇలాంటి విచక్షణారహిత వైఖరితోనే గత రెండేళ్లుగా కేవలం వరి, పత్తి పంటలను ప్రోత్సహిస్తూ వచ్చింది. నియంత్రిత పంటల సాగు పేరుతో, లేదా కేంద్రం సేకరిస్తుందనే పేరుతో, నాణ్యమైన పత్తికి మార్కెట్ అవకాశాలు ఉన్నాయనే పేరుతో, లేదా నీటి పారుదల సౌకర్యాలు పెరిగాయనే పేరుతో, వ్యవసాయానికి 24 గంటల ఉచిత విద్యుత్ సరఫరా పేరుతో, కోటి ఎకరాల మాగాణం పేరుతో, విచ్చలవిడిగా ప్రచారం చేసి వరి పంట విస్తీర్ణం పెరగడానికి రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యక్షంగా కారణమైంది.

ఇప్పటికే కేంద్రం, దేశంలో ఎఫ్‌సిఐ ద్వారా కేవలం బియ్యం, గోధుమలు మాత్రమే సేకరించడం వల్ల రైతులు నీటి పారుదల సౌకర్యం ఏ మాత్రం ఉన్నా దక్షిణాది రాష్ట్రాలలో వరి, ఉత్తరాది రాష్ట్రాలలో గోధుమ పండించే అలవాటు పెరిగింది. ఈ కేంద్ర ప్రభుత్వ తప్పుడు వైఖరి దశాబ్దాలుగా కొనసాగడం వల్ల, దేశవ్యాపితంగా పంటల వైవిధ్యం పూర్తిగా దెబ్బతిన్నది.

రాష్ట్రంలో పండిన అన్ని పంటలనూ నూటికి నూరు శాతం కేంద్రం సేకరించాలనే రూలేమీ లేదు. ఈ విషయం రాష్ట్ర ప్రభుత్వానికి కూడా తెలుసు. కాకపోతే తన విచ్చలవిడి పంటల ప్రణాళిక వల్ల వరి సేద్యం మూడు రెట్లు పెరిగిపోయింది కనుక, ఆ సమస్య నుండి బయట పడడానికి, వచ్చి పడుతున్న ధాన్యానికి మార్కెట్ చూపించి, రైతుల నిరసన నుండి బయట పడడానికి (పార్ బాయిల్డ్ రైసు మిల్లుల లాబీ ఒత్తిడితో కూడా) నెపం పూర్తిగా కేంద్ర ప్రభుత్వం మీదకు తోసేసి చేతులు దులుపుకోవాలని చూస్తున్నది. ధర్నాలకు దిగుతున్నది.

## రైతుల పాత్ర /బాధ్యత

గ్రామీణ ప్రాంతంలో వివిధ పంటలు పండించే రైతులకు వ్యవసాయం ముఖ్యమైన జీవనోపాధి. అది ఆ రైతు కుటుంబాల ప్రధాన ఆదాయ వనరు. ఇతర జీవనోపాధుల (దినసరి కూలీ, పశువుల పోషణ, చిన్న వ్యాపారం) ద్వారా ఈ కుటుంబాలకు కొంత ఆదాయం వస్తున్నప్పటికీ, రైతులు ప్రధానంగా తాము పండించే పంట నుండి ప్రధాన ఆదాయాన్ని ఆశించి పంటలను, అందుకు అవసరమైన విత్తన రకాలను ఎంచుకుంటున్నారు.

సాపేక్షికంగా ఎక్కువ దిగుబడి, గ్రామంలోనే ప్రభుత్వ పంటల సేకరణ, పంటకు కనీస మద్దతు ధర అందడం, ఖర్చులు పోను కనీస నికర మిగులు ఉండడం, కూలీల కొరత ఉన్న సమయంలో ఉత్పత్తి ప్రక్రియలో యాంత్రీకరణ అభివృద్ధి చెందడం లాంటి అంశాలను రైతులు ప్రధానంగా దృష్టిలో ఉంచుకుని పంటల సాగు చేస్తున్నారు. పంటల మార్కెటింగ్ కు ఉండే పరిమితులు, దిగుబడులలో తగ్గుదల, ఉత్పత్తి ఖర్చులు పెరిగిపోవడం, వాతావరణంలో వస్తున్న మార్పులు, అందుకు అనుగుణంగా మార్చుకోవాల్సిన పంటలు, ఉత్పత్తి పద్ధతుల గురించి రైతులకు అవగాహన ఉన్నా, రైతులు వాటికి అనుగుణంగా తమ పంటలను మార్చుకోలేక పోతున్నారు.

ఇందుకు పూర్తిగా రైతులనే నిందించలేము. పంటల ప్రణాళిక పూర్తిగా మారిపోవడానికి అడవి జంతువులు (అడవి పందులు, నెమళ్లు, కోతులు) కూడా ప్రధాన పాత్ర పోషిస్తున్నాయి. ఆహారంలో విషాన్ని పెంచుతున్న కలుపు విషాలు కూడా వరి సేద్యంలో రైతులకు ఉత్పత్తి ఖర్చులు తగ్గిస్తున్నాయి, వరి పంట కోత పూర్తిగా యంత్రాలతోనే సాగుతున్నది. ఈ కారణాలన్నీ వరి సేద్యం విస్తరించడానికి కారణంగా పని చేస్తున్నాయి.

మిగిలిన పంటలకు నాణ్యమైన విత్తనాలు అందుబాటులో లేవు. ఉన్న విత్తనాలకు దిగుబడులు చాలా తక్కువ. కూలీల కొరత ఉన్న ప్రాంతాలలో వీటి సాగు కష్టంగా మారింది. అందుకే రైతులు ఆ పంటలను ఎంచుకోవడం లేదు.

## రాష్ట్ర ప్రభుత్వం ప్రతిపాదిస్తున్న ప్రత్యామ్నాయ పంటలు:

2021-22 యాసంగి సీజన్‌లో వరికి ప్రత్యామ్నాయంగా ఇతర పంటలు సాగు చేయాలని రాష్ట్ర ప్రభుత్వం రైతులకు పిలుపు ఇచ్చింది. ఈ పిలుపు అత్యంత సమంజసమైనది. చాలా కాలంగా మేము కోరుతున్నది కూడా. ప్రభుత్వం మా వాదనను ఇంతకాలం పట్టించుకోకుండా వరిని మాత్రమే ప్రోత్సహిస్తూ వచ్చింది. ఇప్పుడు రాష్ట్రంలో యాసంగి వరి సేద్యం ఏ ప్రభుత్వమూ నిర్వహించలేని స్థితికి చేరింది. ప్రభుత్వం చెప్పుకుంటున్నట్లుగా లక్ష కోట్లు ఖర్చు చేసినా, నీళ్లు తెచ్చి గుమ్మరించినా, ఏ పంట అయినా దానికదే గిట్టుబాటు కాదు.

వివిధ పంటల నికర ఆదాయాల మధ్య వ్యత్యాసాన్ని తగ్గించాల్సిన బాధ్యత రాష్ట్ర ప్రభుత్వానిదే.

| క్ర. సం. | పంట | సగటు దిగుబడి (క్విం) | కనీస మద్దతు ధర | సిఏసిపి ప్రకారం సగటు అంచనా ఖర్చు (క్విం) | ఎంఎస్‌పి మైనస్ క్వింటాలు ఖర్చు | నికర మిగులు ఎకరానికి |
|---|---|---|---|---|---|---|
| 1. | వరి | 24.0 | 1960 | 1727 | 233 | 5592 |
| 2. | శనగ | 7.0 | 5100 | 4117 | 983 | 6881 |
| 3. | ఆవాలు | 6.5 | 4650 | 3506 | 1144 | 7436 |
| 4. | నువ్వులు | 2.5 | 7307 | 6653 | 654 | 1635 |
| 5. | కుసుమ | 3.6 | 5327 | 5050 | 277 | 997 |
| 6. | ఆముదం | 8.0 | – | – | – | – |
| 7. | పెసర | 4.0 | 7275 | 6110 | 1165 | 4660 |
| 8. | మినుము | 5.0 | 6300 | 5133 | 1167 | 5835 |
| 9. | వేరుశనగ | 8.0 | 5550 | 4732 | 818 | 6544 |
| 10. | పొద్దు తిరుగుడు | 8.0 | 6015 | 5027 | 988 | 7904 |
| 11. | జొన్న | 12.0 | 2758 | 2478 | 280 | 3360 |
| 12. | సోయాబీన్ | 4.8 | 3950 | 3439 | 511 | 2452 |
| 13. | మొక్క జొన్న | 14.4 | 1870 | 1654 | 216 | 3110 |
| 14. | రాగి | 4.80 | 3377 | 3004 | 373 | 5835 |
| 15. | సజ్జ | 4.69 | 2250 | 1579 | 671 | 3147 |

**ఆధారం: సిఏసిపి రిపోర్టులు 2021-22**

1. పంజాబ్‌లో కూడా 95 శాతం సాగుభూములకు సాగునీరు అందుబాటులో ఉంది. విద్యుత్ సబ్సిడీ ఉంది. వరి, గోధుమ లాంటి పంటలకు (93 శాతం) ఎంఎస్‌పితో ప్రభుత్వ సేకరణ ఉంది. గ్రామీణ ప్రాంతంలో మౌలిక సౌకర్యాలు అభివృద్ధి చెంది ఉన్నాయి. అయినా పంజాబ్ రైతులకు వ్యవసాయం గిట్టుబాటు కావడం లేదు. పైగా ఆ రాష్ట్ర రైతు కుటుంబాలన్నీ అప్పుల

ఊబిలో కూరుకుపోయి ఉన్నాయి. రాష్ట్రం అనారోగ్య పీడిత రాష్ట్రంగా మారింది. భూగర్భ జలాలు అడుగంటి పోతున్నాయి. గాలి, నీరు, ఆహారం విషపూరితమై పోయాయి. ఇతర రాష్ట్రాలతో పోల్చినప్పుడు పంజాబ్ రైతు కుటుంబ సగటు ఆదాయం పెరిగినట్లు కనిపిస్తున్నప్పటికీ, అది పంటలపై నికర ఆదాయం పెరగడం వల్ల కాదు. అది పూర్తిగా ప్రభుత్వం అందిస్తున్న వివిధ రకాల సబ్సిడీలు, సేకరణ వ్యవస్థల వల్ల మాత్రమే సాధ్యమైంది.

2. తెలంగాణలో నిజానికి అటువంటి మద్దతు వ్యవస్థలు ఇంకా ఏర్పడలేదు. ప్రభుత్వం అందిస్తున్న 24 గంటల ఉచిత విద్యుత్, లక్షల కోట్లతో నిర్మిస్తున్న భారీ ఎత్తిపోతల పథకాలు, వేల కోట్లతో అమలు చేస్తున్న రైతు బంధు పథకం, సీజన్ సీజన్ కూ వినియోగం పెరుగుతున్న విష రసాయనాలు, పర్యావరణపరంగా అస్థిరమైనవి. బడ్జెట్‌లో నిధులను దుర్వినియోగం చేసేవే తప్ప మరొకటి కాదు.
3. ఇప్పుడు నిజంగా ప్రత్యామ్నాయ పంటలను రాష్ట్ర ప్రభుత్వం ప్రోత్సహించాలంటే, అందుకు చేయవలసినది గ్రామ స్థాయిలో లేదా మండల స్థాయిలో సమగ్ర పంటల ప్రణాళిక రూపొందించడం, అమలు చేయడం.
4. వివిధ పంటల మధ్య నికర ఆదాయాల పరంగా తీవ్ర వ్యత్యాసం ఉంటున్నది. ఆ వ్యత్యాసాన్ని తగ్గించడానికి నిర్దిష్ట ప్రణాళిక అవసరమవుతుంది.
5. పైగా ఈ నికర ఆదాయాలన్నీ సగటు దిగుబడులు వచ్చి, ప్రభుత్వం కనీస మద్దతు ధరలతో సేకరించినప్పుడు మాత్రమే సాధ్యం. దిగుబడులు తగ్గినా, ఎంఎస్‌పితో ప్రభుత్వ సేకరణ లేకపోయినా, రైతులకు నష్టమే తప్ప లాభం ఉండదు. ఇప్పటికే వివిధ సీజన్లలో ఈ విషయం రుజువైంది.
6. ఒకవేళ ఎంఎస్‌పితో కేంద్ర ప్రభుత్వం పూర్తి స్థాయిలో అన్ని పంటల సేకరణ చేయలేనని అనుకున్నప్పుడు, చేయాల్సిన పని తాము ప్రకటించే కనీస మద్దతు ధరలకు చట్టబద్ధత కల్పించడం. ఫలితంగా స్థానిక వ్యాపారులు కొన్నా, రిటైల్ కంపెనీలు కొన్నా, ప్రాసెసింగ్ యూనిట్‌ల యజమానులు కొన్నా తప్పకుండా రైతుల నుండి పంటలను ఎంఎస్‌పితో మాత్రమే కొనుగోలు చేయవలసి ఉంటుంది. అది రైతులకు లాభం చేస్తుంది.
7. కాని ఇప్పటివరకూ ఎంఎస్‌పికి చట్టబద్ధత లేదు. గత సంవత్సర కాలంగా ఢిల్లీ కేంద్రంగానూ,దేశ వ్యాపితంగానూ ఆందోళన చేస్తున్న రైతులు మూడు రైతు వ్యతిరేక చట్టాల రద్దు, విద్యుత్ బిల్లు ఉపసంహరణతో పాటు, ఎంఎస్‌పికి చట్టబద్ధత కల్పించాలనే డిమాండ్‌ను కూడా ఇప్పటికే కేంద్ర ప్రభుత్వం ముందు పెట్టారు.
8. అయితే కేంద్రం ప్రకటించే కనీస మద్దతు ధరలు జాతీయ స్థాయి సగటు ఉత్పత్తి ఖర్చుల (ఎ2ంఎఫ్ఎల్) ఆధారంగా ప్రకటిస్తున్నవి కనుక, రైతులకు పెద్దగా నికర మిగులు ఉండడం లేదు. 2014లో హామీ ఇచ్చినట్లుగా కేంద్రప్రభుత్వం డా. స్వామినాథన్ కమిషన్ సిఫారసుల ప్రకారం సమగ్ర ఉత్పత్తి ఖర్చు (సి2)కు 50 శాతం లాభం కలిపి ఎంఎస్‌పి ప్రకటిస్తే రైతులకు ఉపయోగకరం. అప్పుడు కూడా తెలంగాణ రాష్ట్ర రైతులకు పెద్దగా లాభం ఉండదు. కారణం ఈ రాష్ట్రంలో పంటల సగటు ఉత్పత్తి ఖర్చులు బాగా పెరిగిపోవడమే.
9. ఈ నేపథ్యంలో రాష్ట్ర ప్రభుత్వం నిర్దిష్టంగా మూడు పనులు చేపట్టాల్సి ఉంటుంది:

1. పంటల సగటు ఉత్పత్తి ఖర్చులు తగ్గించడానికి అవసరమైన అన్ని చర్యలూ చేపట్టాల్సి ఉంటుంది.

2. కొన్ని పంటలకు అనివార్యంగా కేంద్రం ప్రకటించిన ఎంఎస్‌పిపై బోనస్ ఇవ్వాల్సి ఉంటుంది. నిజానికి పంటలకు ధరలను నిర్ణయించే అధికారం రాష్ట్రాలకు ఉంది. కాని కేంద్రం ఇప్పటికే ఆ అధికారాన్ని తన చేతుల్లోకి తీసుకున్నది కనుక, పీడా పోయింది అనుకోకుండా, రాష్ట్రం కనీస మద్దతు ధరల చట్టబద్ధత కోసం కేంద్రంపై ఒత్తిడి తేవాలి. రైతు ఉద్యమానికి మౌఖికంగా మద్దతు ప్రకటించడమే కాదు, అసెంబ్లీ తీర్మానం చేసి కేంద్రానికి పంపాలి. రైతుల ప్రయోజనాలకు హానికరంగా పరిణమించిన, ఎంఎస్‌పికి ఎటువంటి స్థానమూ లేని మూడు రైతు వ్యతిరేక చట్టాలనూ రద్దు చేయాలని ఈ తీర్మానంలో కోరాలి.

3. ప్రభుత్వం ప్రకటించి అమలు చేసే మద్దతు వ్యవస్థలన్నీ పూర్తిగా వాస్తవ సాగుదారులకే అమలు చేయాల్సి ఉంటుంది.

4. ఇప్పటికీ ఎంఎస్‌పి లేని పంటలకు రాష్ట్ర ప్రభుత్వం రాష్ట్రస్థాయిలో ఎంఎస్‌పి ప్రకటించాలి. కేరళ రాష్ట్రం అలా కూరగాయలకు, పండ్లకు ఎంఎస్‌పి ప్రకటించింది.

10. రైతు బంధు సహాయాన్ని పంటలు సాగయిన భూములకు మాత్రమే పరిమితం చేయడం, సహాయాన్ని 5 ఎకరాలలోపు రైతులకు మాత్రమే పరిమితం చేయడం, కౌలు, పోడు, మహిళా రైతులతో సహా వాస్తవ సాగుదారులకు మాత్రమే అందించడం వల్ల నిధులు ఆదా అవుతాయి. ఈ మిగులు నిధుల నుండి, వివిధ పంటలకు ఎంఎస్‌పికి అదనంగా బోనస్ ఇవ్వడం సాధ్యం అవుతుంది. అప్పుడే రైతులు ఉత్సాహంతో ఇతర పంటలు కూడా పండిస్తారు.

11. పంటల బీమా పథకాలు వెంటనే ఈ యాసంగిలో తిరిగి ప్రారంభించాలి. అందుకు అవసరమైన నోటిఫికేషన్ విడుదల చేయాలి. రైతు బంధు దుర్వినియోగం కాకుండా ఆపిన నిధుల నుండి, నష్టపోయిన రైతులకు పూర్తి పరిహారం చెల్లించాలి. అడవి పందులు, కోతులు, నెమళ్లు లాంటి అడవి జంతువుల వల్ల పంటలు నష్టపోయిన రైతులకు పరిహారం చెల్లించడానికి ఈ బీమా పథకాలలో నియమాలు పొందుపరచాలి.

12. ప్రత్యామ్నాయ పంటలు సాగు చేయించగానే ప్రభుత్వ బాధ్యత తీరిపోదు. ఈ సమయంలో కంపెనీలు అత్యధిక ధరలకు కల్తీ విత్తనాలు అమ్మే ప్రమాదం ఉంది. ఆ విత్తనాలు మొలకెత్తక రైతులు నష్టపోయే ప్రమాదం ఉంది. కాబట్టి రాష్ట్ర వ్యవసాయ శాఖ అత్యంత జాగరూకతతో ఉండి, నష్టపోయిన రైతులకు పరిహారం చెల్లించే విధంగా విత్తన కంపెనీలపై చర్యలు తీసుకోవాలి.

13. రైతు, మహిళా సహకార సంఘాలు, రైతు ఉత్పత్తిదారుల కంపెనీలను బలోపేతం చేయడం ద్వారా, రైతు సమన్వయ సమితి కార్పొరేషన్‌ను చురుకుగా పని చేయించడం ద్వారా, రాష్ట్ర మార్కెటింగ్ శాఖను వీటన్నిటికీ సమన్వయ వేదికగా మార్చడం ద్వారా రాష్ట్ర ప్రభుత్వం రైతులకు అండగా నిలబడాలి.

గ్రామీణ ప్రజల, రైతు కుటుంబాల ఆదాయాల పెంపు లక్ష్యంగా సమగ్ర వ్యవసాయ విధానం వెంటనే చర్చకు ప్రవేశ పెట్టడం ద్వారా, రైతులను, రైతు సంఘాలను ఈ ప్రక్రియలో భాగస్వాములను చేయాలి.

(రచయిత రైతు స్వరాజ్య వేదిక నాయకులు) వీ

# హుజురాబాద్ ఉప ఎన్నిక ఫలితం-పరిణామాలు

***హుజురాబాద్ ఉప ఎన్నిక ముఖ్యమంత్రి కెసిఆర్‌కు, ఈటల రాజేందర్‌కు మధ్య జరిగిన ఎన్నికగానే భావించి ప్రజలు ఎటువంటి ప్రలోభాలకు లోనుకాకుండా ఈ తీర్పును ఇచ్చారని అంటున్నారు*** **ఎం. రవి**

దేశంలోనే అత్యంత ఖరీదైన ఉప ఎన్నికగా నిలిచిన హుజురాబాద్ ఉప ఎన్నిక ఫలితం తెలంగాణ రాజకీయాల్లో అత్యంత కీలక పరిణామాలకు దారితీస్తోంది. ఈ ఉప ఎన్నిక ఫలితం అనేక అంశాలపై చర్చను లేవనెత్తుతోంది. అనేక కోణాల్లో మేధావి వర్గంలో విశ్లేషణ జరుగుతోంది. దేశవ్యాప్తంగా పలు పార్లమెంట్, అసెంబ్లీ స్థానాలకు జరిగిన ఉప ఎన్నికల్లో బిజెపిని తీవ్ర నిరాశకు గురిచేసే ఫలితాలే వచ్చాయి. కానీ.. హుజురాబాద్‌లో మాత్రం బిజెపి అభ్యర్థి ఈటల రాజేందర్ గెలిచారు. అత్యంత ప్రత్యేక పరిస్థితుల్లో జరిగిన ఉత్కంఠ పోరులో టిఆర్ఎస్ అభ్యర్థి గెల్లు శ్రీనివాస్ యాదవ్‌పై సుమారు 24 వేల ఓట్ల మెజార్టీతో విజయం సాధించారు. అయితే.. ఈ విజయం బిజెపిదా..? లేక ఈటల రాజేందర్‌దా..? అనే కోణంలో చూసినప్పుడు ఏమాత్రం సంకోచించకుండా ఈటల వ్యక్తిగత గెలుపుగానే మెజార్టీ అభిప్రాయం వ్యక్తమవుతోంది. ఇదే సమయంలో ఈటల వ్యక్తిగత గెలుపు ఫాసిస్టు, మతోన్మాద బిజెపి విస్తరణకు దోహదపడుతుందనే వాదన కూడా వినిపిస్తోంది. ఇది కొట్లాడి తెచ్చుకున్న తెలంగాణలో నియంత పాలకుడిగా భావిస్తున్న కెసిఆర్ కన్నా, దేశ ప్రజలకు అత్యంత ప్రమాదకరమైన పరిణామంగానూ కొందరు చూస్తున్నారు.

తెలంగాణలో అధికార టిఆర్ఎస్‌కు ప్రత్యామ్నాయంగా ఎదగాలని కలలు కంటున్న కమల దళానికి.. మరింత ఉత్సాహాన్ని ఫలితంగా హుజురాబాద్ ఉప ఎన్నిక నిలిచింది. మరోవైపు.. ఈ ఉప ఎన్నికల్లో గెలిచి తనకు తిరుగేలేదని నిరూపించుకోవాలని చూసిన గులాబీ బాస్ కెసిఆర్‌ను తీవ్రస్థాయిలోనే ఉక్కిరిబిక్కిరి చేసిందని చెప్పొచ్చు. ఎలాగైనా గెలవాలన్న కసితో ఉన్న కెసిఆర్.. హుజురాబాద్‌లో చేయని ప్రయోగం లేదని, నెలలకొద్దీ కోట్ల రూపాయలు ఖర్చు చేశారని, చివరికి ఓటుకు వేల రూపాయలు ఇచ్చినట్లు కూడా ప్రచారం జరిగింది. ఒకానొక దశలో డబ్బుల కోసం ఓటర్లు రోడ్లపైకి వచ్చి కూడా ఆందోళనలు కూడా చేశారు. అయితే.. రాజకీయ నాయకులు, పాలకులు ఎవరెన్ని ప్రలోభాలకు గురిచేసినా.. ఒక్కసారి ప్రజలు నిర్ణయం తీసుకున్నారంటే, దానికి కట్టుబడి ఉంటారని, ఎక్కువ కాలం పాలకుల ఇష్టారాజ్యాన్ని భరించలేరనే విషయం కూడా హుజురాబాద్ ఉప ఎన్నిక ఫలితం రుజువు చేసింది. ప్రజలే చరిత్ర నిర్మాతలు అనే విషయం మరోసారి ప్రపంచం ముందు స్పష్టమైంది. అంతేగాకుండా ఈ ఉప ఎన్నికను రాజకీయ పార్టీలకు అతీతంగా కేవలం టిఆర్ఎస్ పార్టీ అధినేత, ముఖ్యమంత్రి కెసిఆర్‌కు, ఈటల రాజేందర్‌కు మధ్య జరిగిన పోరుగానే ప్రజలు చూశారని, ఆ దిశగానే విజ్ఞతతో వ్యవహరించారనే వాదనే బలంగా ఉంది.

హుజురాబాద్ ఉప ఎన్నిక ఫలితం ముఖ్యమంత్రి కెసిఆర్ ఆలోచనా విధానంలో మార్పులు తీసుకొచ్చిందనే చెప్పొచ్చు. వరిధాన్యం కొనుగోలు విషయంలో ముఖ్యమంత్రి కెసిఆర్ ప్రగతిభవన్‌లో వరుసగా రెండు రోజులు మీడియా సమావేశాలు ఏర్పాటు చేశారు. ప్రధానంగా కేంద్రంపై, రాష్ట్ర బిజెపి నేతలపై తీవ్రస్థాయిలో విమర్శలు, ఆరోపణలు చేసినా.. అంతర్గతంగా హుజురాబాద్ ఉప ఎన్నిక ఫలితం నుంచి ప్రజల దృష్టిని మళ్లించి, పార్టీ శ్రేణుల్లో మళ్లీ ఉత్సాహం నింపేందుకేనని చెప్పొచ్చు. తెలంగాణ ఉద్యమానికి, ముఖ్యంగా టిఆర్ఎస్ పార్టీకి ఆయువుపట్టులా ఉన్న వరంగల్, కరీంనగర్ జిల్లాల్లో పట్టుజారకుండా కెసిఆర్ దిద్దుబాటు చర్యలు చేపట్టారు. గత పార్లమెంట్ ఎన్నికల నాటి నుంచి ఇప్పటివరకు చూస్తే కమల దళం నిజామాబాద్, కరీంనగర్, వరంగల్ జిల్లాల్లో కాస్త పుంజుకుంటున్నట్లే కనిపిస్తోంది. ఈ నేపథ్యంలో ఈ జిల్లాల్లో పట్టుకోల్పోతే రాజకీయంగా తీవ్రనష్టం తప్పదనే విషయాన్ని గ్రహించిన కెసిఆర్ వెనువెంటనే జాగ్రత్తపడుతూ వ్యూహాత్మకంగా వ్యహరిస్తున్నారు. ఈ క్రమంలోనే ఎంఎల్ఏ కోటా ఎంఎల్‌సి ఎన్నికల్లో ఉన్న ఆరు స్థానాలకుగాను.. ఈ కరీంనగర్, వరంగల్ జిల్లాల నుంచే ఐదుగురికి అవకాశం కల్పించడం గమనార్హం. ఇదే సమయంలో పార్టీ నుంచి ఇతర పార్టీలోకి వలసలు జరగకుండా చూసే దిశగానే కెసిఆర్ జనంలోకి వచ్చారు.

హైదరాబాద్‌లో ఇందిరాపార్క్ వద్ద ధర్నా చౌక్ అవసరమా అంటూ ఎత్తేసిన చోటే మళ్లీ కెసిఆర్ స్వయంగా ధర్నా చేయాల్సిన పరిస్థితిని హుజురాబాద్ ఉప ఎన్నిక ఫలితం తీసుకొచ్చిందని చెప్పొచ్చు. తెలంగాణలో పండే వడ్లను కేంద్రం కొనాలని డిమాండ్ చేస్తూ కెసిఆర్ ధర్నా నిర్వహించడం రాజకీయవర్గాలతో పాటు సామాన్య జనంలోనూ ఆసక్తికరమైన చర్చకు దారితీసింది. కేవలం కేంద్రాన్ని టార్గెట్ చేస్తూ కెసిఆర్ ముందుకు వెళ్లడం వెనుక అసలు కారణం వేరే ఉందనే వాదన కూడా వినిపిస్తోంది. తెలంగాణలో బిజెపిపై స్వయంగా కెసిఆరే హైప్ క్రియేట్ చేస్తున్నట్లు తెలుస్తోంది. వచ్చే ఎన్నికల నాటికి.. తెలంగాణలో త్రిముఖ పోరు అంటే.. టిఆర్ఎస్, కాంగ్రెస్, బిజెపిల మధ్య ఉండేటట్లు చూస్తే తాము సులభంగా ఎక్కువ సీట్లు సాధించి, మళ్లీ కైవసం చేసుకోవడానికి కెసిఆర్ ఇప్పటి నుంచే వ్యూహాత్మకంగా అడుగులు వేస్తున్నట్లు కొందరు రాజకీయ విశ్లేషకులు భావిస్తున్నారు. ప్రస్తుతం టిఆర్ఎస్ పాలనపై, ముఖ్యంగా కెసిఆర్ పోకడపై ప్రజల్లో తీవ్ర వ్యతిరేకత ఉందనే విషయాన్ని హుజురాబాద్ ఉప ఎన్నిక స్పష్టం చేసింది. ఈ వ్యతిరేకతను కాంగ్రెస్ పార్టీ అనుకూలంగా మలచుకుంటే.. ప్రమాదమని గ్రహించిన కెసిఆర్ కావాలనే బిజెపిపై హైప్ క్రియేట్ చేసి, ప్రజా వ్యతిరేకతను కాంగ్రెస్‌తో పాటు బిజెపి కూడా సమానంగా పంచుకునేలా చేస్తున్నట్లు తెలుస్తోంది. ఇక్కడ మరో వాదన కూడా వినిపిస్తోంది. వచ్చే ఎన్నికల నాటికి బిజెపి, టిఆర్ఎస్ కలిసి పనిచేసే పరిణామాలు జరిగినా ఆశ్చర్యపోవాల్సిన అవసరం లేదనే చెప్పొచ్చు.

*(రచయిత జర్నలిస్టు)* వీ

# ఖరీదైన ఉప ఎన్నిక హుజురాబాద్

***రాజకీయ పార్టీలు ఎన్నికల్లో గెలువడం కోసం ఎంత డబ్బైనా ఖర్చుపెట్టడానికి, ఎన్ని అమలుకాని హామీలనైనా ఇవ్వడానికి వెనుకాడరని హుజురాబాద్ ఉప ఎన్నిక తెలియజేస్తుందని అంటున్నారు* బోరెడ్డి మధుసూదన్‌రెడ్డి**

హుజురాబాద్ ఉప ఎన్నిక ఫలితంతో రాష్ట్ర రాజకీయాలలో అనూహ్యమైన మార్పులు చోటుచేసుకొనే అవకాశాలు ఉన్నాయి. అధికార పార్టీకి రాబోయేది గడ్డు కాలమేనా? అనే అనుమానం ఏర్పడుతుంది. ఈ ఉప ఎన్నికలో వివిధ పార్టీ ముఖ్య నేతలు, ముఖ్యంగా అధికార పార్టీ నేతలు సామ, దాన, బేధ, దండోపాయాలతో పాటు, సమస్త శక్తి యుక్తులు ప్రయోగించినా కూడా హుజురాబాద్ పోరులో ఓడిపోవడం గులాబి పార్టీ జీర్ణించుకోలేక పోతున్నదనే అభిప్రాయాన్ని విశ్లేషకులు వ్యక్తపరుస్తున్నారు. ఇప్పటికే దుబ్బాక సిట్టింగ్ సీటును కోల్పోయి, హైదరాబాద్ జివెచ్ఎంసి ఎన్నికలలో అత్తెసరు మెజార్టీని సాధించి, తాజాగా హుజురాబాద్ సిట్టింగ్ సీటును వదులుకోవలసి రావడం అధికార పార్టీకి పెద్ద దెబ్బ అని చెప్పవచ్చు. అసలు ఈ ఉప ఎన్నిక జరగడానికి ఈటల రాజేందర్ రాజీనామ చేయడం కారణం. అయితే ఒక రకంగా ఈ ఉప ఎన్నికను అధికార పార్టీ అధినేత సృష్టించుకొన్నదే. ఈటల రాజేందర్ అసైన్డ్ భూమి ఆక్రమించుకొన్నాడనే ఆరోపణతో, రాజకీయంగా ఆయనను సమాధి చేయాలని, రాబోయే కాలంలో తనకు అసమ్మతి ఉండకూడదనే ఆలోచనతోనే ఈ పరిస్థితిని తెచ్చుకున్నారు. ఇందుకు గాను అనేక పథకాలు ప్రవేశపెట్టి, ప్రజలను అనేక ఆశలకు గురిచేసి, ప్రలోభాలు పెట్టి, డబ్బులు కుమ్మరించినా చివరకు ఫలితం పొందక పరాభవం ఎదురైంది.

పైసలంటే పగ ఎవరికి ఉంటుంది? ఆ పైసలనే ఎన్నికలలో విసిరితే ఓట్లు పడతాయని రాజకీయ నేతలు బలంగా నమ్ముతారు. పైసలు పంచకపోతే ఎన్నికలలో ప్రజలు ఓట్లు వేయరని వారి అభిప్రాయం. ఇది రాజకీయ నేతలలో గత కొన్నేళ్లుగా పాతుకుని పోయింది. ప్రత్యర్థి పార్టీ వారు పంచిన డబ్బును బేరీజు వేసుకొని, అంతకు రెట్టింపు డబ్బును వారు పంచితే తమ పార్టీకే ఓటేసి గెలిపిస్తారని నమ్ముతారు.

ఈనాటి ఎన్నికల కోలాహలంలో ధన ప్రభావం, మద్యం, హామీల వరాలు కురిపించడం, డబ్బు పంపిణీతో పదవులను పొందాలనే ఆలోచన సర్వసాధారణంగా మారిన ఈనాటి ఎన్నికల వ్యవస్థలో హుజురాబాద్ ఓటర్లు మాత్రం కొంతవరకు విలక్షణంగా, విచక్షణా జ్ఞానంతో వ్యవహరించారనేటువంటి అభిప్రాయం వ్యక్తం అవుతుంది. డబ్బును తీసుకోవడంలో రెండు పార్టీలను ఆదరించిన ఓటర్లు, పోలింగ్ భూత్ లోనికి వెళ్లిన తర్వాత మాత్రం తాము అనుకున్న పార్టీకే ఓటు వేశారు. ఇక్కడ అన్ని పార్టీల వారు ఇచ్చిన డబ్బును తీసుకున్నారు. ఇంకా కొంత మంది ప్రజలు డబ్బు అందలేదని రోడ్డు మీదకు వచ్చి ధర్నాలు చేసే స్థితిదాక వచ్చింది.

అధికార టీఆర్ఎస్ పార్టీ, బిజెపి పార్టీలు ఈ ఎన్నికను అత్యంత ప్రతిష్టాత్మకంగా తీసుకొన్నాయి. డబ్బు పంపకంలో ఒకరు ఎక్కువ, ఒకరు తక్కువ పంచొచ్చు. మొత్తానికి ఓటుకు నోటు వ్యవహారంగానే రెండు పార్టీలు వ్యవహరించాయి. దీనితో నోట్లు కట్టలు తెంచుకున్నాయి. మద్యం ఏరులై పారింది. ఈ ఎన్నికలో అధికార పార్టీ వారు రు. 400 కోట్ల వరకు, ఈటల రాజేందర్ బిజెపి పార్టీ రు. 100 కోట్ల వరకు ఖర్చు పెట్టాయని, ఇంతకు ముందు ఎన్నడూ, ఎక్కడా కూడా ఇంత ఖర్చు పెట్టలేదని, ఇది అత్యంత ఖరీదైన ఉప ఎన్నిక అని విశ్లేషకులు భావిస్తున్నారు. ఒక్కొక్క ఓటరుకు రు. 6,000 నుండి రు. పది వేల వరకు పంపిణీ చేశారని అంటున్నారు. డబ్బులు తీసుకోవడంలో ఓటర్లు ఏమాత్రం కూడా మొహమాటపడలేదు. అన్ని పార్టీల నేతలు ఇచ్చిన డబ్బులు తీసుకొన్నారు. నోట్లు అందనివారు కొందరు, మాకెందుకు డబ్బులు ఇవ్వరని చెప్పి ఆందోళన చేసి, ధర్నాలు చేసి మరీ అడిగి తీసుకొన్నారు. ఓటు మాత్రం తాము అనుకున్న అభ్యర్థికే వేసి గెలిపించారు. బహుశ ఎన్నికల వ్యవస్థలో ఇది ఒక కొత్త పోకడ అని, పార్టీలకు ఓటర్లు తగిన గుణపాఠం నేర్పారని విశ్లేషకులు అంటున్నారు.

హుజురాబాద్ ఉప ఎన్నికలో గెలుపు సాధించడానికి ప్రభుత్వం 'దళితబంధు' అనే పథకాన్ని ప్రవేశపెట్టింది. ఈ పథకంలో భాగంగా నియోజకవర్గంలోని దళితుల కుటుంబాలను లబ్దిదారులుగా నిర్ణయించి, ఒక్కొక్క లబ్దిదారుని ఖాతాలో రు. 10 లక్షల చొప్పున నగదు జయచేయడం జరిగింది. హుజురాబాద్ నియోజకవర్గంలోని దళిత కుటుంబాలలో 40 వేల ఓటర్లను దృష్టిలో ఉంచుకొని, అందులోని సుమారు 17 వేల మంది ఖాతాల్లో డబ్బు జమచేసిన తర్వాత ఫ్రీజింగ్ పెట్టడం వల్ల లబ్దిదారులు డబ్బు తీసుకోలేని పరిస్థితి ఏర్పడింది. దీనితో లబ్దిదారుల్లో అనుమానాలు ప్రారంభమయ్యాయి. దళితబంధు మంజూరు అయిన, ఆ ఫలాలు అందాలంటే ఇంకా కొన్ని నెలల సమయం పట్టే ప్రమాదం ఉందని భావించారు. ఈ పథకం అమలులో కొన్ని అనుమానాలు తలెత్తడంతో 'దళితబంధు' పాచిక పారనటువంటి పరిస్థితి ఏర్పడిందని విమర్శకులు అభిప్రాయపడ్డారు.

దళితులకు మూడు ఎకరాల భూమి ఇస్తామనే వాగ్దానంపై, గతంలో జరిగిన అసెంబ్లీ సాక్షిగా సి.ఎం. చేసిన ప్రకటన దళితులను ఆందోళనకు, అయోమయానికి గురిచేసింది. హుజురాబాద్ ఉప ఎన్నికకు కొద్ది రోజుల ముందు అసెంబ్లీలో సి.ఎం. మాట్లాడుతూ,

దళితులకు మూడు ఎకరాల భూమి ఇస్తామని తాము ఎప్పుడూ చెప్పలేదని స్పష్టం చేశారు. ఈ ప్రకటన పోలింగ్‌పై తీవ్రంగా ప్రభావం చూపిందనే అభిప్రాయాలు వ్యక్తం అవుతున్నాయి. దీనిపై ప్రతిపక్షాలతో పాటు, దళితుల నుండి తీవ్ర విమర్శలు వచ్చాయి. దళితులకు మూడు ఎకరాల భూమి ఇస్తామని ఎన్నికల 'మేనిఫెస్టో'లో పేర్కొని, తానెప్పుడు అలా చెప్పలేదని ప్రకటించడంపై విమర్శలు వ్యక్తమయ్యాయి. ఈ విధంగా సి.ఎం. ఇచ్చిన హామీలు అన్ని వెనక్కు తీసుకొన్నారనే సందేశాన్ని ప్రతిపక్షాలు పెద్ద ఎత్తున ప్రజల్లోకి తీసుకెళ్లాయి.

ఈటల రాజేందర్‌ను అసెంబ్లీలో మళ్లీ అడుగుపెట్టనియ్యకూడదనే లక్ష్యంగా గెలుపు కోసం అధికార పార్టీ శక్తికి మించి ప్రయత్నాలు చేసింది. రాష్ట్ర ఆర్థిక పరిస్థితిని పరిగణలోనికి తీసుకోకుండా పథకాలను ప్రకటించి, నిధులు మంజూరు చేసింది. అర్థ బలం, అంగ బలాలను ఉపయోగించింది. అధికార, ప్రతి పక్ష పార్టీల వ్యూహ, ప్రతి వ్యూహాలకు పదును పెట్టాయి. అయినా ఓటమి తప్పలేదు. దీంతో ప్రభుత్వంపై ప్రజా వ్యతిరేకత పెరుగుతుందనే అభిప్రాయానికి బలం చేకూరినట్లయింది.

ప్రభుత్వ పథకాల ద్వారా కలిగే ఆర్థిక ప్రయోజనాలు పాలకుల జేబు సొత్తు కాదని, పన్నుల రూపంలో తమ నుండి వసూలు చేసిన డబ్బునే తిరిగి పథకాల రూపంలో ఇస్తున్నారనే అభిప్రాయం ప్రజల్లో పెరుగుతుంది. హుజురాబాద్ ఉప ఎన్నికలో ఇది స్పష్టంగా కనిపించింది. ఈ పరిణామం అధికార పార్టీకి ఇబ్బందికరంగా మారింది. ఇక ఉద్యోగాల భర్తీ, నిరుద్యోగ భృతి హామీలను నెరవేర్చాలనే డిమాండ్ రోజు రోజుకు ఉధృతమవుతుంది. రాష్ట్రంలో ఉద్యోగులకు మొదటి తేదీన జీతాలు చెల్లించలేని పరిస్థితులలో ప్రభుత్వం ఉంది. ప్రస్తుతం అమలు చేస్తున్న పథకాలను కొనసాగించడం కష్టం అవుతుందనే అభిప్రాయం ఉన్నత స్థాయి అధికార వర్గాలలోనే ఉంది. ఇది ప్రభుత్వంపై వ్యతిరేకత మరింత పెరగడానికి దారితీస్తుందని ప్రజలు భావిస్తున్నారు.

హుజురాబాద్ ఉప ఎన్నికలో అధికార పార్టీ అన్ని పథకాలను అమలు చేసింది. ఇందులో మహిళా సంఘాలకు వడ్డీలేని రుణాలు, పెద్ద ఎత్తున కళ్యాణ లక్ష్మి చెక్కుల పంపిణీ, కొత్త రేషన్ కార్డులు, పింఛన్‌లు ఇలా ఒకటేమిటి? ఈటల రాజేందర్‌ను ఓడించడమే లక్ష్యంగా చేయని ప్రయత్నం లేదు. హుజురాబాద్ నియోజకవర్గంలో అమలు చేయని పథకం లేదు. అన్ని కుల సంఘాలకు భవనాలు మంజూరు చేసింది. వ్యాధి పీడితులకు సి.ఎం.ఆర్.ఎఫ్. చెక్కులు అందజేసింది. కార్మికులకు ఆటోనగర్, రైతు ఉత్పత్తిదార్ల సంఘానికి నగదు మంజూరు చేసింది. అన్నింటికి మించి దళితులకు 'దళితబంధు' పథకం ప్రవేశపెట్టింది. ఇలా అనేక పథకాల ద్వారా లబ్దిపొందిన జనం ఓటు వేసే విషయంలో మాత్రం భిన్నంగా ఆలోచించి ఈటల రాజేందర్‌ను గెలిపించారు.

ఈ ఉప ఎన్నికపై అధికార పార్టీ స్వయంగా దృష్టి పెట్టింది. ఎన్నికల షెడ్యూల్ వెలువడింది మొదలు పోలింగ్ రోజు వరకు ఎప్పటికప్పుడు వ్యూహ, ప్రతి వ్యూహాలు పన్నారు. ఓటు బ్యాంకును అంచనా వేసి ఆయా ప్రాంతాలకు, వర్గాలకు నిధులు, పథకాలు అందేలా చేశారు. అయినా వీరి శ్రమ ఫలించలేదు. కుమ్మరించిన నిధులకు ఫలితం రాక, అపజయాన్ని జీర్ణించుకోలేకపోతుంది. హుజురాబాద్ ఉప ఎన్నికలో పార్టీల వారీగా ఓట్ల శాతం చూసినట్లయితే ఈటల రాజేందర్‌కు 51.96 శాతం, టిఆర్ఎస్ పార్టీకి 40.38 శాతం, కాంగ్రెస్‌కు 1.46 శాతం, ఇతరులకు 6.20 శాతం ఓట్లు పోలయ్యాయి. ఈ ఉప ఎన్నికలో ఈటల రాజేందర్ గెలుపును బిజెపి పార్టీ గెలుపుగా కాకుండా, ఒక వ్యక్తిగానే ఆయన వ్యక్తిగత గెలుపుగానే ప్రజలు విశ్లేషించుకుంటున్నారు. మొత్తంగా చూసినట్లయితే ఈ ఉప ఎన్నిక ఇంతకు ముందు జరిగిన ఎన్నికల కంటే ఒక వైవిధ్యంతో కూడినటువంటిది. ఓటర్లు వివేకంతో, విచక్షణ జ్ఞానంతో ఓటు వేసి ఈటల రాజేందర్ ఆత్మ గౌరవాన్ని నిలబెట్టిన ఎన్నికగానే ప్రజలు భావిస్తున్నారు.

హుజురాబాద్ ప్రజలు ఇచ్చిన తీర్పు కేవలం ఒక అధికార పార్టీకి మాత్రమే కాకుండా, దేశంలోని అన్ని రాజకీయ పార్టీలకు దిక్సూచి వంటిది. అన్ని రాష్ట్రాల ప్రజలకు, ప్రభుత్వ వ్యతిరేకతను ఎలా వ్యక్తపరచాలో ఆ ప్రజలు చేసి చూపించారు. ప్రతిపక్షాల అనైక్యతను ఆసరా చేసుకొని అరాచకంగా వ్యవహరిస్తున్న పాలకులందరికీ ఈ తీర్పు ఒక గుణపాఠం వంటిది.

*(రచయిత విశ్రాంత ప్రధానోపాధ్యాయులు)*

## ఆవుల బాలనాథం ఇకలేరు

*ఐదు దశాబ్దాల పాటు దళితుల హక్కులకోసం పోరాడిన ఆవుల బాలనాథం(78) మృతి చెందారు. హైదరాబాద్‌లోని ట్రూప్ బజార్లోని తన నివాసంలో గుండెపోటుతో నవంబర్ 6న మరణించారు. ఉమ్మడి రాష్ట్రంలో 22 సంవత్సరాల పాటు ఎస్‌సి హక్కుల పరిరక్షణ సంఘం అధ్యక్షుడిగా ఉన్నారు. ఆ తరువాత మాలల ఐక్య వేదిక జాతీయ అధ్యక్షుడిగా పనిచేశారు. బి.ఆర్. అంబేద్కర్ స్ఫూర్తితో ఎస్‌సి, ఎస్‌టిలకు రాజ్యాంగం కల్పించిన ప్రాథమిక హక్కుల సాధనకు అనేక పోరాటాలు చేశారు. ముఖ్యంగా కారంచేడు, చుండూరు, పదిరికుప్పం, కంచికచర్ల, లక్షింపేట, ఆదిలాబాద్, మెదక్ తదితర ప్రాంతాలలో జరిగిన ఘటనలపై దళిత సంఘాలను సంఘటితపరిచి పెద్దఎత్తున ఉద్యమాలు చేశారు.*

## వచ్చే సంచికలలో...

- **బెంగాల్ వామపక్ష సంఘటన - సాంస్కృతిక రంగం : కొన్ని ఆలోచనలు - కొండూరి వీరయ్య**
- **రైతు ఉద్యమం - డా. కొల్లా రాజమోహన్**

# అమరావతి రైతుల పాదయాత్ర

***అడుగడుగునా ప్రజల మద్దతుతో కొనసాగుతున్న అమరావతి రైతుల పాదయాత్ర స్ఫూర్తిని ప్రభుత్వం గుర్తించి సమస్యకు శాశ్వత పరిష్కారం కనుక్కోవాలని అంటున్నారు* చిమ్మె. జాన్ బర్నబాస్**

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి రాజధానిగా 'అమరావతి'నే కొనసాగించాలని కోరుతూ 'అమరావతి పరిరక్షణ సమితి' గత రెండు సంవత్సరాల నుంచి అమరావతి రాజధానికి భూములు ఇచ్చిన 29 గ్రామాల రైతులు 2021 నవంబర్ 1 నుంచి 'న్యాయస్థానం నుంచి దేవస్థానం వరకు' పేరుతో మహా పాదయాత్ర చేపట్టారు. ఆంధ్రప్రదేశ్ హైకోర్ట్ ఉన్న నేలపాడు గ్రామం నుంచి ప్రారంభమైన ఈ యాత్ర 4 జిల్లాలు, 300 గ్రామాలు కలుపుకొని తిరుమల తిరుపతి దేవస్థానం వరకూ కొనసాగనుంది. దాదాపు భూములు ఇచ్చిన వారు 29 వేల మంది రైతులున్నప్పటికీ ఆంధ్రప్రదేశ్ హైకోర్ట్ ఆదేశాల మేరకు పాదయాత్రలో పాల్గొనేందుకు కేవలం 157 మందికి మాత్రమే అనుమతి లభించింది. నవంబర్ 1 నుంచి డిసెంబర్ 17 వరకు దాదాపుగా 47 రోజుల పాదయాత్రగా దీనిని రూపొందించారు. ఇక్కడ ప్రజలు అటు న్యాయస్థానం (ఆంధ్రప్రదేశ్ హైకోర్ట్)నూ, తిరుపతి వేంకటేశ్వర స్వామినీ నమ్ముకుంటున్నాం అని చెప్పకనే చెప్పినట్లు అర్థమవుతున్నది. అందుకే ఇక్కడి గ్రామాల శిబిరాలలో సైతం అటు అంబేద్కర్, భారత మాత చిత్ర పటాలు, న్యాయ దేవతా ప్రతిమలు మనకు దర్శనమిస్తాయి. ఇక్కడి గ్రామాల ప్రజలందరూ సమిష్టిగా 700 రోజులుగా ఉద్యమిస్తున్నారు. వాస్తవానికి ఈ అమరావతి ప్రజల ఉద్యమానికి అధికారంలో ఉన్న వై.ఎస్.ఆర్. కాంగ్రెస్ పార్టీ తప్ప ప్రధాన రాజకీయ పార్టీలన్నీ మద్దతు తెలిపాయి. అయినప్పటికీ అమరావతి గ్రామాల ప్రజలు తెలుగుదేశం పార్టీ అధికారంలో ఉన్నప్పుడు 2014-19 కాలంలో భూములు ఇచ్చాం కాబట్టి ప్రధాన బాధ్యత తెలుగుదేశం పార్టీ తీసుకోవాల్సిందేనంటున్నారు. అందుకే తెలుగుదేశం పార్టీ ప్రధాన నాయకత్వం అంతా అమరావతి గ్రామాలను సందర్శిస్తూ ఈ ఉద్యమాన్ని నడిపిస్తూ ఉన్నారు. భారతీయ జనతా పార్టీ రాష్ట్ర నాయకత్వం భిన్న స్వరాలు వినిపిస్తోంది. బిజెపితో కలిసి నడుస్తున్న జనసేన పార్టీ మాత్రం ప్రత్యక్షంగా పాల్గొంటున్నది. దళిత బహుజన ఫ్రంట్, ఆమ్ ఆద్మీ పార్టీ, అమరావతి దళిత - బహుజన జెఏసి తదితర సంఘాలు పాల్గొంటున్నాయి.

ఆంధ్రప్రదేశ్ శాసనసభ, సచివాలయం, హైకోర్ట్ అన్నీ ఇక్కడే ఉన్న అమరావతి ప్రాంతాన్ని 'రాజధాని'గా ప్రకటించిన అప్పటి అధికార పార్టీ అయిన తెలుగుదేశం పార్టీ ఈ మహా పాదయాత్రను భుజాల మీద వేసుకొని నడిపిస్తున్నది. కేవలం మూడు రాజధానుల నినాదాన్ని వై.ఎస్.ఆర్. కాంగ్రెస్ పార్టీ ఇప్పటికీ విడువలేదు. అంతే కాకుండా 'అమరావతి రైతుల మహా పాదయాత్ర'ను నిలుపుదల చేసే ప్రయత్నంలో భాగంగా రాష్ట్ర పోలీస్ ప్రధాన కార్యాలయం నుంచి పాదయాత్రకు అనుమతి నిరాకరిస్తూ అమరావతి రైతుల పరిరక్షణ కమిటీకి నోటీసులు జారీ చేసింది. పాదయాత్ర చేయడానికి వీలు లేదంటూ అనేక విధాలుగా అడ్డంకులు సృష్టిస్తోంది. మొత్తం అమరావతి ప్రధాన గ్రామాలన్నింటినీ పోలీసులతో నింపింది రాష్ట్ర ప్రభుత్వం. నాయకత్వం వహిస్తున్న వారందరిపై పోలీస్ నిఘా పెట్టింది. అసలు విషయం ఏమంటే ఇంతవరకూ ఈ అమరావతి రైతు నాయకులతో ఈ ప్రభుత్వం కానీ, ప్రభుత్వ ప్రతినిధులు కానీ చర్చలు జరపలేదు. ఉద్యమాన్ని అణచివేయాలనే దృష్టితోనే ఈ ప్రభుత్వం చూస్తున్నది తప్ప దీనికి ఒక పరిష్కారం కనుగొనాలనే ప్రయత్నం చేయకుండా నిర్బంధాన్ని ప్రయోగిస్తోంది తప్ప, ప్రజాస్వామికంగా వ్యవహరించడం లేదు. కనీసం ప్రజలకున్న రాజ్యాంగ హక్కులను గౌరవించకుండా, ప్రతి విషయానికీ హైకోర్ట్‌ను ఆశ్రయించే పరిస్థితిని కల్పిస్తున్నది. ఆంధ్రప్రదేశ్ హైకోర్ట్ ఈ రాష్ట్ర ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఇప్పటి వరకూ 170 తీర్పులిచ్చింది. అంతే కాకుండా దీనిపై సుప్రీంకోర్టులో వాదించే న్యాయవాదులను ఆంధ్రప్రదేశ్ హైకోర్ట్‌కు తీసుకువచ్చి కోట్ల రూపాయలను అనవసరంగా ఖర్చు చేస్తోంది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి చెందిన 13 జిల్లాలకు మధ్యలో ఉండే రాజధాని ప్రాంతం 'అమరావతి'కి నాడు ప్రతిపక్ష పార్టీ నాయకుడిగా ఉన్న వై.ఎస్. జగన్‌మోహన్‌రెడ్డి మద్దతు పలికాడు, రాజధాని నిర్మాణానికి 33 వేల ఎకరాలు అవసరమనే విషయానికి కూడా తన అంగీకారాన్ని తెలియజేశాడు. అధికారంలోకి వచ్చాక మాట మార్చి మూడు రాజధానుల విషయాన్ని ముందుకు తీసుకొచ్చాడు. ఇది ఒక రకంగా రాష్ట్ర ప్రజలందరినీ మోసగించడమే. పైగా ఎన్నికల సమయంలో కానీ, రాష్ట్రంలో తాను పాదయాత్ర చేసే సమయంలో కానీ మూడు రాజధానులు నిర్మిస్తానని ఏనాడూ చెప్పని జగన్‌మోహన్‌రెడ్డి, నేడు మూడు రాజధానుల విషయాన్ని ప్రస్తావించడం విచారకరం. దేశంలో ఎక్కడా 3 రాజధానులు లేని విషయాన్ని నమ్మించే ప్రయత్నం చేయడం రాజ్యాంగ విరుద్ధం.

ఒక్క రాజధానికే దిక్కూ దివాణం లేదు, మూడు రాజధానులు ఏమి నిర్మాస్తావని ఇక్కడి ప్రజలు ఈ రాష్ట్ర ముఖ్యమంత్రిని ప్రశ్నిస్తున్నారు. ఇక్కడి మహిళా మణులు అన్నీ తామై ముందుకు నడిపించడం విశేషం. ఉన్నత విద్యనభ్యసించిన వారు, ఎన్నడూ సామాన్య ప్రజలతో మమేకం కానివారు ఈ ఉద్యమంలో పాల్గొనడం ఈ ఉద్యమానికున్న ప్రత్యేకత. అగ్రకుల మహిళలు (కాపు, కమ్మ, రెడ్డి, బ్రాహ్మణ తదితర కులాలకు చెందిన వారు) తామెన్నడూ ఊహించని విధంగా ఈ ఉద్యమంలో పాల్గొనడం ఒక రకంగా ఇక్కడ ఉన్న కుల దొంతర సమాజంలో మార్పు వస్తుందనే సూచిక కనబడుతున్నది. తాము అమరావతిని రాజధానిగా ప్రకటించే వరకూ విశ్రమించబోమనే కఠోర దీక్ష ఈ మహిళలలో కనబడుతున్నది. భవిష్యతులో ఈ ఉద్యమం తీవ్ర ఉద్రిక్తతలకు దారితీస్తే దానికి ఈ రాష్ట్ర ప్రభుత్వం బాధ్యత వహించవలసి ఉంటుంది. మహిళలకున్న భక్తి భావాన్ని ఇక్కడ ఉన్న భారతీయ జనతా పార్టీ, రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్

(ఆర్ఎస్ఎస్)లు తాము ఉపయోగించుకొని బలపడాలనే భావనతో ఉన్నారు. ఉభయ కమ్యూనిస్టు పార్టీలైన సిపిఐ, సిపిఎంలలో సిపిఐ పార్టీ మాత్రం ప్రత్యక్షంగా పాల్గొంటున్నది. సిపిఎం పార్టీ మాత్రం అప్పుడప్పుడూ, అక్కడక్కడా పాల్గొంటూ తాము కూడా ఈ ఉద్యమానికి మద్దతునిస్తున్నామనే ప్రకటనలనిస్తోంది. ప్రకాశం జిల్లాలో ఈ మహా పాదయాత్ర ప్రవేశించినప్పుడు సిపిఎం కేంద్ర కమిటీ–పోలిట్ బ్యూరో సభ్యుడు బి.వి. రాఘవులు ప్రత్యక్షంగా పాల్గొని ప్రసంగించారు. వాస్తవానికి మొదట కమ్యూనిస్ట్ పార్టీల నాయకత్వంలోనే అమరావతి రైతుల ఉద్యమం రూపుదిద్దుకొంటుదని రాష్ట్ర ప్రజలందరూ భావించారు. అయితే ఆ గ్రామాల ప్రజలు ఎందుకో విముఖత చూపారు. అంతే కాకుండా ఆ గ్రామాల ప్రజలు కూడా ఏదో వారం – పది రోజుల్లో ఈ ఉద్యమం ముగుస్తుందని మొదట్లో భావించారు. అయితే ఈ రాష్ట్ర ప్రభుత్వం మొండి వైఖరి రీత్యా ఈ ఉద్యమం రెండు సంవత్సరాలుగా కొనసాగుతున్నది.

ఇప్పటివరకూ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఈ ఉద్యమంలో పాల్గొంటూ మరణించిన రైతులు దాదాపు 200 మంది దాకా ఉన్నారు. వీరిలో ఎక్కువ మంది కూడా రైతు కూలీలు, దళితులే. ప్రభుత్వం ఇప్పటివరకు కూడా తన మొండి వైఖరి వీడకుండా విశాఖపట్నంలో పాలనా రాజధాని, కర్నూలులో న్యాయ రాజధాని, అమరావతిలో శాసన రాజధాని అంటూ తమ వైఖరిని ప్రకటిస్తూనే ఉంది. అంతే కాకుండా ఇప్పటికే రాష్ట్ర మానవ హక్కుల కమిషన్, రాష్ట్ర లోకాయుక్త కార్యాలయాలను కర్నూలులో ప్రారంభించి అక్కడ నుండే కార్యకలాపాలు కొనసాగిస్తున్నారు. కర్నూలులో ప్రారంభించిన లోకాయుక్త, మానవ హక్కుల కమిషన్ కార్యకలాపాల పైన కూడా రాష్ట్ర హైకోర్ట్‌లో రాజధాని ప్రాంత రైతులు పిటిషన్ వేశారు. ఈ రాష్ట్ర ప్రభుత్వం బాధ్యతాయుతంగా కాకుండా, నిరంకుశ వైఖరితో తన పట్టుదలను కొనసాగిస్తూనే ఉంది.

రాష్ట్ర ప్రభుత్వంలో భాగస్వాములైన మంత్రుల మాటలు – చేతలు రాజధాని రైతులను మరింత బాధకలిగిస్తున్నాయి. ముఖ్యమంత్రి వైఖరి 3 ప్రాంతాల మధ్య ఘర్షణను సృష్టించే విధంగా ఉన్నది. ఉత్తరాంధ్రలో శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం, రాయలసీమలో కర్నూలు, అనంతపురం, కడప అభివృద్ధి చెందలేదు కాబట్టి ఆయా ప్రాంతాలను అభివృద్ధి పరచడానికే మూడు రాజధానులని అధికార పార్టీ నాయకులు అంటున్నారు. ఈ మూడు ప్రాంతాల అభివృద్ధికి కట్టుబడి ఉన్నామని వారు ప్రకటించినప్పటికీ, కేవలం ఆయా ప్రాంతాలలో వారి పార్టీ నాయకుల, వారికి సహకరించేవారి రియల్ ఎస్టేట్ వ్యాపారాలను అభివృద్ధి చేయడానికే అనేది స్పష్టమవుతున్నది. 3 ప్రాంతాల ప్రజల మధ్య ఈ ప్రభుత్వం చిచ్చు పెడుతోంది. ఈ మహా పాదయాత్ర ప్రకాశం జిల్లాలో ప్రవేశించినప్పుడు జిల్లా ఎస్‌పి, ఇతర పోలీస్ అధికారులు పాదయాత్రకు మద్దతు తెలిపే రైతులపై లాఠీ చార్జి చేశారు. మొత్తం పాదయాత్ర వెంట ఒక ప్రత్యేక పోలీస్ టీమ్‌ను పెట్టి, వీడియో గ్రఫీ చేస్తూ, అడుగడుగునా నిఘా పెడుతూ, వీరికి సహకరిస్తున్న వారి వివరాలు సేకరిస్తూ ప్రజలను భయ భ్రాంతులకు గురిచేస్తున్నారు. అమరావతి రైతుల మహా పాదయాత్రకు దారి పొడవునా, ఆయా గ్రామాల్లో లభిస్తున్న ఆదరణను చూసి ఈ ప్రభుత్వం సహించ లేకుండా ఉంది.

ప్రజా పోరాట రూపాలలో 'పాదయాత్ర'లనేవి కూడా ఒక రూపం. అది ప్రజలను చైతన్యవంతులను చేసే కార్యక్రమం. దాదాపుగా 1/4 వంతు రాష్ట్రం భూభాగం ప్రచారం అయ్యే విధంగా ఈ పాదయాత్ర రూపకల్పన జరిగింది. అమరావతి రైతుల మహా పాదయాత్రలో రాష్ట్ర నలుమూలల నుంచి వివిధ వర్గాల ప్రజలు పాల్గొంటున్నారు. వారు కూడా తమ వంతు ఇతోధికంగా సహకరిస్తున్నారు. కేంద్రంలో ఉన్న భారతీయ జనతా పార్టీ ప్రభుత్వం కూడా దోబూచులాట ఆడుతోంది. ఒకవైపు వై.ఎస్.ఆర్. కాంగ్రెస్ పార్టీతో మిత్ర వైఖరి ప్రదర్శిస్తూ, మరోవైపు అతని నుంచి నాయకులను తమ వైపుకు తిప్పుకోవాలనే ప్రయత్నం కూడా చేస్తున్నది. తద్వారా రాజకీయ ప్రయోజనం పొందాలనుకుంటున్నది. ఇది బిజెపి ద్వంద్వ వైఖరికి నిదర్శనం. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ముఖ్యమంత్రిపై ఉన్న సిబిఐ కేసులను చూపిస్తూ, కేంద్రంలో ఉన్న బిజెపి ప్రభుత్వం వై.ఎస్.ఆర్. కాంగ్రెస్ పార్టీని లొంగదీసుకోవాలని చూస్తున్నది. నిజంగా బిజెపి అనుకుంటే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి అమరావతే రాజధానిగా కొనసాగుతుంది. ఆంధ్రప్రదేశ్ పర్యటనకు తిరుపతికి వచ్చిన కేంద్ర హోం శాఖా మంత్రి అమిత్ షా అమరావతికి బిజెపి మద్దతునిస్తున్నట్లు ప్రకటించారు. ఇక్కడ బిజెపి రాష్ట్ర నాయకత్వం సంపూర్ణంగా మద్దతునివ్వడం లేదు. అమిత్ షా వచ్చిపోయిన తర్వాత బిజెపి వైఖరిలో ఏదైనా మార్పు వస్తుందేమో చూడాలి. అమిత్ షా ప్రకటన తర్వాత అమరావతి రైతుల మహా పాదయాత్రకు బిజెపి మద్దతు ఉన్నట్లు స్పష్టమవుతున్నది. ఈ విధంగా రైతుల పాదయాత్ర ఒక విజయం సాధించినట్లే అనుకోవచ్చు.

కాబట్టి ఇప్పటికైనా రాష్ట్ర ప్రభుత్వం అమరావతి రైతుల మహా పాదయాత్ర స్ఫూర్తిని అర్థం చేసుకోవాలని కోరుకుందాం. రైతు ఉద్యమం తీవ్ర దశకు చేరుకోకముందే సమస్యను పరిష్కరిస్తే ఇరువైపులా ప్రయోజనం ఉంటుంది.

• • •

మూడు రాజధానుల రద్దు నిర్ణయం కన్న ముందు అమరావతి పాదయాత్ర గురించి రాసిన ఈ వ్యాసానికి తాజాకలం:

2021 నవంబర్ 22న ఉదయం 10.30 గంటల సమయంలో చీఫ్ జస్టిస్ గారి కోర్ట్‌లో రాష్ట్ర అడ్వకేట్ జనరల్ శ్రీరామ్ సుబ్రమణ్యం రాష్ట్ర ప్రభుత్వం మూడు రాజధానుల ప్రక్రియ విషయాన్ని వెనక్కి తీసుకుంటున్నట్లు రాష్ట్ర అసెంబ్లీలో ప్రకటన చేయబోతోంది కాబట్టి ఈ కేసు వాదనలను కూడా నిలుపుదల చేయాలని అభ్యర్థించారు. అందుకు చీఫ్ జస్టిస్ గారు (జస్టిస్ ప్రశాంత్ కుమార్ మిశ్ర) రాష్ట్ర ప్రభుత్వ వైఖరిని తెలియజేస్తూ రాతమూలకంగా అఫిడవిట్ రూపంలో ఇవ్వాలని కోరారు. అందుకు రాష్ట్ర అడ్వకేట్ జనరల్, ముఖ్యమంత్రి అసెంబ్లీలో మూడు రాజధానుల బిల్లును ఉపసంహరించు కుంటున్నట్లు అఫిడవిట్ రూపంలో తెలియజేశారు. ఒక గంట తర్వాత జగన్‌మోహన్‌రెడ్డి అసెంబ్లీలో మూడు రాజధానుల బిల్లును సమగ్రమైన సమాచారంతో మళ్లీ ప్రకటిస్తామని, ఆ విషయంలో ఇంకా కూలంకుషంగా చర్చించి మరింత పకడ్బందిగా వస్తామని రాష్ట్ర అసెంబ్లీలో తెలియజేశారు. అమరావతి రైతులు చేస్తున్న మహా పాదయాత్ర విషయంలో కొంత వెనక్కి తగ్గి, వారికి కొంత సమయమిచ్చి మరింత కఠినతరమైన వైఖరితో ముందుకెళుతారని అర్థమవుతున్నది. అందుకు అధికార పార్టీ వైఖరి రైతుల పాదయాత్రను చూసి మేము భయపడడం లేదని, సాంకేతిక సమస్యలను మాత్రమే సరిదిద్దుకుంటున్నామని చెబుతున్నారు. హైకోర్ట్‌లో గతవారం రోజుల నుంచి వాదనలు జరుగుతున్నప్పటికీ, అనుకోకుండా ప్రభుత్వం ఈ వైఖరి తీసుకున్నదంటే ఈ కేసు విషయంలో తమకు వ్యతిరేకంగా తీర్పు రాబోతుందని ముందే ఊహించారా? లేదా న్యాయస్థానం న్యాయ విచారణ ప్రక్రియను తప్పుదోవ పట్టించి, మూడు రాజధానులు

# ప్రజల ఇక్కట్లు పట్టని తిట్ల పురాణం

***నాయకుల తిట్ల పురాణం, భావోద్వేగాలను రెచ్చగొట్టడం, ప్రశ్నించేవారిని అణచివేయడం ప్రజల సమస్యలకు పరిష్కారం చూపవని, మరింత పెద్ద ఎత్తున సంఘర్షణలకు దారితీస్తాయని అంటున్నారు* బి.ఎస్. రాజు**

హిరణ్యకసిపున్నిరా! నిన్ను ఇరచుకు తింటనురా! అంటాడొకడు. నరసింహరాజునురా! నిన్ను నంజుకు తింటనురా! అంటాడు మరొకడు. రావణబ్రహ్మనురా! నీరక్తం తాగుతరా! అని రంకెలు వేస్తాడు మరో ఈరడు.

మెడలు విరుస్తా! నాలుక కోస్తా! తాట తీస్తా! పాతర వేస్తా! నరికి పోగులు పెడతా! ఎడ్రసు లేకుండా చేస్తా! ఇదీ దండకం! భరించలేని, చెవులు చిల్లులుపడే, రోతతో వికారం పుట్టించే రాజకీయ నాయకుల నడివీధి తిట్ల పురాణం.

వీధి కుళాయిల దగ్గర ఓ బిందెడు నీళ్లకోసం పేద స్త్రీలు ఇటువంటి బూతులు, జుట్లు పీక్కోవడాలు, ఇంకా పీకులాట ముదిరి గుద్దులు, తన్నుల వరకు దిగడాలు.. నడి బజారులో ఇటువంటి సీన్లు తరచూ దర్శనమిస్తూ ఉండేవి, ఉమ్మడి తెలుగు రాష్ట్రమంతటా!

దుర్భరమైన నీళ్ల కటకటతో, ఓ బిందెడు నీళ్లకై పడరాని పాట్లతో విసిగి వేసారి, నీరసించి, హతాశులై, నిస్సహాయ మానసిక స్థితితో ఇటువంటి వీధి జట్టీలకు, తిట్ల దండకాలకు ఉపక్రమించేవారు, బస్తీల నివాస మహిళలు.

ఇప్పుడు, ఈ రోజుల్లో, ప్రజల ఓట్లు కొనుక్కునో, జిమ్మిక్కులతో, స్కీమిక్కులతో దండుకునో, అందలమెక్కి, అధికార బలంతో, అక్రమార్జనలతో అనుభవిస్తున్న హెూదా, ధనార్జనా-వనరు ఎక్కడ కోల్పోతామనో, లేక సన్నగిల్లిపోతుందనో భయంతో, భీతితో అధికారంలో ఉన్న రాజకీయ నాయకులు, వారి తైనాతీలు ప్రత్యర్థి పార్టీలపై, నాయకులపై తిట్ల పురాణ ప్రేలాపనకు పాల్పడుతున్నారు. ఇదొక వైపు జరుగుతున్న తంతు.

మరో వైపు అధికారం కోల్పోయి, రాజకీయ నిరుద్యోగంతో, సన్నగిల్లిన సంపాదనతో విలవిల్లాడుతూ గిలగిల కొట్టుకుంటూ తిరిగి అధికార పీఠం అధిష్టించే మార్గాన్వేషణలో, ఓట్ల వేటలో అధికార పక్షంపై ప్రత్యర్థి, ప్రతిపక్ష రాజకీయ పార్టీల నాయకులు తిట్ల దండకాన్ని ఎత్తుకోవడం ఓ నిత్యపురాణ పఠనంలా తయారయ్యింది.

ఈ తిట్ల పురాణాన్ని కవి చౌడప్పకు మించి రక్తి కట్టించే నాయకమన్యులు, మౌత్ పీసులు, ప్రత్యేక తర్ఫీదు పొందిన వస్తాదులు.. వీరితో కూడిన బూతు సాంస్కృతిక సైన్యాన్ని ప్రతి ప్రధాన రాజకీయ పార్టీ సమకూర్చుకుంది.

ఈ బూతు రోత విద్యను ఓ ప్రచార కళగా, ఓ వినోద ప్రదర్శనగా పెంచి పోషిస్తున్నాయి అన్ని రాజకీయ పార్టీలు. ఓట్లు రాబట్టు కోవడానికి, రాజకీయ జూదపు పందెంలో గెలవడానికి, గెలిచి అధికారం అందుకుని పదవుల కుర్చీల నధిష్టించడానికి ఈ బూతుల రామాయణం మంచిగా ఉపయోగ పడుతోంది, ఈ నాటి రొచ్చుగుంట రాజకీయ బకాసురలకు.

అంతేకాదు, ఇంతకు మించి ప్రజలు అనుదినం ఎదుర్కొంటున్న సమస్యల నుండి, ఇబ్బందుల ఇక్కట్ల నుండి వారి దృష్టి మళ్లించి తమ సమస్యల పరిష్కారానికి నాయకులను నిలదీసి ప్రశ్నించకుండాను, పోరాట మార్గానికి మళ్లకుండాను ఈ బూతు కళ ఓట్ల కొనుగోళ్ల రాజకీయ శక్తులకు ఓ మంచి ఆయుధంలా కూడా ఉపయోగపడుతోంది.

ఈ రోజు నువ్విటు, నేనటు బీ ఆ మేల నేనిటు నీవటు స్థానభ్రంశమై కోళ్ల, పొట్టేళ్ల, ఆబోతుల పందేలు నడిపి ప్రజలను జూదరులను, తాగుబోతులను చేసి ఆటాడిద్దాం! పబ్బం గడుపుకుందాం! అనే నూతన సూత్రం ఇప్పటి రాజకీయ క్రీడావరణంలో స్థిరపడింది.

ఇదీ ఈ దేశ ప్రజలకు అందివచ్చిన 75 ఏళ్ల స్వాతంత్ర ఫలం. మనం నకిలీ నవ్వులతోనో, బూటక మనస్తత్వంతోనో, లోలో ఏడుస్తూనో, బయటకు డాంబికాలు పలుకుతూనో ప్రపంచంలోనే అతిపెద్ద ప్రజాస్వామ్య దేశమని డప్పు కొట్టుకునే, మన నేటి మహత్తర భారతం బజారు తిట్లతో కనివిని ఎరుగని వక్రీకరణలతో, లుకలుక లాడుతున్నది. కడుపు తరుక్కుపోయే 75 వసంతాల విషాద భారతం మనముందు దీనంగా నిలబడి ఉన్నది. ఇంకా నన్నేం చేయ దల్చుకున్నారని, ఏ అగాధాల్లోకి నెట్టేయదల్చుకున్నారని ప్రశ్నిస్తున్నది.

భారతదేశంలో ఏ రాష్ట్రానికీ లేవనే విషయం ముందే అర్థమైందా? అనేది భవిష్యత్తులో తెలుస్తుంది.

అమరావతి రైతుల పాదయాత్రకు ప్రజల మద్దతు క్రమేపీ పెరుగుతుండడం, విపక్షాలన్నీ ఏకం కావడం, కేంద్ర హోం మంత్రి అమిత్ షా కూడా రాష్ట్ర బిజెపి నాయకులు మహా పాదయాత్రలో పాల్గొంటారని ప్రకటించడం ముఖ్యమంత్రిలో ఏదో భయం నెలకొన్నట్లు అర్థమవుతున్నది. ప్రజలలో తన పట్ల వ్యతిరేకత ఎక్కువవుతున్నట్లు తనకున్న 'ఇంటెలిజెన్స్ బ్యూరో' ద్వారా తెలియడం కూడా ఒక కారణం కావచ్చు. అంతే కాకుండా ముందు రోజు ముఖ్యమంత్రి పినతండ్రి వివేకానందరెడ్డి హత్య కేసులో కడప ఎంపి అవినాశ్‌రెడ్డి, అతని తండ్రి వై.ఎస్. భాస్కర్‌రెడ్డి ప్రమేయం ఉన్నట్లు డ్రైవర్ దస్తగిరి సిఆర్‌పిసి 164 సెక్షన్ కింద వాంగ్మూలం ఇవ్వడం, ఎంపి, ప్రధాన అనుచరుడు శివశంకర్‌రెడ్డి అరెస్ట్ కూడా జరిగిపోవడం, రేపో మాపో ముఖ్యమంత్రికి అన్ని తెలిసే ఈ హత్య జరిగిందనే విషయం బయటికి వస్తుందనే పరిస్థితుల్లో ముఖ్యమంత్రి కొంత వెనక్కి తగ్గి ఈ ప్రకటన చేసినట్లు అర్థమవుతున్నది. ఏది ఏమైనప్పటికీ ముఖ్యమంత్రి మూడు రాజధానుల విషయంలో పునరాలోచనలో పడినట్లు అర్థమవుతున్నది. ఇది రాజధాని రైతుల మహా పాదయాత్ర ప్రాథమిక విజయంగా భావించవచ్చు.

*(రచయిత న్యాయవాది, ఒపిడిఆర్ రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

ఈ వేదన, రోదన, ఈ దైన్యం ఈ దేశ యువతకు వినిపిస్తున్నదా? కనిపిస్తున్నదా? లేక ఈ పరిస్థితికి కారకులైన రాజకీయ ధూర్తుల బూతుపురణాలకు, వక్రీకరణలకు, కుహనా దేశభక్తి వికార విన్యాసాలకు ముగ్ధులై ఈలలు వేస్తూ, తప్పట్లు కొడుతూ జీవించ దల్చుకున్నారా? ఆలోచించండి, మేల్కోండి.

75వ స్వతంత్ర అమృత మహోత్సవం, 'ఆజాదీ క అమృత్ మహోత్సవ్' ఓ ఏడాది పాటు దేశ ప్రజలు ఘనంగా జరుపుకోవాలని దేశ ప్రధాని పిలుపునిచ్చారు. భేష్! బాగుంది. తప్పక జరుపుకో వలసిందే! ప్రతి భారతీయుడు అది గర్వంగా చెయ్యాల్సిన పనే! అయితే ఈ గర్వం కృత్రిమంగా తగిలించుకున్న కొని తెచ్చుకున్న గర్వమా? లేక నిర్దుష్ట ప్రతిభా పాటవాలతో సాధించిన దేశ ప్రగతికి ఉప్పొంగి పులకించిపోయే సహజ సోపానాల గర్వమా? లేక తేదీల, అంకెల, ఘటనల, పాతి నిలబెట్టిన ప్రతిమల ప్రతిష్టల పూజా వేదికల కుంకుమార్చనారాధనల గర్వమా?

మహాత్మా గాంధీ నడిపిన ఉప్పు సత్యాగ్రహానికి గత మార్చ్ 12, 2021 నాటికి 91 సంవత్సరాలు. 15 ఆగస్టు 2023 నాటికి దేశ స్వాతంత్రానికి 75వ వసంతం పూర్తవుతుంది. ఈ మహత్తర సందర్భాన్ని పురస్కరించుకుని దేశ ప్రధాని ఆ రోజున అంటే మార్చ్ 12, 2021న గుజరాత్ లో ఈ వేడుకల కార్యక్రమాన్ని ఆరంభించారు. స్వాతంత్ర పోరాట స్ఫూర్తికి, స్వతంత్ర సమర యోధుల త్యాగాలకు నివాళులు అర్పించడం, వారి గొప్ప ఆశయాలను స్మరించుకుంటూ, వారు కన్న కలలను సాకారం చేసుకునే ప్రతిజ్ఞతో 75 వారాలు ప్రతినలు బూనుతూ 75వ స్వతంత్ర దినోత్సవ దీక్ష చేబట్టాలని దేశ ప్రజలకు ఉపదేశించారు. ఈ ఆరాటం ఉండటం సమంజసమేగాని దీనికై ఇంత లావు అంకెల ఆర్భాటం స్వాతంత్ర పోరాట స్ఫూర్తిని పల్చబర్చడంలేదా?

మనం గర్వపడాలి, సరే పడాల్సిందే! అయితే 75 ఏళ్ల స్వాతంత్ర భారతంలో మనం గర్వంగా చెప్పుకోదగ్గ సాధించిన ఘనవిజయాలేము న్నాయి? ఇన్నేళ్ల స్వతంత్ర పాలనలో స్త్రీలను, పసిపిల్లలను పైశాచికంగా మాన భంగాలకు, హత్యలకు, కనీవినీ ఎరుగని అకృత్యాలకు గురిచేయడమా మనం గర్వపడాల్సినది? క్రికెట్ ఆటలో ఓడిపోయి నందుకు ఆ జట్టు సారథి పసి కూతుర్ని మానభంగం చేస్తానని బెదిరించే వికృత దేశభక్తిని మనోవికారాన్ని పెంచి పోషించిన భ్రష్ట సంస్కృతిని మానసిక జాడ్యపు విస్మృతిని చూసి గర్విద్దామా?

ఈ ఏడున్నర దశాబ్దాల్లో సమాజంలో ఆర్థిక సామాజిక అంతరాలను అధిగమించామా? అంటరానితనాన్ని నిర్మూలించామా? పేదరికాన్ని, అవిద్యను, నిరక్షరాస్యతను రూపుమాపామా? నిరుద్యోగ మన్నది లేకుండా చేయగల్గామా? కష్టించి పనిచేసుకు బతుకుతామనే వారికి పని కల్పించగల్గామా? సకల జనులకు విద్య వైద్య, ఆరోగ్య సేవలు సమాన స్థాయిలో అందిస్తున్నామా? ఆర్థిక స్వావలంభన సాధించామా? విదేశీ దేశీ దళారీ దోపిడీ వ్యవస్థను రద్దుచేసామా? అవినీతిని తుంచామా? లేక పెంచామా? అంటే దేనికీ అవునని సమాధానం లేనప్పుడు ఈ దేశ ప్రజలు దేనికి గర్వపడాలి? ఎందుకు గర్వపడాలి? గుప్పెడుగా ఉండే బడా శేట్లు గంపెడయ్యారనా? ప్రజారంగ సంస్థలన్నిటినీ ప్రైవేటు పరం చేసి ప్రజల ఆస్తులను కొల్లగొడుతున్నందుకా? నామమాత్రపు ప్రజాస్వామ్యాన్ని కూడా నామరూపాల్లేకుండా చేసి, మంటగల్పి మంగళం పాడుతున్నందుకా? ఎందుకని, దేనికని గర్వపడాలి? అయినా గర్వపడాల్సిందే అంటారా, అలా గర్వపడటమే దేశభక్తి అంటారా, అయితే అలానే చేద్దాం! కడుపు చించుకునైనా సరే! తల నరుక్కునైనా సరే! మన దేశభక్తిని నిరూపించుకుందాం!

ఈ 75 ఏళ్ల స్వతంత్ర సంబరాలు సనాతన భారత వైభవం, ఆధునిక భారత కీర్తి ప్రతిష్టల మేళవింపుగా, మన ఋషి పుంగవుల ఆధ్యాత్మిక చింతనా వెలుగులు, మన శాస్త్రజ్ఞుల శక్తిసామర్థ్యాల పాటవం, జాతి పురోగతి ప్రతిబింబించే విధంగా ఈ వేడుకలు జరగాలని దేశ ప్రధాని ఉద్ఘాటించారు. 'ఇండియాఏ 2047' భవిష్యదర్శనాన్ని రచించుకోవాలని స్వతంత్ర పోరాటంలో అసువులు బాసిన చరిత్రకెక్కిన, చరిత్రకెక్కని త్యాగధనుల బలిదానాలను ఎత్తిపట్టే విధంగా 'ఆజాదీ కా అమృత్ మహోత్సవ్' జరుపుకోవాలని జాతి ప్రజలను ఉద్వేగంతో సంబోధించారు. ఈ ఉద్వేగభరిత సంబోధన, పిలుపు చదివిన తరువాత మరిన్ని ప్రశ్నలు, అడగాల్సిన ప్రశ్నలు, జవాబులు రాబట్టాల్సిన ప్రశ్నలు ఉత్పన్నమౌతున్నాయి.

1. సనాతన ధర్మంతో ఆధునిక భారత నిర్మాణం సాధ్యమా? ఆ రెండు జమిలిగా ఎల్లకాలం కొనసాగాలా?
2. మన సనాతన ధర్మము, ఋషి పుంగవుల జ్ఞానసంపదా వెలుగులు ఎటువంటివి? ఆధ్యాత్మిక చింతన, భావజాలము ఈ దేశంలో ఏ రకమైన ఆర్థిక సామాజిక సాంస్కృతిక విలువలు గల సమాజాన్ని అందించింది? ఈ భావజాలం సృష్టించిన మనుధర్మ బ్రాహ్మణ్య చాతుర్వర్ణ వ్యవస్థ ఇప్పటి ఆధునిక భారత నిర్మాణానికి, ఉన్నతమైన సామాజిక పరిణామానికి దోహదపడిందా? లేక అడ్డుగోడగా పెద్ద ఆటంకంగా మారిందా? ఈ దేశం 75 ఏళ్ల స్వాతంత్రం తరువాత కూడా సోషలిస్టు సమాజం సంగతి పక్కకు పెడితే కనీసం ఓ ఉదారవాద ప్రజాస్వామ్య వ్యవస్థగానైనా ఎందుకు రూపుదిద్దుకోలేక పోయింది?
3. ఈ సనాతన అధునాతన సంకరజాతి విత్తనం ప్రణాళికాబద్ధ ఆర్థిక వ్యవస్థను, జనామోదిత ఉత్పత్తి రంగాన్ని, పని సంస్కృతితో కూడుకున్న జీవన విధానాన్ని ఎందుకు పెంపొందించలేక పోయింది?

ఆధునిక భారత నిర్మాణం పదాల అంకెల గారడీతోనో, ప్రగల్భాలతోనో, ప్రలోభాలతోనో సాధ్యమయ్యేది కాదు.

ఆరోగ్యకరమైన సమానత్వ భావానలేని సనాతన సంస్కృతిని ఆధునిక శాస్త్రీయ విజ్ఞానంతో అంటుకట్టడంతో జరగని పని. పనివాడే మొనగాడు. పనిచేయని సోంబేరి తిండికి, సమాజానికి అనర్హుడు.

శ్రామిక సంస్కృతే మానవజాతి పురోగతి. ప్రకృతి పర్యావరణ సంహిత మానవీయ జీవన విధానం ఆధునిక భారత నిర్మాణానికి గతిసూత్రంగా మారినప్పుడే ఓ ఉన్నత ఆధునిక సమాజం, ఓ మానవీయ శాస్త్రీయ నవ భారతదేశం నిర్మితమవగలదు గాని వేరే విధంగా సాధ్యంకాదని ఈ దేశ ప్రజలు గుర్తించాలి. ప్రజలు గుర్తించి అటువంటి పెను మార్పుకై ఉద్యమిస్తేగాని నూతన భారతం ఆవిర్భవించదు. మంత్రాలకు తంత్రాలకు సాముగారడీలకు అంకెల ఆర్భాటాలకు అద్భుతాలు జరగవు. తిట్ల పురాణాలతో, చరిత్ర వక్రీకరణలతో, ఫాసిస్టు అణచివేతలతో ప్రజల ఇబ్బందులు ఇక్కట్లు తీరవు. అవి తీరనంత కాలం సామాజిక సంఘర్షణ, పోరాటాలు తప్పవు. ఈ సంఘర్షణల, పోరాటాల మూలకారణాలను వెదికి వాటిని పరిష్కరించనట్లైతే, అణచివేతే పరిష్కార మనుకుంటే మహత్తర భారతం బదులు విపత్కర భారతం సంభవిస్తుంది.

*(రచయిత శ్రామికనేస్తం సంపాదకులు)* వీ

# అడవిలో అలజడికి పరిష్కారం లభించేనా..?

*ఆదివాసులకు రాజ్యాంగం కల్పించిన షెడ్యూల్ 5లోని చట్టాలను ప్రభుత్వాలు కాలరాస్తూ, జీవనాధారమైన పోడు భూములను వారికి చెందకుండా ఎలా చేస్తున్నామో వివరిస్తున్నారు* **తండ సదానందం**

అనాదిగా వందల సంవత్సరాల పైబడి తమ తాత ముత్తాతల కాలం నుండి అడవిలో పుట్టి, అడవి లోనే జీవిస్తూ, అడవిని కాపాడుతూ ప్రకృతి ఒడిలో స్వేచ్ఛగా హాయిగా సహజీవనం చేస్తూన్న, కల్లా కపటం ఎరుగని, అన్యాయాలు, అక్రమాలు, మోసాలు, వేషాలు తెలియని అడవి మల్లెలు అమాయకపు ఆదివాసి గిరిజనులు. ఈ ఆదివాసులు మట్టిని నమ్ముకుని తమ జీవనాన్ని కొనసాగించడానికి, తినడానికి తిండి గింజల కోసం తరతరాలుగా వస్తున్న ఆచార సాంప్రదాయాల ప్రకారం అడవిలో వ్యవసాయాన్ని చేస్తున్నారు. మట్టిని నమ్ముకొని సేద్యం చేస్తూ బతుకు బండిని లాక్కెళ్తూ ఉన్న ఈ దేశ మూలవాసులు ఆదివాసులు. భూమికోసం, భుక్తి కోసం, విముక్తి కోసం స్వాతంత్ర్యానికి పూర్వం వందల ఏళ్ల పాటు తమ స్వయం పాలన కోసం బ్రిటిష్ వారితో, నైజాం సంస్థానాధీశులతో, పాలక ప్రభుత్వాలతో నిరంతరం పోరాడుతూనే ఉన్నారు. ఆ పోరాటాల ఫలితంగానే 1874లో వచ్చిన షెడ్యూల్ జిల్లాల చట్టం 1935 నాటికి అప్పటి బ్రిటిష్ ప్రభుత్వం ఈశాన్య భారత దేశాన్ని గిరిజన ప్రాంతంగా ప్రకటించింది. తెలంగాణలో 1940లో ఆదిలాబాద్ జిల్లాలో జోడేఘాట్ వద్ద గిరిజన హక్కుల పోరాట యోధుడు కొమరం భీమ్ జల్, జమీన్, జంగల్ పై స్వయం పాలన కోసం అప్పటి నిజాం సర్కారు తో వీరోచితంగా పోరాడి అసువులు బాసిన ఫలితంగానే "ఫసలీ" చట్టం వచ్చింది. స్వాతంత్ర్యం అదే అధికార మార్పిడి జరుగుతున్న సమయంలో దేశ విభజనతో అన్యాయానికి గురవుతామనే ఆందోళనతో ప్రత్యేక ఆదివాసి దేశం కోసం ఆదివాసులు పట్టు పట్టడంతో ఆనాటి జాతీయ నాయకులు తీన్ మూర్తి భవన్ చర్చల మేరకు జరిగిన ఒప్పందం ప్రకారం ప్రత్యేక సదుపాయాలు, చట్టాలు పొందుపరుస్తామని అడవి పై సర్వ హక్కులు కల్పిస్తామని, ఆదివాసులను అన్ని రంగాలలో అభివృద్ధి పథంలోకి తీసుకువస్తామని ఇచ్చిన హామీ మేరకు భారత రాజ్యాంగంలో ఐదవ, ఆరవ షెడ్యూల్లను రాజ్యాంగ నిర్మాతలు పొందుపరిచారు. రాజ్యాంగంలో ఈ షెడ్యూల్లను ఆదివాసులపై ప్రేమతో కానీ, దయతో కానీ చేర్చారు అనుకుంటే పొరపాటే. నిరంతరం పాలక పక్షాలతో ఆదివాసులు పోరాడి రక్తం చిందించిన ఫలితంగానే అనేది మర్చిపోవద్దు. కానీ అడవిపై ఆధిపత్యాన్ని కొనసాగించడానికి, అటవీ వనరులను, ఖనిజ సంపదను దోచుకోవడానికి కన్నేసిన కార్పొరేటు యంత్రాంగం అభివృద్ధి పేరిట, ప్రాజెక్టుల పేరిట, రోడ్ల నిర్మాణం పేరిట చివరకు అడవిలోని చెట్లను పెంచడం వంటి హరితహారం కార్యక్రమం పేరిట విధ్వంసకర అభివృద్ధికి పాల్పడుతూ ఒకవైపు, అడవిని రక్షిస్తామని, చెట్లను పెంచి పర్యావరణాన్ని పరిరక్షిస్తామని కల్లబొల్లి కబుర్లు చెబుతూ బతకడానికి, తిండికోసం తిండి గింజల కోసం పంటలు పండించడానికి వ్యవసాయం చేస్తున్న భూములను, పంటలను ధ్వంసం చేస్తూ ఆదివాసుల జీవితాలను ఛిద్రం చేస్తున్నాయి. అటవీ హక్కుల చట్టం ప్రకారం కేటాయించిన భూములను పోడు భూముల పేరిట అనేక ఇబ్బందులకు గురిచేస్తూ చిత్రహింసల పాలు చేస్తున్నారు. గత ఏడు సంవత్సరాల నుండి అడవి బిడ్డలకు సాగు చేయడంలో అనేక అవాంతరాలు కల్పిస్తున్నారు.

తెలంగాణ రాష్ట్రంగా ఏర్పడినాక ముఖ్యంగా హరితహారం అమలు పేరిట బుక్కెడు బువ్వ కోసం పంటలు పండించుకోవడానికి ఆదివాసులు అరిగోస పడుతున్నారు. తొలకరి కురిసిన వెంటనే ఆనందంతో రైతులు పనులు ప్రారంభించే సమయం. కానీ ఆదివాసి రైతులు మాత్రం హక్కు పత్రాలు చేతబట్టుకొని అధికారుల చుట్టూ తిరుగుతున్నారు. ప్రతి సంవత్సరం ఖరీఫ్ సీజన్ రాగానే ఆదివాసు గిరిజన రైతులు వ్యవసాయ పనులు ప్రారంభించడానికి పోరాటం చేయాల్సిందే. అవి ప్రభుత్వ అటవీ భూముల అంటూ అధికారులు నానా ఇబ్బందులకు గురి చేయడం, కేసులు పెట్టి జైల్లో నిర్బంధించడం, భౌతిక దాడులు చేయడం అధికమైంది. ఈ క్రమంలో 2014 వరకు పోడు భూముల్లో వ్యవసాయం చేస్తున్న ప్రతి ఒక్కరికి హక్కు పత్రాలు ఇస్తామని అధికారంలోకి రాకముందు పాలక పార్టీ హామీ ఇచ్చింది. కుర్చీ వేసుకుని కూర్చొని పోడు సమస్యలు దగ్గరుండి పరిష్కరిస్తానని గత అసెంబ్లీ ఎన్నికల్లో ముఖ్యమంత్రి గారు రైతులకు హామీ ఇచ్చి ఉన్నారు. అది నెరవేరకపోవడంతో ఏడేళ్లుగా పోడు రైతులు హక్కు పత్రాలు భూ పట్టాల కోసం ఎదురుచూస్తున్నారు.తెలంగాణ రాష్ట్రం బంగారు తెలంగాణగా మారుతుందని, ప్రజలందరూ సుఖ సంతోషాలతో హాయిగా జీవనాన్ని కొనసాగిస్తారని అందుకు ప్రజాసంక్షేమం కోసం అభివృద్ధి కోసం పలురకాల కార్యక్రమాలు పథకాలు అమలు చేస్తున్నామని ప్రచారం చేస్తూ,అందుకు భిన్నంగా ఆకలి తీర్చుకోవడానికి ఎన్నో సంవత్సరాలుగా వ్యవసాయం చేస్తున్న క్రమంలో, అటవీ హక్కుల చట్టం ప్రకారం హక్కు పత్రాలు పొందినప్పటికీ అడవిలో చెట్ల పెంపకం పేరిట వ్యవసాయం చేయనివ్వకుండా ఆదివాసులను అడవుల నుండి తరిమివేయడానికి ప్రభుత్వం ప్రయత్నాలు చేస్తుండటం ద్వంద్వనీతికి నిదర్శనం...

పోడు రైతుల సమస్యల పరిష్కారం కోసం అఖిలపక్షం భారీ

ఆందోళనకు దిగడం, 2021 అక్టోబర్ 5న సడక్ బంద్ నిర్వహించడం చేపట్టి సర్కార్ పై తీవ్ర స్థాయిలో నిరసన తెలిపారు. కొంతమంది ఉద్యమకారులు ఆదివాసు గిరిజన రైతుల తరపున కోర్టులో పిల్ వేశారు. దీంతో రాష్ట్రంలో పోడు భూములపై హైకోర్టు విచారణ చేపట్టింది. వేలాది మంది ఆదివాసులను అడవి నుండి వెళ్లగొట్టడాన్ని సవాల్ చేస్తూ వేసిన పిటిషన్ పై విచారణ జరిపిన హైకోర్టు, అటవీ ప్రాంతాల పై ఆధారపడి బతుకుతున్న గిరిజన ఆవాసాల అంశం రాజ్యాంగంలోని షెడ్యూల్ 5లో ఉన్నాయని, రాష్ట్ర ప్రభుత్వం ఏకపక్షంగా వారిని ఖాళీ చేయించాలని తీసుకున్న నిర్ణయం రాజ్యాంగ విరుద్ధమే కాక ఆర్టికల్ 21 ప్రకారం జీవించే హక్కును కూడా హరించడమే అవుతుందని, గతంలో సుప్రీంకోర్టు వేరువేరు సందర్భాల్లో వెలువరించిన తీర్పులకు విరుద్ధమని భావించి, రాష్ట్ర ప్రభుత్వానికి నోటీసులు జారీ చేయడం గమనార్హం.

### షెడ్యూల్ 5లో ఏముంది?

భారత రాజ్యాంగంలోని పదో భాగంలో గిరిజనులు, గిరిజన ప్రాంతాల గురించి ప్రస్తావించారు. ఈ ప్రాంతాల్లో పాలన, నియంత్రణ గురించి కూడా తెలియజేశారు. రాజ్యాంగంలోని ఆర్టికల్ 244(1) షెడ్యూల్ ప్రాంతాల కొరకు ఉంది. అనగా 244(1) ప్రకారం షెడ్యూల్ ప్రాంతాల్లో ఆదివాసులదే పాలన ఉండాలి .అంటే “మావ నాటే మావ రాజ్ “దానర్థం మా ఊర్లో మా రాజ్యం. ఈ ప్రాంతాల్లో 20 మంది సభ్యులతో గిరిజన సలహా మండలి లేదా పరిషత్ పేరుతో ఆదివాసుల సమగ్ర అభివృద్ధి, సంరక్షణకోసం క్షణక్షణం విద్య, వైద్యం, ఉద్యోగం, వ్యవసాయం, నిరుద్యోగం మొదలైన అంశాలపై ప్రతి మూడు నెలలకు లేదా ఆరు నెలలకు లేదా రాష్ట్రపతి ఎప్పుడు కావాలంటే అప్పుడు రాష్ట్రపతి కార్యాలయానికి ప్రతిపాదనలు పంపుతారు. షెడ్యూల్ ప్రాంతంలో కేవలం ఆదివాసుల పాలన కొనసాగుతోంది. అనగా ప్రభుత్వ యంత్రాంగం ఆదివాసుల చేతుల్లోనే ఉంటుంది. దాని నియంత్రణ కూడా ఆదివాసుల వద్దే ఉంటుంది. షెడ్యూల్ ప్రాంతంలో కేవలం ఆదివాసుల ప్రభుత్వం మాత్రమే ఉంటుంది. అందులో గ్రామం మినీ పార్లమెంట్ అనగా గ్రామ సభ ద్వారా నిర్ణయాలు తీసుకోబడతాయి. చట్టాలు రూపొందుతాయి. ఈ ప్రాంతాల్లో పార్లమెంటు శాసనసభల్లో చేయబడ్డ చట్టాలు చెల్లవు. ఆదివాసులకు స్వయం ప్రతిపత్తిని కల్పించారు. బ్యాంకు లావాదేవీలు, వాటి నియంత్రణ ఆదివాసుల చేతుల్లోనే ఉంటుంది. టీ కొట్టు, పాన్ కొట్టు, బట్టల దుకాణాలు, మొబైల్ ఎలక్ట్రానిక్ షాపులు, కిరాణం జనరల్, బంగారం మొదలైనవి కేవలం ఆదివాసులచే స్థాపించబడాలి. ఇతరులు వ్యాపారం చేయరాదు. ఈ ప్రాంతాల్లో ఆదివాసుల పిల్లలకు ఎటువంటి చదువు కావాలి? ఏ భాషలో కావాలో ఆదివాసులే నిర్ణయిస్తారు. ఈ ప్రాంతంలో ఆదివాసుల అభీష్టం మేరకు వ్యవహరించాలి. ఆదివాసులు ఇష్టానికి వ్యతిరేకంగా కలెక్టర్ అయినా, ప్రధానమంత్రి అయిన పర్యటన చేయడానికి వీలు లేదు. షెడ్యూల్ ప్రాంతాల్లో వివాదాలు కొట్లాటలు గొడవలు, భూ వివాదల కోసం పోలీస్ స్టేషన్లు, కోర్టులకు వెళ్లవలసిన అవసరం లేదు. వీటికి పరిష్కారం సంబంధిత గ్రామాల ఆదివాసులు చూస్తారు. షెడ్యూల్ ప్రాంతంలోని ఆదివాసులు భూమి కింద ఉన్న ఖనిజాలకు యజమానులు. షెడ్యూల్ ప్రాంతంలో ఉన్న నదులు, చెరువులు, అడవులు వాటి సంపదపై సర్వాధికారాలు ఆదివాసులకే ఉంటాయని రాజ్యాంగంలోని ఈ 5వ షెడ్యూల్లో పొందుపరిచారు. ప్రస్తుత పరిస్థితుల్లో ఈ 5వ షెడ్యూల్‌ను రద్దు చేసి ఆదివాసుల హక్కులను కొల్లగొట్టి అడవిలో ఉన్న ఖనిజ సంపదను దోచుకోవాలని ప్రయత్నంలో పలు రకాల అటవీ చట్టాలకు సవరణల పేరుతో వాటిని నిర్వీర్యం చేసే ప్రతిపాదనలు ముందుకు తేవడం ఆదివాసుల అస్తిత్వానికి ప్రమాదకరం.

తరతరాలుగా అటవీ ప్రాంతాలలో నివసించే గిరిజనులు, గిరిజనేతరులకు అడవితల్లి ఆధారం. కానీ అటవీ భూములను వ్యవసాయానికి, నివాసానికి ఉపయోగించడం కూడా నేరంగా పరిగణిస్తున్నారు. ఏండ్ల తరబడి అడవితల్లిని నమ్ముకొని జీవించే వారికి హక్కులు కల్పిస్తూ అటవీ హక్కుల చట్టాన్ని కూడా భారత ప్రభుత్వం రూపొందించింది. పోడు భూములు సొంతమయ్యే అటవీ హక్కుల చట్టం ఏ పరిష్కారాన్ని చూపిస్తుంది? పోడు భూముల సమస్య ఏమిటి? అంటే తరతరాలుగా ఎవరైతే అటవీ భూమిని సాగు చేస్తూ జీవనం గడుపుతున్నారో, ఎవరైతే అటవీ భూముల మీద ఆధారపడి జీవిస్తున్నరో అది నివాసం కొరకు కావచ్చు, వ్యవసాయానికి కావచ్చు, ఇతర అటవీ ఉత్పత్తులను సేకరించి బతుకుతున్నారో వారెవ్వరికి కూడా ఎటువంటి హక్కులు లేవు. కొన్ని లక్షల మంది అటవీ భూములపై ఆధారపడి జీవిస్తున్నారు. వారి కోసం భారత పార్లమెంటు 2006లో ఒక కీలక చట్టంను ఆమోదించింది. దీనినే అటవీ హక్కుల చట్టం అంటారు. దీనిని The Scheduled Tribes and Other tradional Forest Dwellers Recognition of Forest Rights Act 2006 గా చట్టంలో పేర్కొన్నారు. ఈ చట్టం గిరిజన జాతులకు, ఇతరులకు అడవుల పై ఉన్న హక్కులను గుర్తించింది. ఇది 2008లో అమలులోకి వచ్చింది. ఎవరైతే అడవుల మీద ఆధారపడి జీవిస్తున్నారో .. అప్పటికే వారికి ఉన్న హక్కులను గుర్తించడానికి చేసిన చట్టం. ఇది ఒక చారిత్రాత్మకమైన చట్టం. అడవిభూములను సాగు చేసుకోవడం నేరంగా భావించే పరిస్థితి నుండి వారికి ఉన్న హక్కులను గుర్తిస్తామని చేసిన చట్టం..ఏ చట్టంలో లేని విధంగా పీఠికలో ఇప్పటివరకు చరిత్రాత్మకంగా అన్యాయం జరిగిందని, గిరిజనులకు జరిగిన అన్యాయాన్ని తిరగదోడి న్యాయం చేయడం కోసం చట్టం చేస్తున్నామన్న మాట చట్టంలో రాసుకోవడం జరిగింది. అన్యాయం ఏమిటంటే ఎవరికైతే హక్కులు ఉన్నాయో వాటిని గుర్తించకపోవడం, దానిని సరి చేయడానికి తీసుకువచ్చిందే ఈ చట్టం. తెలంగాణలో, ఆంధ్రప్రదేశ్ లో ఫారెస్ట్ రైట్స్ యాక్ట్ అని రికగ్నిషన్ ఆఫ్ ఫారెస్ట్ రైట్స్ యాక్ట్ పేర్లతో పిలుస్తున్నారు. ఈ చట్టం షెడ్యూల్డ్ ప్రాంతంలోనేకాక అటవీ ప్రాంతం ఎక్కడ ఉందో అక్కడ అమల్లోకి వచ్చింది. ఈ చట్టంలో వేటాడడం తప్ప మిగతా అన్ని రకాల హక్కులను గుర్తించారు. భారతదేశ భూభాగం లో 21 శాతం అడవులు ఉన్నాయి. ఎన్నో లక్షలాది కుటుంబాలు దీనిపై ఆధారపడి జీవిస్తున్నాయి. ఈ అటవీ

హక్కుల చట్టం ప్రకారం అటవీ భూముల లో నివాసం ఉండడం, అటవీ భూములను సాగు చేయడం, ఇతర అటవీ ఉత్పత్తుల సేకరణ కొరకు మూడు ముఖ్యమైన కీలకమైన హక్కులను గుర్తించి హక్కు పత్రాలు అందజేస్తారు.

**ఎవరికీ హక్కు పత్రాలు అందజేస్తారు?**

అటవీ హక్కుల చట్టం2006 ప్రకారం 2005, డిసెంబర్ 13 లోపు అటవీ భూములను సాగు చేసుకుంటున్న గిరిజనులకు, అంతకుముందు మూడు తరాలుగా సాగులో ఉన్న గిరిజనేతరులకు హక్కు పత్రాలు అందజేస్తారు. ఒక తరం 25 సంవత్సరాలుగా, మూడు తరాల అంటే 75 సంవత్సరాల క్రితం దాదాపు 1930 నుండి సాగులో ఉన్న గిరిజనేతరులకు మాత్రమే హక్కు పత్రాలు అందజేయాలని చట్టంలో పేర్కొన్నారు.

**హక్కు పత్రాలను పొందడం ఎలా?**

అటవీ హక్కుల చట్టం 2006 ప్రకారం ఏ గ్రామానికి ఆ గ్రామంలో గ్రామ సభను ఏర్పాటు చేసి హక్కుల గుర్తింపు కోసం 10 నుండి 15 మంది సభ్యులతో అటవీ హక్కుల కమిటీ ఏర్పాటు చేయాలి. ఆగ్రామంలో సాగు చేస్తున్న రైతులు ఈ అటవీ హక్కుల కమిటీకి దరఖాస్తు పెట్టుకోవాలి. దరఖాస్తు నమూనా చట్టంలో పొందుపరిచారు. ఈ దరఖాస్తుతోపాటు ఏవైనా రెండు సాక్ష్యాలు జత పరచాలి. ఆ సాక్ష్యాల జాబితా కూడా చట్టంలో ఉంది. గతంలో నమోదైన పోలీస్ కేస్, స్టడీ రిపోర్టు లాంటి రెండు రాతపూర్వక సాక్ష్యాలు అవేవీ లేకుంటే ఆ గ్రామంలోని ఇద్దరు పెద్దల స్టేట్మెంట్లు కూడా దరఖాస్తు వెంట పెట్టవచ్చు. దరఖాస్తు ప్రకారం విచారణ చేపట్టి, అవసరమైతే ఫారెస్ట్ అధికారులు, రెవెన్యూ అధికారులు, ఇతర శాఖల అధికారులను కూడా పిలిపించుకొని విచారణ చేయవచ్చు. ఆ విచారణలో వాస్తవంగా సాగులో ఉంటే వాటికి హక్కు పత్రాలు ఇవ్వాలని గ్రామ సభకు సిఫారస్ చేయవచ్చు లేదంటే పాక్షికంగా ఇవ్వమని, తిరస్కరించమని సిఫారసు చేయవచ్చు. గ్రామ అటవి హక్కుల చట్టం ఇచ్చిన రిపోర్టు ప్రకారం గ్రామ సభ ఒక నిర్ణయం తీసుకుంటుంది. హక్కు పత్రాలు ఇవ్వాలని ఆర్డిఒ స్థాయి అధికారి అధ్యక్షతన గల సబ్ డివిజనల్ కమిటీకి రికమెండ్ చేస్తారు. ఆ సబ్ డివిజనల్ కమిటీ స్క్రూటీని చేసి సరిగ్గా ఉన్నాయని భావిస్తే, జిల్లా కమిటీకి సిఫారసు చేస్తారు. జిల్లా కమిటీ ఆధ్వర్యంలో జిల్లా కలెక్టరు, గిరిజన సంక్షేమ అధికారి, ఏజెన్సీ ఏరియా అయితే ప్రాజెక్ట్ ఆఫీసర్, జిల్లా ఫారెస్ట్ అధికారి తో కూడిన ముగ్గురు సంతకాలతో హక్కు పత్రాలు అందజేస్తారు. గరిష్టంగా 10 ఎకరాలకు మాత్రమే హక్కు పత్రాలు అందజేస్తారు. ఎవరేవరికీ హక్కు పత్రాలు అందజేసిన వివరాలు ఫారెస్ట్ రైట్ రిజిస్టర్లో నమోదు చేస్తారు. దాని కాపీని గ్రామసభకు కూడా పంపుతారు. ఇలా హక్కు పత్రాలు పొందిన భూమిని అన్యాక్రాంతం చేయడం గాని, బదలాయించడం గాని చేయరాదు. హక్కు పత్రాలు భార్యాభర్తల పేరుమీద విడుదల చేస్తారు. వీటిలో వారి పిల్లల పేర్లు కూడా ఉంటాయి. ఈ భూమిని వారసత్వంగా అనుభవించాల్సిందే తప్ప అమ్ముకోవడం, బదలాయించడం చేయరాదు. తెలంగాణలో లక్ష 83 వేల మంది, ఆంధ్రప్రదేశ్లో లక్ష 77 వేల మంది ఈ హక్కు పత్రాల కోసం దరఖాస్తులు పెట్టుకున్నారు. కానీ 50 నుండి 60 శాతం మేరకు తిరస్కరించారు. తిరస్కరించిన వాటికి రాతపూర్వక అభ్యంతరాలు కూడా పొందుపరచలేదు. అన్ని విధాల అర్హతలు ఉన్నా తిరస్కరించడం వల్ల పోడుభూములను సాగు చేసుకుంటున్న అమాయకపు గిరిజన రైతులు అనేక ఇక్కట్ల పాలవుతున్నారు. అటవీ హక్కుల చట్టాన్ని అమలు పరచకుండా కాలయాపన చేస్తున్నారు.

ఆదివాసుల సంక్షేమమే మా ధ్యేయం అంటూ స్థానిక ప్రజా ప్రతినిధులు పోడు భూముల జోలికి రావద్దంటూ ప్రభుత్వ అధికారులను హెచ్చరిస్తూ, ఆదివాసులకు అండగా మేమున్నామంటూ ప్రకటిస్తూ ఉండటం, వారు భాగస్వామిగా ఉన్న ప్రభుత్వం పచ్చదనం, చెట్ల పెంపకం అంటూ సేద్యం చేయకుండా పంట భూములను నాశనం చేయడంతో విధి లేని పరిస్థితులలో జీవన్మరణ సమస్యగా భావించి మహిళా రైతులు, ఆదివాసులు ఎదురు తిరగడంతో అటవీ ప్రాంతాలు యుద్ధ భూమిని తలపిస్తున్నాయి. రాష్ట్రంలో ఒకవైపు పోడు భూములకు హక్కు పత్రాలు ఇస్తామని చెబుతూనే మరోవైపు చేతికొచ్చిన 40 ఎకరాల వరి పొలాలను మహబూబాబాద్ జిల్లా కొత్తగూడ మండలంలో డోజర్ యంత్రంతో ధ్వంసం చేసినట్లు గిరిజన రైతులు ఆవేదన వ్యక్తంచేస్తున్నారు. ఇలాంటి సంఘటనలు కోకొల్లలుగా ఉమ్మడి ఆదిలాబాద్, ఉమ్మడి ఖమ్మం, వరంగల్ జిల్లాలలో పలుచోట్ల పలు రకాలుగా ఆరుగాలం కష్టపడి పండించిన పంటలను నాశనం చేయడం విచారకరం. అడవిని పెంచుతామని ప్రపంచ వేదికలకు వాగ్దానం చేస్తూ మూడు బిలియన్ టన్నుల గా ఉన్నా వార్షిక కర్బన వినియోగాన్ని 2030నాటికి 2.5మిలియన్ టన్నులకు కుదిస్తామని, ఇందుకోసం రానున్న కాలంలో అటవీ విస్తీర్ణాన్ని 33 శాతం పెంచాలని లక్ష్యంగా పెట్టుకుంది. అయితే అందుకు భిన్నంగా భవిష్యత్తు తరాల కోసం అభివృద్ధి పేరిట, పచ్చనిచెట్లను అడవిని నరికి వేస్తామని రాష్ట్రాలు కేంద్రంపై ఒత్తిడి పెంచుతున్నాయి. ఈ నేపథ్యంలో1980లో అటవీ చట్టం 1927కు కొనసాగింపుగా అటవీ పరిరక్షణ చట్టం తీసుకువచ్చారు. దీని ప్రకారం కేంద్ర ప్రభుత్వానికి విశేషాధికారాలు కట్టబెట్టింది. అటవీ భూముల్లో అటవీయేతర కార్యక్రమాలను రాష్ట్రాలు చేపట్టాలంటే కేంద్రం అనుమతిని తప్పనిసరి చేసింది. అమల్లోకి వచ్చిన అటవీ పరిరక్షణ చట్టానికి రెండుసార్లు కీలక సవరణలు జరిగాయి. 1988 లో ఒకసారి 1996 లో రెండవ సారి చట్టాన్ని సవరించారు. తాజాగా ఈ చట్టాన్ని సవరించేందుకు ప్రతిపాదనలు ముందుకు తెచ్చారు.

మౌలిక సదుపాయాల కల్పన పేరిట ప్రాజెక్టు డెవలపర్లు కావలసిన అనుమతుల కోసం కేంద్రాన్ని సంప్రదించాల్సిన అవసరం లేకుండా మినహాయింపులను ఇచ్చే కీలక ప్రతిపాదనను ఈ ముసాయిదాలో చేశారు. కేంద్ర ప్రభుత్వం తీసుకొస్తున్న అటవీ సంరక్షణ చట్టం సవరణలు అటవీ హక్కుల చట్టాన్ని నిర్వీర్యం చేసే విధంగా, గ్రామ సభకు ఉండే అధికారాలను కాలరాసే విధంగా ఉన్నాయని భూమి అధికార్ ఆందోళన్ స్పష్టం చేసింది. ఈ అటవీ సంరక్షణ చట్టం సవరణల ప్రతిపాదనలు గిరిజనుల సాంస్కృతిక, సహజ వారసత్వాన్ని

ప్రభావితం చేసే విధ్వంసక పద్ధతులు, పెసా చట్టం 1996, అటవీ హక్కుల చట్టం 2006 పరిమితం చేస్తున్నారు. వ్యాపార సౌలభ్యం కోసం ప్రభుత్వ ప్రైవేటు రంగానికి చౌకగా అటవీ వనరులను, 42 రకాల ఖనిజసంపదను దోచుకోవడానికి, జీవవైవిధ్యం, జీవావరణ వ్యవస్థ నాశనానికి దారి తీసే విధంగా ఈ ప్రతిపాదనలు ఉండటం ఆశ్చర్యకరం. దేశంలో1.77 లక్షల గ్రామాల్లో గ్రామ రెవెన్యూ రికార్డుల్లో నమోదైన 40 మిలియన్ హెక్టార్ల అటవీ భూమి ఉంది. దాదాపు 200 మిలియన్ల గిరిజనులు ఉన్నారు. పర్యావరణ పరిరక్షణకు, అడవులు, వన్యప్రాణుల జీవ వైవిధ్యానికి ముప్పు వాటిల్లనుంది.

ఒకవైపు గతంలో రాజ్యాంగబద్ధంగా పార్లమెంట్ ఆమోదించిన చట్టాలను విధ్వంసకర అభివృద్ధి నేపథ్యంలో నిర్వీర్యం చేస్తూ.... మరోవైపు పోడు భూముల సమస్య పరిష్కారానికి కార్యాచరణ ప్రకటించడం, అసెంబ్లీలో ఇచ్చిన మాట ప్రకారం రాష్ట్ర వ్యాప్తంగా పోడు భూములకు సంబంధించి దరఖాస్తుల స్వీకరణ ప్రారంభించాలని అధికారులను ఆదేశించారు. పోడు సమస్యతోపాటు అడవుల పరిరక్షణ పై తీసుకోవాల్సిన చర్యల గురించి ఉన్నత స్థాయి అధికారులతో ఓ కమిటీని నియమించింది. పోడు భూముల పరిష్కారానికి నవంబర్ 8 నుంచి డిసెంబర్ 8వ తేదీ వరకు గ్రామాల వారీగా గిరిజనుల, గిరిజనేతరుల నుండి దరఖాస్తులను స్వీకరించడం ప్రారంభం అయింది. వివిధ స్థాయిలో సన్నాహక సమావేశాలు నిర్వహించి అటవీ హక్కుల చట్టం ప్రకారం గ్రామ కమిటీలు ఏర్పాటు చేయాలని, 2,3 గ్రామాలకు ఓ నోడల్ అధికారి నియమించాలని, గ్రామ, సబ్ డివిజన్, ఆర్డీవో జిల్లా స్థాయిలో కమిటీలను ఏర్పాటు చేయాలని ఆదేశాలు ఉండడంతో ఈ ప్రక్రియ ప్రారంభమైంది.

రాష్ట్ర వ్యాప్తంగా 2400 గ్రామాల్లోని అటవీ భూములు ఆక్రమణలకు గురైందని, 87 శాతం పోడు భూముల ఆక్రమణ కొత్తగూడెం, కొమురం భీమ్ ఆసిఫాబాద్, మహబూబాబాద్, ములుగు,అదిలాబాద్, జయశంకర్ భూపాలపల్లి, కామారెడ్డి, ఖమ్మం, నిర్మల్, వరంగల్, నల్గొండ, నిజామాబాద్ వంటి 14 జిల్లాలో ఉ ంది. అటవీ హక్కుల చట్టం 2006 అమలులో భాగంగా 2008లో ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ లో 2.07 లక్షల మంది పోడు రైతుల నుంచి ఐటిడిఎ అధికారులు దరఖాస్తులు స్వీకరించారు.

మరో మూడు నుంచి నాలుగు లక్షల మంది రైతులకు దీనిపై అవగాహన లేక దరఖాస్తుకు దూరమయ్యారు. 2.07 లక్షల దరఖాస్తుల్లో 94,774 మంది రైతులకు3.04 లక్షల ఎకరాల పై హక్కులు ఇచ్చారు. అలాగే ఒక్కో సంఘంలో 10 నుండి15 మంది సభ్యులు ఉండే 721 సంఘాలకు వారి అధీనంలో ఉన్న 4.54లక్షల ఎకరాల పై హక్కు పత్రాలను జారీ చేశారు .మొత్తం దరఖాస్తుల్లో89,956 వివిధ కారణాలతో అనర్హతకు గురయ్యాయి. మరో 21 952 దరఖాస్తులు అపరిష్కృత కేటగిరీలో ఉన్నాయి. ప్రతిష్టాత్మకంగా భారత ప్రభుత్వం తీసుకొచ్చిన అటవీ హక్కుల చట్టం పూర్తిస్థాయిలో అమలు చేయడంలో ప్రభుత్వాలు విఫలం అయ్యాయి. ఫలితంగానే నేడు పోడు సమస్య యుద్ధభేరిని మోగిస్తోంది. గత ప్రభుత్వాల కాలంలో ఎన్నడూ లేని విధంగా ఈ మధ్యకాలంలోనే పోడు భూముల పేరిట నానాయాగీ చేస్తుండటానికి కారణం 2016లో ప్రభుత్వం ప్రారంభించిన హరితహారం కార్యక్రమం. రాష్ట్రంలో అటవీ విస్తీర్ణాన్ని పెంచడానికి కోట్లకొలది మొక్కలు నాటి అడవుల్ని దట్టంగా పెంచుతామని, పోడు భూములలో గిరిజనులు తరాలుగా సేద్యం చేసుకుంటున్న పంటలను పాడు చేసి మొక్కలు నాటే ప్రయత్నం చేస్తుండటంతో, అటవీ భూమిలే జీవన ఆధారమైన ఆదివాసు రైతులు ఒక్కసారిగా సర్వం కోల్పోయి నిరాశ్రయులు అవుతుండడంతో, బతుకు తెరువు కోసం వారి అస్తిత్వాన్ని కాపాడుకోవడానికి అధికారులతో గొడవలు పడుతున్నారు. అనాదిగా అడవిని నమ్ముకున్న ఆదివాసులకు, భూమి మాత్రమే జీవనోపాధి గల అడవి బిడ్డలకు భూ సమస్య పరిష్కరించబడ లేదు. ఎన్నోఏండ్లుగా సాగు చేసుకుని పంటలు పండించుకుంటున్న భూములను హరితహారం పేరిట అడ్డుకోవడం వల్ల అడవుల్లో అలజడి, అశాంతి చెలరేగుతున్నాయి.

పంటలు పండించడం కూడా పచ్చదనాన్ని పెంచడమే. హరితహారం కార్యక్రమాన్ని అడవులు ఉన్న చోట, జాతీయ సగటు విస్తీర్ణం ప్రకారం అడవుల నిష్పత్తి ఎక్కువగా ఉన్న ప్రాంతాలలో మొక్కలు పెంచే కార్యక్రమం చేపట్టడం ఆశ్చర్యకరం. అడవులు లేని బంజరు భూముల్లో, రోడ్లకు ఇరువైపులా, రియల్ ఎస్టేట్ వెంచర్లలో 10 శాతం ప్రతి ఇంట్లో మొక్కలు నాటి అవి పెరిగే వరకు సంరక్షించాలి. కానీ నాటడం వరకే పరిమితం కావడం వల్ల గత ఐదు సంవత్సరాలుగా పెద్దగా విజయవంతం కాలేదు.

పారిశ్రామికీకరణ, పారిశ్రామిక కారిడార్‌లను ఏర్పాటు చేయడం, ఓపెన్ కాస్ట్ లను పెంచడం మూలంగా వేలాది ఎకరాల లో అడవులను నరకడం, ఏక గవాక్ష తీర్మానం ద్వారా విదేశీ పరిశ్రమలను ఆహ్వానించడం, వేలాదిగా పరిశ్రమలు ప్రారంభించడం వల్ల టన్నులకొద్దీ కాలుష్యం పెరగడానికి దోహదపడుతూ ఉంటే హరితహారం కార్యక్రమం పేరిట పచ్చదనం పేరిట ఆదివాసులకు ఒకే ఒక ఉపాధిగా ఉన్నా వ్యవసాయాన్ని వారి జీవితాల నుండి దూరం చేయడం ఆదివాసులకు జీవించే హక్కును కాలరాయడం, ప్రభుత్వ ద్వంద విధానాలకు పరాకాష్ట.

ఈమధ్యకాలంలో ప్రజలు ప్రతిపక్షాలు ఏకమై ఉద్యమాన్ని ఉ ధృతం చేయడంతో పోడు భూముల సమస్యకు శాశ్వత పరిష్కారం చూపిస్తామని, దిశా దశ సమగ్రమైన ప్రణాళిక లేకుండా ప్రచార ఆర్భాటాలు చేస్తూ దరఖాస్తులను ఆహ్వానించడం కంటితుడుపు చర్యగానే భావించవచ్చు. ఆర్ఓఎఫ్ఆర్ చట్టం మేరకు కట్ ఆఫ్ డేటు 2013, డిసెంబర్ 5 కాగా దానిని పెంచుతామని అనడం పేద గిరిజన రైతులకు ఆశ చూపి మోసం చేయడమే అవుతుంది. ఎందుకంటే కట్ ఆఫ్ డేటు మార్చాలంటే పార్లమెంటులో సవరణలు చేయాలి. ఏదో తాత్కాలికంగా తేదీ నిర్ణయించడం వల్ల లీగల్ సమస్యను కొని తేవడమే అవుతుంది. అలాగే పోడు భూముల సమస్య శాశ్వత పరిష్కారం ఏమో గాని గిరిజన, గిరిజనేతరుల మధ్య కూడా అశాంతి చెలరేగడానికి ఆస్కారం ఏర్పడే ప్రమాదముంది. గిరిజనేతరులు కూడా అటవీ భూములపై హక్కులు కావాలని ఉద్యమించడం ప్రారంభమైంది. గత ప్రభుత్వాల వలె ఉన్నది ఉన్నట్లుగా ఆదివాసి గిరిజనులను సజావుగా

# మాదక ద్రవ్యాల వినియోగం-ఆర్యన్ ఖాన్

*మారక ద్రవ్యాలు అనగానే ప్రముఖులు, సెలబ్రిటీలు, వారి పిల్లలు తెరమీదికి రావడం, నామ మాత్రపు విచారణ జరగడం, చివరికి తుస్సుమనడం ఇదంతా మార్కెట్ శక్తుల పనే నని అంటున్నారు* **పబ్బతి వెంకటేశ్వర్లు**

మద్యపానం, ధూమపానం ఆరోగ్యానికి హానికరం అని ఎన్నో ఏళ్లుగా వల్లే వేస్తున్న నీతి సూత్రాలు నీటి మీది రాతలుగా మిగిలిపోగా దానికితోడూ మాదక ద్రవ్యాలు(డ్రగ్స్) సేవించడం ఖరీదైన అలవాటుగా మారింది. ఈ డ్రగ్స్ సేవించడం అనేది ఆర్థిక, రాజకీయ సినీ వ్యాపారవేత్తల కుటుంబాల్లో, సెలబ్రిటీస్ కుటుంబాల్లో సాధారణంగా మారిపోయింది. వారిని ఆదర్శంగా తీసుకుంటున్న దిగువ, మధ్యతరగతి కుటుంబాల పిల్లలు సైతం అటు వైపు మొగ్గుతున్నారు. మత్తులో చిత్తవుతున్నారు. తల్లిదండ్రులకు క్షోభని మిగులుస్తున్నారు.

ఇటీవలి కాలంలో అనేక విధాలుగా అనేక చోట్ల మాదకద్రవ్యాల క్రయ విక్రయాలు, వినియోగాల నేపథ్యంలో డ్రగ్స్ కేసులు నమోదవుతున్నాయి. ఈ నేపథ్యంలో నమోదైన ఆర్యన్ ఖాన్ డ్రగ్స్ కేసు వ్యవహారం దేశ ప్రజలందరినీ ఆకర్షించింది. ఇలా సెలెబ్రిటీల, రాజకీయ నాయకుల సంతానంపై డ్రగ్స్ కేసుల ఆరోపణలు రావడం అవి ఉన్నత స్థాయి ప్రభావంతో నీరుగారి పోవడం జరుగుతుంది. అలాగే తెలిపోతుందనుకున్న ఆర్యన్ ఖాన్ డ్రగ్స్ కేసు పీటముడిగా మారటంతో దాని పూర్వపరాల పట్ల ఆసక్తి నెలకొంది. ఈ కేసు వెనక నిజానిజాలు దాని వెనుక భారీ ఎత్తున సాగుతున్న మాదక ద్రవ్యాల విక్రయ వినోద కేంద్రాల బాగోతం గురించి చర్చించుకోవలసిన అవసరం ఉంది. దేశంలో డ్రగ్స్ పార్టీల సంస్కృతి చాపకింద నీరులా పాకుతోంది. ప్రతి చిన్న పట్టణాల్లో కూడా వివిధ రకాల పేర్లతో క్యాబరే పార్టీలు, మందు, విందు, రేవ్ పార్టీలు అశ్లీల నృత్యాలతో సాగుతున్నాయి. ఈ పార్టీలో పాల్గొన్న వారంతా దాదాపు ఎగువ తరగతి పిల్లలే ఎక్కువ. ఇది సహజంగానే బలహీన మనస్తత్వం కలిగిన ఎంజాయ్ చేయడమే జీవితం అని భావించే కొంత మంది మధ్య తరగతి స్థాయి పిల్లలు ఆకర్షితులవ్వటం బాధాకరం. ఈ పార్టీలలో పాల్గొనే వారు సినీ హీరోలు, హీరోయిన్లు, రాజకీయ నాయకులు, సెలబ్రిటీస్, వారి పిల్లలు పాల్గొనడాన్ని చాలా గొప్ప విషయంగా చెప్పుకోవడం ఈ విశృంఖల విష సంస్కృతికి దారి

---

వారి పనిని చేసుకొనిస్తే, వారిని కూడా రైతులు గా గుర్తించి పథకాలు అమలు చేస్తే ఈ అలజడి చెలరేగేది కాదు.

**ముగింపు:**

దేశానికి స్వాతంత్రం వచ్చి 75 సంవత్సరాలు పూర్తి అవుతున్నప్పటికీ ఆదివాసులు అభివృద్ధికి నోచుకోలేదు. అభివృద్ధి అంటే అంకెల గారడీ మాత్రమే కాదు, ప్రజలు మెరుగైన జీవితాన్ని అనుభవించడమే.వారి అభివృద్ధి కోసం సంక్షేమం కోసం చేసిన చట్టాలు, పథకాలు ఏవీ కూడా పూర్తిస్థాయిలో అమలు చేయడం లేదు. మానవ మనుగడకు కావలసిన కనీస మౌలిక వసతుల కల్పనకు కూడా గిరిజన ప్రాంతాలలో కల్పించకపోవడం విచారకరం.

విద్య, వైద్యం, రవాణా విషయంలో అనేక ఇక్కట్లను ఎదుర్కొంటున్నారు. అటవి సంపదపై కన్నేసిన కార్పొరేటు పెత్తందార్లు, ప్రభుత్వాలతో చేతులు కలిపి ఆదివాసుల మనుగడకు ఎన్నో అవాంతరాలు అడ్డంకులు కల్పిస్తూ అడవిని, వారి జీవితాలను చిన్నాభిన్నం చేయాలని ప్రయత్నాలు కొనసాగుతుండడం అమానుషం. 2008లో అమలులోకి వచ్చిన అటవీ హక్కుల చట్టాన్ని న్యాయంగా చిత్తశుద్ధితో అమలు పరచకుండా నిర్లక్ష్యం చేసి, ఎన్నికల వాగ్దానాలు చేసి వాటిని మరచి కొత్త సమస్యలు అవాంతరాలు కల్పించడం పాలకులకు పరిపాటి అయిపోయింది. ప్రకృతితో ముడిపడిన వారి జీవితాలను ప్రకృతి నుండి అభివృద్ధి పేరిట దూరం చేస్తూ వారి ఆచార సాంప్రదాయ వ్యవహారాలను తుంగలో తొక్కి వారి అస్తిత్వానికి ఎసరు తెస్తుండటం ప్రజాస్వామిక మూల సూత్రాలకు వ్యతిరేకం కాదా? సాటి మానవునిగా గుర్తించి వారికి సంబంధించిన చట్టాలను పటిష్టంగా అమలు చేయకపోవడం అమానుషం. సమాన అవకాశాలు కల్పించి అభివృద్ధి పథంలోకి తీసుకు రావాల్సిన తరుణంలో వివక్షతో కూడిన వైఖరిని అవలంబించడం రాజ్యాంగ విరుద్ధమే. ప్రభుత్వాలు ఓటు బ్యాంకు రాజకీయాల కోసం రాజ్యాంగ విరుద్ధంగా వ్యవహరించడంతో దేశ వ్యాప్తంగా ఆదివాసుల హక్కుల పై క్రమంగా నీలినీడలు అలుముకున్నాయి.

వాస్తవానికి అడవిని ప్రేమించి అడవిని కన్న తల్లిగా భావించి కాపాడుకుంటున్న ఆదివాసి రైతుల సమస్యను పూర్తిస్థాయిలో శాశ్వత పరిష్కారం లభించడం కోసం ప్రభుత్వం చిత్తశుద్ధితో అటవి హక్కుల చట్టం 2006ను యథావిధిగా అమలు చేయాల్సిన అవసరం ఉంది. అమలు చేయించుకోవాల్సిన అవసరం ఆదివాసులకు ఉంది. ఆదివాసుల హక్కులను కాలరాస్తూ వారి సంస్కృతిని మనుగడని ప్రమాదంలోకి నెట్టి వేస్తున్న తరుణంలో వాటిని నిలబెట్టుకోవడానికి ఆదివాసులు ఐక్యంగా సంఘటితమై ఉద్యమించాల్సిన అవసరం ఉంది. పౌర సమాజం, మేధావులు, ప్రజాస్వామిక వాదులు, రాజకీయ పార్టీలు రాజ్యాంగపరమైన హక్కులను ఆదివాసులకు అందించడం కోసం వెన్నుదన్నుగా నిలవాల్సిన అవసరం ఉంది. వారి అస్తిత్వాన్ని కాపాడడం కోసం సహకారం అందించాలి.

*(రచయిత టిపిటిఎఫ్ జిల్లా ఉపాధ్యక్షుడు, మహబూబాబాద్)* వీ

తీస్తుంది. దానికి నిదర్శనమే ఆర్యన్ ఖాన్ డ్రగ్స్ కేసు, ముంద్రా డ్రగ్స్ కేసు. నూతన సంవత్సర, వారాంతపు, ప్రత్యేక సందర్భాల వేడుకల్లో మాదక ద్రవ్యాలతో కూడిన పార్టీల నిర్వాహణకు అనేక సంస్థలు క్లబ్బులు పుట్టుకొచ్చాయి. ఇవి పార్టీలను హై ప్రొఫైల్లో ఏర్పాటు చేయడం, డ్రగ్స్, మందు, అశ్లీల నృత్యాలతో ఆకర్షించడం మొదలు పెట్టాయి. ఈ సంస్కృతికీ దేశంలోని చిన్న పెద్ద పట్టణాలతో పాటు దేశంలోని ప్రధాన నగరాలైన ముంబై,హైదరాబాద్ ఢిల్లీ వంటి నగరాల్లో విస్తరిస్తూ వస్తుంది. ఈ నేపథ్యంలో నమోదైన ఆర్యన్ ఖాన్ డ్రగ్స్ కేసు దీని వెనక ఉన్న, పాటు క్రూయిజ్ ఓడ యాజమాన్యం, నామ్స్ క్రే అనే ఈవెంట్ సంస్థలకు గల సంబంధం గురించి చర్చించుకోవలసి ఉంది.

క్రూయిజ్ ఓడ, ప్రయాణికులను ముంబై నుండి గోవా, లక్షద్వీప్ లకు టూర్లను ఏర్పాటు చేసి అందులో విందులు వినోదాలు ఏర్పాటు చేస్తుంది. ఈ ఓడ చాలా విలాసవంతమైనది. ఖరీదైనది. సముద్రంలో ప్రయాణిస్తూ ఎంజాయ్ చేయాలి అనుకునే ప్రయాణికులు దీన్ని ఎంచుకుంటారు. ఈ షిప్‌కు "ది ఎంప్రెస్" అని పేరు.దీనిని ఒక ప్రైవేటు పార్టీ కోసం ఢిల్లీకి చెందిన ఈవెంట్ లను నిర్వహించే నామ్స్ క్రేకి మూడు రోజుల కోసం అద్దెకి ఇవ్వడం జరిగింది. అయితే అక్కడ జరిగిన డ్రగ్స్‌కు, రేవ్ పార్టీకీ క్రూయిజ్ మేనేజ్‌మెంట్ సంస్థ "వాటర్ వేస్ లీజర్ టూరిజం ప్రైవేటు లిమిటెడ్ కంపెనీకి" ఎలాంటి సంబంధం లేదని నౌక నిర్వాహక అధికారి, సంస్థ ప్రెసిడెంట్ జర్గేన్ బైలం తెలిపారు. ఈ విషయం విచారణలో తెలియాల్సి ఉంది. ఇలాంటి పార్టీలు ముంబై సముద్రపు ఒడ్డున నిత్యకృత్యాలు. ఈ షిప్‌లో దాదాపు 1800 మంది ప్రయాణికులతో పాటు సిబ్బంది 600 మంది ఉంటారు.

నామ్స్ క్రే అనే ఈవెంట్ సంస్థ ఢిల్లీ కేంద్రంగా 'కెన్ ఫ్లస్ ట్రేడింగ్ ప్రైవేట్ లిమిటెడ్' పేరుతో 30 అక్టోబర్ 2020 న రిజిస్టర్ అయింది. ఇది అనేక ఈవెంట్స్ నిర్వహిస్తూ ఉంటుంది. ఇది కార్డీలియా క్రూయిసెస్ ఓడతో అక్టోబర్ 2నుండి అక్టోబర్ 4 మధ్య ఈవెంట్ నిర్వహించడానికి ఒప్పందం కుదుర్చుకుంది. దీనికిగాను టికెట్లు అమ్మటం, గెస్ట్‌ల లిస్టులు తయారు చేయడం, సెలబ్రిటీస్‌ను ఆహ్వానించటం ఎఫ్ టివి ఇండియా సహకారంతో మ్యూజికల్ ప్రోగ్రామ్స్ నిర్వహించటం దీని బాధ్యత. ఇక్కడ జరిగే ఈవెంట్‌లో పాల్గొనాలి అనుకున్న వాళ్లు చాలామంది పోటీపడి మరీ టిక్కెట్లు కొనుక్కున్నారు. దీనిలో బాలివుడ్ ప్రముఖుడు షారూక్ ఖాన్ కొడుకు ఆర్యన్ ఖాన్, సెలబ్రిటీలు పాల్గొంటున్నారని ప్రచారం జరిగింది. ఈ ఈవెంట్‌లో డ్రగ్స్ సప్లై కూడా ఉంటుంది అని తెలియడంతో టికెట్లకు గిరాకి బాగా ఏర్పడింది. ఈ విషయం ముంబై పోలీసులకు ఎన్సీబి (మాదకద్రవ్యాల నిరోధక సంస్థ)కు 15 రోజుల ముందుగానే తెలిసింది. వారు నార్కోటిక్స్ కంట్రోల్ బోర్డు జోనల్ డైరెక్టర్ సమీర్ వాంఖడే నేతృత్వంలో 20 మంది పోలీసులు సాధారణ ప్రయాణికులుగా టికెట్లు కొనుక్కుని ఓడలోకి ప్రవేశించారు. సమీర్ వాంఖడే చాలా నిఖార్సైన సమర్థవంతమైన అధికారిగా పేరున్నది. 2004 బ్యాచ్‌కి చెందిన రెవెన్యూ సర్వీసుల అధికారి. పన్ను ఎగవేతదారుల నుండి ముఖ్యంగా సినీ రాజకీయ ప్రముఖులనుండి కోట్లకొద్దీ పన్ను వసూలు చేసాడు. చాలా ధైర్యవంతుడు భయం లేనటువంటి వ్యక్తి. కస్టమ్స్ అధికారిగా ఉన్నప్పుడు కూడా ఎవరినీ లెక్క చేయకుండా ఆఖరికీ వరల్డ్ కప్ గెలిచిన క్రికెట్ టీం యొక్క వరల్డ్ కప్‌కు బంగారు తాపడం ఉ ండటంతో దానికి కూడా పన్ను కడితే తప్ప వదలనటువంటి వ్యక్తి ఆయన. అలాంటి అధికారి చేతికి ఆర్యన్ ఖాన్ కేసు చిక్కడమే దేశ వ్యాప్తంగా మరొక మారు మాదక ద్రవ్యాల కేసు మారిమోగింది.

నార్కోటిక్స్ కంట్రోల్ బ్యూరో జోనల్ డైరెక్టర్ సమీర్ వాంఖడే నేతృత్వంలో క్రూయిజ్ షిప్ రేవ్ పార్టీ పైన దాడి జరిగింది. మత్తు మందులు వాడుతున్నారని బాలీవుడ్ బాద్ షా షారుఖ్ ఖాన్ కొడుకు ఆర్యన్ ఖాన్‌తో పాటు మరొక ఏడుగురిని అదుపులోకి తీసుకున్నారు. వారి వద్దనుండి నిషేధిత మాదకద్రవ్యాలను స్వాధీనం చేసుకున్నారు. నిషేధిత మాదక ద్రవ్యాలను కలిగి ఉన్నందుకు గాను నార్కోటిక్ డ్రగ్స్ అండ్ సైకోట్రోపిక్ సబ్ స్టాన్సెస్ (ఎండిపిఎస్)చట్టం కింద వారిపై కేసు నమోదు చేసారు. వీరి దగ్గరనుండి 13 గ్రాముల కొకైన్, 22 గ్రాములు ఎండిఎంఎ పిల్స్, 21 గ్రాముల చరస్, 5 గ్రాముల మేఫ్రేడ్రోన్(ఎండి), స్వాధీనం చేసుకున్నట్లు ఎన్సీబి అధికారులు చెప్పారు. అక్టోబర్ 3న వారిని అరెస్టు చేసి ఎఫ్ఐఆర్ నమోదు చేసినట్టు అధికారికంగా ప్రకటించారు. అరెస్టు చేసిన వారిని కోర్టుకు అప్పగించటం, కోర్టును తిరిగి అధికారులు తమ కస్టడీకి ఇవ్వాలని కోరటంతో ఎన్‌సిబి కస్టడీకి ఇచ్చింది. ఆర్యన్ ఖాన్‌కు విదేశాల్లోని పెడ్లర్స్‌తో సంబంధాలు ఉన్నాయని అతని వాట్సాప్ చాట్ చెప్తుందని డ్రగ్స్ వాడుతూ దొరికాడని, వీరిలో ఎవ్వరూ తమ సప్లయర్స్ గురించి చెప్పడం లేదని ఆరోపించారు. ఈ పార్టీలో మహిళల నాప్కిన్ పాడ్స్ లలో, మెడిసిన్ బాక్స్‌లలో మాదకద్రవ్యాలు దాయటాన్నిబట్టి చూస్తే చాలా ముందస్తు ప్రణాళికతో డ్రగ్స్ తీసుకువచ్చారని అర్థమవుతుంది. ఆర్యన్ ఖాన్‌కు చెందిన లెన్స్ బాక్స్‌లో కూడా మాదకద్రవ్యాలు దొరికినట్టు పోలీసులు చెబుతున్నారు. అరెస్టు అయిన వారిలో ఆర్యన్ ఖాన్, మున్మున్ దవేచా, నుపూర్ సారిక, ఇస్మీత్ సింగ్, మొహాక్ జశ్వాల్, విక్రాంత్ చోకేర్, గోమిట్ చోప్రా, అర్బాజ్ మర్చంట్ ఉన్నారు. వీరితో పాటు నౌకకు సంబంధిన నిర్వాహకులను, ఈవెంట్ నిర్వాహకులను మొత్తం 16 మందిని ఈ కేసులో అరెస్టు చేయడం జరిగింది. ఆర్యన్ ఖాన్‌పై నార్కోటిక్ డ్రగ్స్ అండ్ సైకోట్రోపిక్ సబ్‌స్టాన్సెస్ (ఎన్‌డిపిఎస్) చట్టంలోని నాలుగు సెక్షన్‌ల కింద అభియోగాలు మోపారు. 1. సెక్షన్ 8(సి) 2. సెక్షన్ 20(బి) 3. సెక్షన్ 27 4. సెక్షన్ 35ల కింద కేసు నమోదు చేసారు. ఆర్యన్ ఖాన్‌ను ఎన్‌సిబి కార్యాలయం నుండి ఆర్థర్ రోడ్ జైలుకు తరలించారు. 26 రోజులు జైలు గోడల మధ్య గడపాల్సి వచ్చింది.

ఆర్యన్ ఖాన్, నవంబర్ 13, 1997న జన్మించాడు, బాలీవుడ్ నటుడు షారూఖ్ ఖాన్, ఇంటీరియర్ డిజైనర్ గౌరీ ఖాన్‌లకు పెద్ద సంతానం. ఆర్యన్ ఖాన్ యునైటెడ్ స్టేట్స్‌లోని యూనివర్సిటీ ఆఫ్ సదరన్ కాలిఫోర్నియాలోని స్కూల్ ఆఫ్ సినిమాటిక్ ఆర్ట్స్‌నుండి ఫైన్ ఆర్ట్స్, సినిమాటిక్ ఆర్ట్స్, టెలివిజన్ ప్రొడక్షన్‌లో బ్యాచిలర్ డిగ్రీని పొందాడు. అతను యునైటెడ్ కింగ్‌డమ్, ముంబైలో తన పాఠశాల విద్యను అభ్యసించాడు. తైక్వాండోలో బ్లాక్ బెల్ట్. అలాగే ఒకటి రెండు సినిమాలలో బాల షారుక్ ఖాన్‌గా నటించాడు. ఆర్యన్ ఖాన్‌కు ఇద్దరుతోబుట్టువులు ఉన్నారు, సోదరి సుహానా, సోదరుడు అబ్రామ్. ఇతనికి దాదాపు 14 లక్షల మంది ఇన్ స్టాగ్రంలో ఫోలోవర్స్ ఉన్నారు.

దేశంలో ఎక్కడ ఏం జరిగినా, పెద్దగా స్పందించని రాజకీయ నాయకులు సెలబ్రిటీలు అక్టోబరు 3న ఆర్యన్ ఖాన్ అరెస్టు తర్వాత

వెంటనే ప్రతిస్పందించడం విస్మయం కలిగించింది. దీనికితోడు మీడియా కూడా సానుభూతి వ్యక్తం చేయడం విచిత్రంగా ఉంది. మరి వీరికి సుశాంత్ సింగ్ వ్యవహారంలో స్పందించడానికి మనసు రాలేని సినీ ప్రముఖులంతా పోటీలు పడి మరీ వారికి అండగా ఉంటామని ప్రకటనలు ఇచ్చారు. ఇవాళ బాలీవుడ్ అంతా డ్రగ్స్‌తో, వ్యసనాలతో, అశ్లీల వ్యవహారాలతో నిండిపోయింది. సమాజం పట్ల బాధ్యత కలిగిన సినీ నటులు కనపడరు. వీరు బాధ్యతారహితంగా జింకలని చంపడం, పేవ్ మెంట్ల మీద మనుషుల పైకి కారు ఎక్కించడం, అండర్ వరల్డ్ గ్యాంగులతో సంబంధాలు కలిగి ఉండటం చూస్తున్నాం. ఒక రకంగా చెప్పాలంటే సినీరంగంలోని చాలామంది వారు దారి తప్పడమే కాకుండా, వారిని ఆదర్శంగా తీసుకుంటున్న యువతను పాడు చేస్తున్నారు.

ఈ కేసులో రాజకీయ విమర్శలు కూడా చోటుచేసుకుంటున్నాయి. దేశానికి నాయకత్వం వహిస్తున్న ప్రధాని, హోం మంత్రుల సొంత రాష్ట్రం గుజరాత్‌లో, వారికి అత్యంత ఆప్తులు అయినటువంటి ఆదాని యొక్క ముంద్రా పోర్టులో దొరికిన రు. 21000 కోట్ల విలువైన 2988 కిలోల హెరాయిన్ కేసును దారి మళ్లించడానికే ఈ డ్రగ్స్ కేసని కాంగ్రెస్ పార్టీ విమర్శించింది. నిషేధిత మాదక ద్రవ్యాలను వినియోగిస్తున్న వారిని కఠినంగా శిక్షించాలని కేంద్ర మంత్రి రాందాస్ అథవాలే డిమాండ్ చేసారు. మరో వైపు మహారాష్ట్ర మంత్రి నవాబ్ మాలిక్ రంగంలోకి దిగి బిజెపి "మహారాష్ట్ర ప్రభుత్వం, బాలీవుడ్ పరువును తీయడానికి" కేంద్రం ఏజెన్సీలను ఉపయోగిస్తోందని ఆరోపించారు. అలాగే ఇది కుట్ర కేసని, కిడ్నాప్ వ్యవహారమని అది బెడిసికొట్టడంతో డ్రగ్స్ కేసుగా మార్చారని విమర్శించారు. ఆర్యన్ ఖాన్‌ను కిడ్నాప్ చేసి షారూక్ ఖాన్ నుండి పెద్ద మొత్తంలో డబ్బులు వసూలు చేయాలన్నది పథకమని, అందుకే ఆర్యన్ ఖాన్‌ను ఓడ దగ్గరికి రప్పించి కిడ్నాప్ చేశారని, షారూక్ ఖాన్‌ను 25 కోట్లు డిమాండ్ చేసి, 18 కోట్లకు ఒప్పందం కుదుర్చుకొని, 50 లక్షలు అడ్వాన్సుగా తీసుకున్నారని ఆరోపించారు. అయితే ప్లాన్ బెడిసి కొట్టడంతో దానిని డ్రగ్స్ కేసుగా మార్చారని దీనికి సూత్రధారి బిజెపి నాయకుడు మోహిత కాలబోత్‌తో బాటు, ఎన్‌సిబి డైరెక్టర్ సమీర్ వాంఖడే కూడా కుట్రలో భాగస్వామి అని తీవ్ర విమర్శలు చేశాడు. దీనికి ప్రతిగా షారూక్ ఖాన్‌నుండి డబ్బులు లాగడానికి మంత్రి ప్రయత్నిస్తున్నాడని మోహిత కాలబోత్ ప్రతివిమర్శ చేసాడు. అందరూ కలిసి డ్రగ్స్ వ్యవహారం రాజకీయ వ్యవహారంగా మార్చడానికి ప్రయత్నిస్తున్నట్టు కనిపిస్తున్నది.. ఈ క్రమంలో ఆరోపణలు ఎదుర్కొంటున్న సమీర్ వాంఖడేను ఈ కేసునుండి తప్పిస్తున్నట్లు, 'ముంబై డ్రగ్స్ కేసు విచారణను ఎన్‌సిబి ఢిల్లీ విభాగానికి చెందిన సిట్‌కు బదిలీ చేసినట్లు ఎన్‌సిబి డిడిజి జ్ఞానేశ్వర్ సింగ్ తెలిపారు. ప్రస్తుతం వాంఖడే నేతృత్వంలోని ఎన్‌సిబి ముంబయి జోన్ ఆర్యన్ ఖాన్ కేసును విచారిస్తుండగా ఇకపై ఎన్‌సిబి సెంట్రల్ యూనిట్ దర్యాప్తు చేపట్టనుంది. ఆర్యన్‌ఖాన్ కేసు సహా మొత్తం ఐదు కేసులను సెంట్రల్ యూనిట్‌కు బదలాయించారు. ఈ కేసులను ఎన్‌సిబి అధికారి సంజయ్ సింగ్ విచారించనున్నారు.

ఆర్యన్ ఖాన్ అరెస్ట్ కాగానే దేశంలో అత్యంత ఖరీదైన లాయర్లు సీనియర్ న్యాయవాదులైన ముకుల్ రోహత్గీ, (మాజీ అటార్నీ జనరల్) సతీష్ మానేషిండే, అమిత్ దేశాయ్‌లతో కూడిన ఆర్యన్ ఖాన్ న్యాయవాద బృందం అతన్ని బెయిల్‌పై విడుదల చేయాలని శతవిధాల ప్రయత్నించింది. ఎన్‌సిబి తరపున అడిషనల్ సొలిసిటర్ జనరల్ అనిల్ సింగ్ అతని బెయిల్ పిటిషన్‌ను వ్యతిరేకించింది. బెయిల్‌కు అనుకూలంగా ఆర్యన్ ఖాన్ లాయర్ల ప్రధాన వాదనలు ఏమిటంటే అతడినుంచి ఎలాంటి డ్రగ్స్ లభించలేదని, ఆరోపించిన వాట్సాప్ చాట్‌లు ప్రస్తుత కేసుకు సంబంధం లేదని, అతనికి పూర్వ నేర చరిత్ర లేదని, డ్రగ్స్ కొనడానికి అతని దగ్గర డబ్బులు లేవని, చిన్న పిల్ల వాడని, ఏడస్తున్నాడని, విదేశీ పెద్దల్లతో సంబంధాలు లేవనీ, విదేశాలకు పారిపోయే అవకాశం లేదనీ బెయిల్ ఇవ్వాలని వాదించింది. బెయిల్ కోసం కోర్టులో మూడు సార్లు దరఖాస్తు చేయడం జరిగింది. ఈ మూడు సార్లు కూడా బెయిల్ రాకుండా మాదకద్రవ్యాల నిరోధక సంస్థ అడ్డుకున్నది. ఆర్యన్ ఖాన్ బెయిల్‌ను వ్యతిరేకిస్తూ అనిల్ సింగ్ చేసిన వాదనలు ఈ విధంగా ఉన్నాయి. దేశం మొత్తం నిషేధిత మాదకద్రవ్యాల వాడకం గురించి ఆందోళన చెందుతోంది. ఇది కేవలం ఒక వ్యక్తికి సంబంధించిన విషయం కాదు. డ్రగ్స్ దందాను నడిపిస్తున్న ముఠాను పట్టుకునేందుకు ఎన్‌సిబి పనిచేస్తోంది. ఈ కేసులో నిందితులను విడుదల చేస్తే దర్యాప్తు కుంటుపడే అవకాశముందనీ ఆర్యన్ స్నేహితుడు అర్బాజ్ మర్చంట్ నుండి స్వాధీనం చేసుకున్న డ్రగ్స్ (ఆరు గ్రాముల చరస్‌లు) వారిద్దరి కోసమనీ, వాట్సాప్ చాట్‌లు 'అంతర్జాతీయ మాదకద్రవ్యాల అక్రమ రవాణా'ను సూచిస్తున్నాయనీ, ఆర్యన్ ఖాన్ కుట్రలో పాల్గొన్నాడు. కాబట్టి రికవరీ చేసిన డ్రగ్స్ మొత్తం ఎంత అనేది అప్రధానమనీ, అతను నిత్యం నిషిద్ధ వస్తువులు వాడేవాడనీ, నిందితులని విడుదల చేస్తే విచారణకు ఆటంకం కలుగుతుందని బెయిల్ ఇవ్వవద్దని వాదించింది. విదేశీయు డొకరితో హార్డ్ డ్రగ్స్ గురించి ఆర్యన్ ఖాన్ చాట్ చేసినట్టు ఎన్‌సిబి గుర్తించింది. ఆర్యన్ ఖాన్ విదేశాల్లో చదువుతున్నప్పటినుండే దాదాపు ఆరేళ్లనుండి డ్రగ్స్ అలవాటు ఉన్నదని, అతని స్నేహితుల వద్ద డ్రగ్స్ దొరికాయని, బెయిల్ ఇస్తే సాక్ష్యాలు మాయం చేస్తాడని, సప్లయర్స్ గురించి చెప్పటం లేదని కాబట్టి బెయిల్ ఇవ్వవద్దని వాదించింది. సెషన్స్ కోర్టు మూడు సార్లు బెయిల్ నిరాకరించడంతో నాలుగోసారి హైకోర్టులో బెయిల్ కోసం దరఖాస్తు చేస్తే అక్టోబరు 28న ఆర్యన్ ఖాన్‌తో పాటు మరో ఇద్దరికి బెయిల్ మంజూరు చేసింది.

దేశంలో ఈ రకమైన విష సంస్కృతి రాజకీయ నాయకులు, సినీ ప్రముఖులు, వ్యాపారవేత్తల మూలంగా పెరుగుతున్నది. పిల్లల్ని అదుపు ఆజ్ఞలలో ఉంచకుండా, వారు విచ్చలవిడిగా జల్సాలు చేస్తుంటే అది తమ స్టేటస్‌గా భావిస్తున్నారు. పిల్లలు ఆయాచితంగా వస్తున్న డబ్బు వల్ల మితిమీరిన దురలవాట్లకు బానిసలవుతూ డ్రగ్స్, రేవ్ పార్టీలు, రేసులు, సెక్స్ ఒకటేమిటి అన్ని రకాల అవలక్షణాలు అలవర్చుకుంటున్నారు. ఫర్దీన్ ఖాన్, మమతా కులకర్ణి, సుశాంత్ రాజ్‌పుత్, రియా చక్రవర్తి మొదలైన వారి తర్వాత ఇప్పుడు షారూఖ్ ఖాన్ కుమారుడు ఆర్యన్ ఖాన్ వంతు వచ్చింది. ఇవాళ వేల కోట్ల అధిపతి, బాలీవుడ్ బాద్షా షారూక్ ఖాన్ తన కొడుకు పరిస్థితి చూసి చలువ కళ్లద్దాల మాటున కన్నీరు కార్చి లాభం లేదు. వగచి వగచి ఏడ్చి తిండి మానేసి దేవుళ్లకి పొర్లు దండాలు పెట్టి ఏడవటం వల్ల ఉపయోగం లేదు. తను ఆశించినట్లు పెరుగుతున్నందుకు సంతోషపడాలేమో, ఎందుకంటే 20 సంవత్సరాల క్రితం షారుక్ ఖాన్ ఒక ఇంటర్వ్యూలో తాను పరిస్థితులు అనుకూలించక ఎంజాయ్ చేయలేక పోయానని, "తన కొడుకు అమ్మాయిలతో డేటింగ్

చేయవచ్చు, సిగరెట్ తాగవచ్చు, సెక్స్, డ్రగ్స్‌ను ఆస్వాదించవచ్చు" అని కామెంట్ చేసాడు. దీన్నిబట్టి అతని పెంపకం ఏ విధంగా ఉందో అర్థం చేసుకోవచ్చు. ఏ తండ్రి ఇలాంటి పద్ధతిలో ఎదగటం సహించడు. పుత్రోత్సాహం పదిమంది తన కొడుకు గురించి పొగుడుతుంటే వచ్చేది. అంతేగానీ తాగి బండి, కారు నడపడం మాదక ద్రవ్యాలు సేవించడం ద్వారా రాదు. ఇలాంటి సంఘటనలు సెలబ్రిటీ కుటుంబాల్లోనే ఎక్కువగా జరుగుతున్నవి. కోట్లలో విలువైన కార్లు, బైక్‌లు నడుపుతూ ప్రాణాలు పోగొట్టుకుంటూ తల్లిదండ్రులకు గుండె కోత మిగిలిస్తున్నారు. ఇవన్నీ విశృంఖల స్వేచ్ఛకు జన్మించిన లక్షణాలు. వీటిని మొక్కగా ఉన్నప్పుడే తుంచాలి. పిల్లలలో ఈ రకమైన దురలవాట్లు రావడానికి కారణం భారతదేశంలో విచ్ఛిన్నమవుతున్న ఉమ్మడి కుటుబ వ్యవస్థ. దీంతో పిల్లలకు విలువల గురించి చెప్పే వారు కరువయ్యారు. తల్లిదండ్రులిద్దరూ ఉద్యోగాలు, వ్యాపారాలలో నిమగ్నమవటంతో కనీసం పిల్లలతో సమయం గడపటం కరువయింది. ఈ దశలో పిల్లలు అడిగినదెల్లా సమకూర్చటం, డబ్బులు ఇవ్వటం ఎలక్ట్రానిక్ పరికరాలు ఇవ్వటం జరుగుతున్నది. దీంతో పిల్లలు అనేక దురలవాట్లకులోనవుతున్నారు. నిజానికి తల్లిదండ్రులు, పిల్లల మధ్య శారీరక, భావోద్వేగ సాన్నిహిత్యం సామాజిక, ఆర్థిక, నైతిక బంధాల స్థానంలో ఏ భావావేశాలకు స్థానం లేని ఎలక్ట్రానిక్ పరికరాలు వచ్చి చేరాయి. వాటి గుప్పిట్లో చిక్కిన యువత అనేక వ్యసనాలకు అలవాటుపడుతున్నారు. పిల్లల ప్రవర్తనను, స్నేహాన్ని తల్లిదండ్రులు ఒక కంట కనిపెడుతూ హెచ్చరిస్తూ ఉండకపోతే జరిగే పరిణామాలకు వారే బాధితులు అవుతారు. డ్రగ్స్ కేసు విచారణకు వచ్చేవాళ్లంతా నలబై ఏండ్లలోపు వారే కావడం గమనార్హం. వీరు ధరించే బట్టలు, వాడే కార్లు ఎంతో విలాసవంత మైనవి, ఖరీదైనవి. వీరంతా సినీ తారలో, వారి పిల్లలో, లేదా రాజకీయ నాయకుల పిల్లలో అయి ఉంటున్నారు. డ్రగ్స్ వ్యాపారస్తులకు భారతదేశ 50 కోట్ల యువత పెద్ద మార్కెట్. ఆధునిక పోకడలు అలవర్చుకుంటున్న యువత ఈ డ్రగ్స్ ఉచ్చులో సులువుగా చిక్కుతున్నది. ఆర్డర్ల పై అత్యధిక ధర పలికే ఈ డ్రగ్స్ హోమ్ డెలివరీ చేయబడుతున్నాయి. ఇప్పుడు మాదక ద్రవ్యాల వ్యాపారం అత్యున్నత స్థాయికి చేరుకుంది. అత్యంత దరిద్రమైన విషయం ఏమిటంటే ప్రపంచలో $700 బిలియన్ల డాలర్ల అమ్మకాలతో, ఆయుధాలు, పెట్రోలియం తర్వాత నార్కోటిక్స్ వ్యాపారం మూడవ అతిపెద్ద వ్యాపారం.

70 శాతం మాదక ద్రవ్యాలు ఆఫ్గనిస్తాన్, అమెరికానుండి సరఫరా చేయబడుతున్నాయి. పట్టుబడుతున్న మాదక ద్రవ్యాలు 15 శాతంలోపే. భారతదేశంలోకి డ్రగ్స్ విదేశాలనుండి దిగుమతి అవుతున్నాయి. ఇవి దొరకని పట్టణ ప్రాంతాలు లేవు. ఈ విష సంస్కృతి గ్రామాలకు సైతం పాకుతున్నది. గంజాయి, హుక్కా సెంటర్లు వెలుస్తున్నాయి. గుట్కా, మత్తుపదార్థాలు పేరుకే నిషేధించినట్టు కనిపిస్తున్నది. కానీ గుట్కా దొరకని షాపులు, పాన్ డబ్బాలు లేవు. ఈ సంస్కృతి పాఠశాల స్థాయి కూడా పాకుతున్నది. మత్తుపదార్థాలు, మాదక ద్రవ్యాల మూలంగా అనేక కుటుంబాలు విధ్వంసం అవుతున్నాయి. ఆదాయ వ్యయాల కోసం ప్రభుత్వం ఒక వైపు బార్లు వైన్ షాపులు పెంచి ప్రభుత్వ ఆదాయాన్ని ఇబ్బడి ముబ్బడిగా పెంచుకోజూస్తున్నాయే తప్ప ప్రజారోగ్యం సంక్షేమం పట్ల శ్రద్ధ చూపడం లేదు. మరో వైపు ఈ మాదక ద్రవ్యాలు తోడవ్వడంతో యువత నిర్వీర్యమవుతుంది.

కొన్ని పాశ్చాత్య దేశాల్లో డ్రగ్స్‌ను రిక్రియేషనల్ డ్రగ్‌గా గుర్తించారు. అంటే చట్టబద్దంగానే డ్రగ్స్ తీసుకోవచ్చు. ఇలాంటి సంస్కృతి విస్తరిస్తే సమాజం అస్తవ్యస్తం కాకమానదు. అది అనేక వైషమ్యాలకు, అనర్థాలకు దారితీయగలదు. ప్రభుత్వాలు మాదక ద్రవ్యాల వినియోగం జరుగకుండా, ఎలాంటి ఒత్తిళ్లకు లొంగకుండా కఠిన చట్టాలు తేవాలి. ఇలాంటి అనైతిక కార్యక్రమాలకు పాల్పడే వారిపై కఠిన చర్యలు తీసుకోవాలి. ప్రభుత్వాలు స్వపర భేదం లేకుండా మాదక ద్రవ్యాల సరఫరా వినియోగదారులపై ఉక్కు పాదం మోపాలి సమాజహితం కానిది ఏదైనా వర్జించదగ్గదే అని గ్రహించాలి. సాధారణమైన జీవన విధానం, ఉన్నతమైన ఆలోచన విలువలతో కూడిన సామాజిక బాధ్యత, సామాజిక స్పృహ చిన్నప్పటినుండే పిల్లల్లో కలిగేలాచూడాలి. ఉన్నతమైన లక్ష్యాల కోసం ప్రేరేపించాలి. ఇది విద్యా వ్యవస్థనుండే ప్రారంభం కావాలి. ఆధునిక సాంకేతిక యుగంలో సమున్నతమైన సామాజిక మార్పు దిశగా యువతను నడిపించాల్సిన బాధ్యత ప్రభుత్వాలదే. తల్లిదండ్రులు, ప్రాథమికంగా ఉపాధ్యాయులు చైతన్యవంతమైన సమాజ అభివృద్ధి కోసం తగిన శ్రద్ధ, కృషి సల్పినప్పుడే యువత దురలవాట్లకు దుర్నీతికి దూరమై ఆశించిన భవిష్యత్తు ఆవిష్కృతమవుతుంది.

*(రచయిత డి.టి.ఎఫ్. రాష్ట్ర కౌన్సిలర్)* వీ

## కర్నాటి రామ్మోహనరావు

*సీనియర్ న్యాయవాది కర్నాటి రామ్మోహనరావు (80) గుండె పోటుతో మరణించారు. అనారోగ్య సమస్యలతో బాధపడుతున్న రామ్మోహనరావు కొంతకాలంగా విజయవాడలోని ఓ ప్రైవేట్ ఆసుపత్రిలో చికిత్స పొందుతూ నవంబర్ 8న మరణించారు. ఆయన కృష్ణా జిల్లా చింతలపాడులో జన్మించారు. కర్నాటి రామ్మోహనరావు 1967 జూలై 4న రాష్ట్ర బార్ కౌన్సిల్‌లో న్యాయవాదిగా నమోదు చేసుకుని విజయవాడలో ప్రాక్టీసు ప్రారంభించారు. ఎమర్జెన్సీకి ముందు ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘంలో క్రియాశీలంగా పనిచేశారు. అనేక సంచలనాత్మక కేసులను వాదించారు. క్రిమినల్ కేసులు వాదించడంలో దిట్టగా ఎదిగారు. ఉరిశిక్షలను ఆయన తీవ్రంగా వ్యతిరేకించేవారు. వంగవీటి మోహనరంగా, దేవినేని నెహ్రూ ఇరు వర్గాల కేసులను వాదించేవారు. తెదేపా ఆవిర్భావ సమయంలో రామ్మోహనరావు, ప్రముఖ పాత్ర పోషించారు. విజయవాడ, గుంటూరు మధ్యలో హైకోర్టు బెంచి కోసం ఉద్యమించారు. రాష్ట్రంలో ఎక్కడైనా మానవహక్కుల ఉల్లంఘన జరిగితే తన గళాన్ని వినిపిస్తూ అనేక ఉద్యమాలలో పాల్గొన్నారు. విజయవాడలోని సూర్యారావుపేటలో ఉన్న నగరపాలక సంస్థ పాఠశాల అభివృద్ధికి నిధులు ఇవ్వడంతో కర్నాటి రామ్మోహనరావు పేరునే పెట్టారు.*

# వెంటాడుతున్న భోపాల్ విషవాయువు

***భోపాల్ దుర్ఘటన జరిగి మూడున్నర దశాబ్దాలైనా, ఇప్పటికీ అక్కడి పరిసరాలు విషతుల్యమై ప్రజల్ని వెంటాడుతున్నా ప్రభుత్వాలు పట్టించుకోవడంలేదని అంటున్నారు* ఎన్.డి. జయప్రకాశ్**

**మూ**డున్నర దశాబ్దాల క్రితం భోపాల్‌లో డిసెంబర్ 2 అర్ధరాత్రి యూనియన్ కార్బైడ్ ఇండియా లిమిటెడ్ అనే క్రిమి సంహారక మందు తాయరు చేసే కర్మాగారం నుండి విషవాయువు లీకై 3,787 మంది చనిపోగా, (ఇది అనధికారంగా 16,000 మంది అని అంచనా) 5,58,125 మంది గాయపడ్డారు. ఇది చరిత్రలోనే అత్యంత విషాదకర భయంకర దుర్ఘటన. 1942లో చైనాలోని బెంగ్సు కాలరీ పేలడంలో చనిపోయిన వారు 1,549 మంది.

భోపాల్‌లో జరిగిన అత్యంత విషాదకర దుర్ఘటనను దృష్టిలో పెట్టుకొని సంఘటన జరిగిన దశాబ్దం కాల పాటు జరిగిన విచారణలో తేలిన విషయం ఎంఐసి (మిథైల్ ఐసో సైనట్) లీక్ గూర్చి ప్రధానంగా కేంద్రీకరించబడ్డది. చాలా కాలం పిదప తెలిసిన విషయమేమంటే 1984లో ఈ దుర్ఘటన జరిగే కంటే చాలా కాలం ముందు యుసిఐఎల్ ఫ్యాక్టరీ పరిసర ప్రాంతాలన్నీ కూడా ఎంఐసి, డెరివలైన్స్ ద్వారా విషతుల్యమైపోయినాయి.

వాస్తవానికి 1969 లగాయతు ఫ్యాక్టరీ చుట్టు పక్కల ప్రాంతాలు, భూములు, భూగర్భ జలాలన్ని స్లో పాయిజన్ విష పదార్థాలు విశృంఖలంగా పోయడం వల్ల మెల్లమెల్లగా విషతుల్యమైతున్నట్లు 1990లో తెలిసింది. 1969 లోనే భోపాల్‌లో యుసిఐఎల్ ఫ్యాక్టరీ నిర్మాణమైంది. ఈ విషయాలన్ని కూడా భోపాల్ గ్యాస్ పీడితులు న్యాయం కోసం పారాడుతున్న నేపథ్యంలో ఒక్కొక్కటి వెలుగు చూడనారంభించాయి. వీటి మీద క్రిమినల్ చర్యలు తీసుకోవాలని న్యాయం కోసం పోరాడుతున్న సంస్థలు భోపాల్ గ్యాస్ పీడిత్ సంఘర్ష్ సహయోక్ సమితి (బిజిపిఎస్ఎస్ఎస్), ద భోపాల్ గ్రూప్ ఫర్ ఇన్ఫర్మేషన్ అండ్ ఆక్షన్ (బిజిఐఏ), భోపాల్ గ్యాస్ పీడిత్ మహిళా ఉద్యోగ్ సంఘర్ష్ (బిజిపిఎంయుఎస్).

యుసిఐఎల్ యాజమాన్యం సంబంధిత సాక్ష్యాలను తారుమారు చేస్తున్నదని, ఈ విషయంలో వారిని సాధ్యమైనంత వరకు దూరంగా ఉంచాలని పిటిషనర్ల ప్రధాన వాదన. పిటిషనర్ల చొరవ ఉపయోగకరంగా ఉన్నప్పటికీ అప్పటికే ఆ కేసు భోపాల్ సెషన్స్ కోర్టులో ఉన్నందున సిజెఎం పిటిషనర్ల కేసును కొట్టేశారు.

కేసు కొట్టివేసినా వాళ్ల ఒత్తిడి మూలంగా మధ్యప్రదేశ్ ప్రభుత్వం ఆ రాష్ట్ర పొల్యూషన్ కంట్రోల్ బోర్డు తక్షణమే రంగంలోకి దిగి మూసివేయబడి యుసిఐఎల్ పరిసరాలను తనిఖీ చేయడానికి ఆర్డరిచ్చింది. ఆ నివేదిక ద్వారా తెలిసిందేమంటే 44 మెట్రిక్ టన్నుల రెసెడ్యూ క్రిమి సంహారకర మందు తయారు చేస్తున్న సందర్భంగా ఉత్పత్తి అయినట్లు, మరో రసాయనిక పదార్థం ఆల్ఫానాఫ్తల్ 2.5 మెట్రిక్ టన్నుల వరకు డ్రమ్ముల్లో, ట్రేలలో నిలువచేసినట్లు వెల్లడైంది.

**నిపుణుల కమిటీ నిర్ధారణలు**

1994 జూలైలో కాలుష్య నివారణ బోర్డు ఒక నిపుణుల కమిటీని ఏర్పాటు చేసింది. ఫ్యాక్టరీ ప్రాంగణంలోని విషతుల్య పదార్థాలను ఎలా శుద్ధిచేసి దూరంగా పోయాలో పరిశీలించి సలహా ఇవ్వాల్సిందిగా కోరింది. కమిటీ 1995 మేలో ఫ్యాక్టరీ పరిసరాలను పరిశీలించి ప్రమాదకర రసాయనాలను సురక్షిత (ఆ ప్రాంతంలోనే) స్థలానికి తరలించాలని చెప్పింది. ప్రత్యామ్నాయ ఏర్పాట్ల గూర్చి, అధ్యయనం గూర్చి నొక్కి చెప్పింది. ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ కెమికల్ టెక్నాలజీ (ఐఐసిటి) హైదరాబాద్, నేషనల్ ఎన్విరాన్‌మెంటల్ ఇంజనీరింగ్ రీసెర్చి ఇనిస్టిట్యూట్ (ఎన్ఇఇఆర్ఐ) నాగపూర్ సంస్థలను బోర్డు తనవద్దే ఉంచుకొని సంబంధిత అధ్యయనాన్ని చేపట్టమన్నది.

ఆ సమయంలోనే ఫ్యాక్టరీలోని మిగిలిన పదార్థాలను దాని పరిసరాల్లోని సురక్షిత ప్రదేశాలకు తరలించుటకు సిజెఎంను అనుమతివ్వాల్సిందిగా బోర్డ కోరింది. గ్యాస్ లీకేజీ గూర్చి విచారిస్తున్న సిబిఐని సిజెఎం తగు సూచనలను కోరగా అది పర్యావరణ మంత్రిత్వ శాఖ సలహా కోరింది. పర్యవసానంగా మంత్రిత్వ శాఖ (ఆర్డర్ నెం ఎఫ్ నెం 11-2/96-ఎచ్ఎస్ఎండి 1997 జనవరి 1) ఎన్ఇఇఆర్ఐ, ఐఐసిఒ, ఎంపిపిసిబి సంస్థల సభ్యులతో కూడిన ముగ్గురు సభ్యులతో మరో కమిటీని ఏర్పాటు చేయగా వాళ్లు 1997 అక్టోబర్ 15న ఫ్యాక్టరీ స్థలాలను దర్శించి పరిశీలించారు. ఈ ముగ్గురు సభ్యుల కమిటీ పరిశీలనలో ప్రమాదకర రసాయన పదార్థాలన్నీ నింపిన సంచులు చీకిపోయి ఉన్నాయని, వాటిని తరలించే ప్రయత్నం చేస్తే బతికిపోయే ఆస్కారముందని సలహా చెప్పింది. ఆ మిగిలిన పదార్థాలను కరిగిస్తుండగా ఆ పదార్థాలన్నీ నేలపై, షెడ్డు బయటా వ్యాపిస్తాయని కూడా చెప్పింది.

ఎంపిపిసిబి ద్వారా సిజెఎంకు అందజేయబడిన నిపుణుల కమిటీ రిపోర్టు అంశాలన్నింటినీ గ్యాస్ బాధిత సంస్థలు అవగాహన చేసుకోగలిగినాయి. ఆ నివేదికలోని కళ్లు తేలేసే ఒక అంశం కంటబడ్డది. అది 'వర్షాకాల సమయంలో బయటకు చిమ్మిన ప్రమాదకర విషతుల్య పదార్థాలు ఇతర ప్రదేశాలకు చేరి నీటిని కలుషితం చేయగలదు'. ఈ వాస్తవాన్ని మూడున్నర దశాబ్దాలు గడిచిన పిదప కూడా బోర్డు తెలిపే విషయమేమంటే పొంచి ఉన్న కాలుష్య

ప్రమాదం అలాగే కొనసాగుతున్నది.

**బిజిఐఎ నివేదిక**

వాస్తవానికి 1996 లోనే బిజిఐఎ (భోపాల్ గ్రూప్ ఫర్ ఇన్ఫర్మేషన్ అండ్ ఆక్షన్) నివేదిక చెప్పేదేమంటే 1969 – 1977ల మధ్య ఫ్యాక్టరీకి సంబంధించిన రసాయన పదార్థాలన్నింటినీ ఫ్యాక్టరీ తూర్పు సరిహద్దులోని తెరిచి ఉన్న ఒక బొందలో పోశారు. 1977 నుండి 1984 వరకు ఈ పదార్థాలన్నీ ఫ్యాక్టరీకి ఉత్తర సరిహద్దు వద్ద గోడ బయట గల సోలార్ ఎవాపరేషన్ పాండ్స్ (ఎస్ఇపి)లలోకి విడిచి పెట్టారు. ఇవన్నీ పాలిథిన్ పదార్థం చేత అనవసర పదార్థాలను నిరోధించేట్లు నిర్మించారు. కాని అనూహ్య పదార్థాల చేరికను ఇవి నిరోధించాయా అనేది పెద్ద ప్రశ్నే!

ఇలాంటి పరిస్థితుల్లో పాండ్స్లోకి చేరిన రసాయన పదార్థాలు వాటి చుట్టుపక్కల భూగర్భ జలాలను కలుషితం చేయడం అనివార్యమని నివేదిక చెబుతుంది. మూసివేయబడ్డ యుసిఐఎల్ ప్లాంటు దరిదాపుల్లోని మట్టి, నీరు శాంపిళ్లను పరీక్షలకు పంపగా భయంకరమైన విషపదార్థాలున్నట్లు ఈ సంస్థ 1990లలో తెలుసుకోగలిగింది. అంతేగాక ప్లాంటు చుట్టు పక్కల నివసించే గుడిసెవాసులందరు కలుషిత నీరే శరణ్యంగా ఏండ్ల తరబడి తాగారని బిజిపిఎంయుఎస్ అభిప్రాయ పడింది.

ఈ సంఘటనలు, నివేదికలన్నింటినీ దృష్టిలో పెట్టుకొని బిజిఐఎ, బిజిపిఎంయుఎస్ల ప్రాతినిధ్యాలను పరిశీలించి 1999 మేలో గ్రీన్పీస్ ఇంటర్నేషనల్ యుసిఐఎల్ ప్రాంతంలో శోధన చేపట్టింది. ఫ్యాక్టరీలో సెల్విన్ ప్లాంట్, పగిలిన వాటర్ ట్యాంక్, విసర్జించబడిన ప్రాంతాల్లోని మట్టిని, నీటిని శాంపిళ్లుగా సేకరించారు. చుట్టు పక్కల గల బావుల్లో నుండి భూగర్భ జలాల శాంపిళ్లు కూడా సేకరించారు.

**గ్రీన్పీస్ అధ్యయనం**

యునైటెడ్ కింగ్డమ్కు చెందిన ఎక్స్టర్ విశ్వవిద్యాలయానికి చెందిన ప్రయోగశాలల్లో ఈ శాంపిళ్లను పరీక్షించడం ప్రారంభించారు. ఇందులో భారీ లోహ, ఆర్గానిక్ కలుషితాల పరీక్షలు జరిగాయి. ఫలితాలన్నింటినీ 'భోపాల్ వెగసీ' పేరున 1999 నవంబర్లో విడుదల చేశారు. ఆ ఫలితాల్లో తాగు నీటిలో, మట్టిలో భారీ లోహాల, విషపూరిత రసాయనాలతో తీవ్ర కలుషితం జరిగిందని తేటతెల్లమైంది.

సర్వే ప్రకారం సెల్విన్ (కార్బరిల్) కింద గల మురుగు కాల్వల కింది నుండి తీసిన శాంపిళ్లలో 12 శాతం మెర్క్యురీ ఉందని చూశారు (ఉండాల్సిన వాటికంటే 20 వేలు – 6 మిలియన్ల రెట్లు అధికం).

గ్రీన్పీస్ సర్వే ఇంకా ఇలా చెప్పింది! క్రోమియం, నికెల్, రాగి, సీసం మొదలగు లోహాలు కూడా తగిన మోతాదులో ఉన్నట్లు తెలుస్తున్నది. వీటికి అదనంగా ఘన పదార్థాల్లో కనబడే విషతుల్యమైన హెక్సాక్లోరో ఇథేన్, హెక్సాక్లోరో బుటడిన్ లాంటివి కూడా శాంపిళ్లలో ఉన్నట్లు తేలింది.

ఈ కలుషితమనేది సాధారణంగా ప్లాంట్ నడుస్తున్న సమయాల్లో జరిగే ప్రమాదాలు గాని, చిమ్మిన పదార్థాలతో గాని లేక కుప్పగా పోసే రసాయన పదార్థాల ద్వారా విడుదలయ్యే వాయువుల ద్వారా గానే జరుగుతుంది. ఇలా జరుగుతున్న కలుషితం గూర్చి ఇంకా తెలుసుకోవాలంటే వీటికి సంబంధించిన విస్తారమైన అధ్యయనం, సర్వేలు అత్యవసరంగా చేపట్టాలంటుంది.

'కలుషిత వ్యర్థాలు, మట్టిని జాగ్రత్తగా సేకరించి అవి శుద్ధిపరిచే వరకు జాగ్రత్త చేయాలి. ఈ శుద్ధి కూడా ఆ పదార్థాల్లోని విషతుల్య రసాయనిక పదార్థాలు, భారీ లోహాలన్నీ పూర్తిగా నిర్వీర్యం చేయబడేంత వరకు జాగ్రత్తగా జరగాలి. ఈ శుద్ధి చేసే కార్యక్రమం కూడా పూర్తి జాగ్రత్తలతో, ఆ సమయంలో విడుదలయ్యే ఉప రసాయనిక పదార్థాలు బయటకు పోకుండా కట్టుదిట్టంగా కొనసాగించాలి. ఎట్టి పరిస్థితుల్లోనే ఆ విషపదార్థాలు వాతావరణంలోకి చేరకుండా జాగ్రత్త పడాలి'.

'కలుషిత భూగర్భ జలాలు పూర్తిగా శుద్ధి చేయబడి నీటి ప్రాణులకు అనుకూలంగా మారడమే లక్ష్యంగా ఉండాలి. ఇది పాక్షికంగా శుద్ధి చేయబడే సాంకేతిక మార్గాల ద్వారా త్వరగా ఆవిరి చెందే సేంద్రీయ రసాయన పదార్థాలను నిల్వ ఉంచడంలో, విడగొట్టి ఉంచడంలో, శుద్ధి చేయడంలో తగు జాగ్రత్తలు తీసుకోవాల్సి ఉంటుంది. తాత్కాలికంగానైనా రాష్ట్ర ప్రభుత్వం తాగునీరు లభించేలా కృషి చేయడమే గాక, బావుల నీరు కలుషితం కాకుండా జాగ్రత్త పడాల్సి ఉంది. ఆ ప్రదేశం చుట్టుపక్కల అత్యవసరంగా ఇంకేమాత్రం నీరు కలుషితం కాకుండా చూడాలి'.

ఈ సందేశం గట్టిగానే కనబడుతున్నది. యుసిఐఎల్ ప్లాంటు చుట్టు పక్కల వాతావరణం కలుషితం కాకుండా, ఆ ప్రాంతంలో నివసిస్తున్న ప్రజల ఆరోగ్యాలు దెబ్బతినకుండా ప్రభుత్వం చూడాలి. దీనికోసం వివరమైన ప్రణాళిక సిద్ధం చేసుకోవాలి. లేకుంటే మూసి ఉంచిన ప్లాంటు వల్ల మరింత నష్టం జరిగే అవకాశం ఉంది.

మూసివేయబడ్డ క్రిమి సంహారక ప్లాంటు విశృంఖలంగా రసాయనిక పదార్థాలు వెదజల్లి ఆ ప్రాంతం విషతుల్యం కావడానికి దోహదపడ్డది. 1984లో విషవాయువు లీకై వేలాది మంది మృత్యువాత పడడానికి కారణభూతమైన ఈ క్రిమి సంహారక ఫ్యాక్టరీ పెద్ద మొత్తంలో ప్రజల ఆరోగ్యాలు పాడుకావడానికి కారణంగా ఉన్నది.

వాస్తవానికి ప్రజా సంఘాలు, బాధిత సంఘాలు, ఆరోగ్య నిపుణులు, వాతావరణ పరిరక్షకులు చెప్పిన విషయాలను, పిటిషన్లను ప్రభుత్వం ప్రాధాన్యతంగా చూడాలి. ప్లాంటు పరిసర ప్రాంతాల ప్రజల ఆరోగ్యం ప్రధానంగా పరిరక్షించే బాధ్యతతో మెలగాలి.

1999లో గ్రీన్పీస్ నివేదిక సమస్యను బహిర్గతం చేసినా ఢిల్లీకి చెందిన స్వచ్ఛంద సంస్థ 'సృష్టి' డెహ్రాడూన్కు చెందిన పీపుల్స్ సైన్స్ ఇనిస్టిట్యూట్ (పిఎస్ఐ) చేపట్టిన అధ్యయనాలు మరింత లోతుగా సమస్యలను ఎత్తి చూపాయి. భోపాల్ దుర్ఘటనపై నిజ నిర్ధారణ కోసం ఏర్పడ్డ 'సృష్టి' ప్రత్యేకంగా ఆ ప్రాంతంలో ఆహార పదార్థాల ద్వారా రసాయన కలుషితాల కదలిక ఎలా ఉందన్నదానిపైనే కేంద్రీకరించి పనిచేసింది.

కాన్పూర్లోని ఐఐటిలో ఫెసిలిటీ ఆఫ్ ఎకలాజికల్ అండ్ అనలైటికల్ టెస్టింగ్ ప్రయోగశాలలో 1999 – 2000 లో యుసిఐఎల్

ప్లాంట్ పరిసర ప్రాంతాల నుండి సేకరించిన మట్టి, భూగర్భ జలాలను పరీక్షించారు. 2002 జనవరిలో సృష్టి నివేదిక 'సర్వైవింగ్ భోపాల్: టాక్సిక్ ప్రెసంట్–టాక్సిక్ ఫ్యూచర్' పేరున విడుదలైంది.

యుసిఐఎల్ ఫ్యాక్టరీలో ఒక దగ్గర నుండి మరోదగ్గరికి రసాయనాల కదలిక – వాతావరణంలోనికి చేరిన విధానం నిశితంగా నివేదిక రికార్డు చేసింది. ఆహార పదార్థాల్లో బయో రసాయన విష పదార్థాల స్థాయిలు ఎలా మారాయన్న అంశాన్ని జాగ్రత్తగా పొందుపరిచి విశదపరిచింది. ఆ నివేదికలోని ఫలితాలన్నీ ఏ విధంగా విషవాయువు ఎలా కాలుష్యమైందో తేటతెల్లం చేసింది. మట్టి, భూగర్భ జలాలు, కూరగాయలు మొదలగువన్నీ విషపూరితం అవ్వడం గాక, స్త్రీల చనుబాలలో కూడా విషకణాలు చేరాయని ఆ నివేదికలో తెలిపారు. ఇంకా 'మరో పరిశీలించాల్సిన అంశం స్త్రీల చనుబాలు అత్యధిక మోతాదులో విఒసి (వోలబైల్ ఆర్గానిక్ కాంపౌండ్స్), క్రిమి సంహారకాలు (హెక్సాక్లోర్ సైక్లో హెగ్సేన్) ఎక్కువగా కేంద్రీకృత మైనట్లు తెలుపుతున్నది. ఈ క్యాన్సర్ రోగకారక విషపదార్థాలు పాలలో కలిసిపోయినవి. ఈ క్యాన్సర్ కారక విషపదార్థాలు చిన్న పిల్లల విషయంలో తీవ్ర ప్రభావాన్ని చూపెడుతున్నాయి'.

'ఈ అధ్యయనం వల్ల నిర్దిష్టంగా తెలిసిందేమంటే యుసిఐఎల్ ఫ్యాక్టరీ విడిచిన పలు రకాల రసాయన పదార్థాలు దాని చుట్టుపక్కల ఉన్నందున ఇవన్నీ రసాయన కాలుష్యాన్ని వెదజల్లే ఒక వనరుగా మారింది. 3–5 కిలోమీటర్ల పరిధిలో మరే రసాయన కర్మాగారం లేనందున ఈ విషపదార్థాలు వెదజల్లడంలో ఈ ఫ్యాక్టరీ రసాయన పదార్థాలే ప్రధానమైనవని అధ్యయనం తెలుపుతున్నది. సృష్టి అధ్యయనం కూడా రసాయన కాలుష్యం వల్ల రకరకాల వ్యాధులు – జ్వరం, డయేరియా, శ్వాస, నరాల సంబంధిత సమస్యలు, క్యాన్సర్ లాంటివి మనుషుల్ని దీర్ఘ కాలంగా బాధించే అవకాశాలున్నాయి'.

**పిసిఐ స్టడీ**

2001 – 2002 సంవత్సరాల మధ్య బిజిపిఎంయుఎస్ కోసం డెహ్రాడూన్ పిఎస్ఐ చేపట్టిన అధ్యయనం ప్రధానంగా భూగర్భ జలాల్లో పాదరసం మోతాదును బేరీజు వేయడం కోసమే. ఆ ప్రాంతంలోని నివాస ప్రాంతాల నుంచి 7 చేతి పంపుల నుండి, 7 బోరు బావుల నుండి నీటిని సేకరించి పరీక్షించారు. ఎస్ఇపి, ఇతర బావుల నుండి కూడా నీటి శాంపుళ్లను సేకరించారు. పిఎస్ఐ ప్రయోగశాలలో వీటిని నిశితంగా పరీక్షించారు. ఈ పరీక్షల్లో మెర్క్యురీ (పాదరసం) పాలు విషతుల్యం స్థాయిలో ఉన్నట్లు తేలింది. ఇలాంటి మోతాదులో ఉన్నవాటితో మెదడు, కిడ్నీలు శాశ్వతంగా చెడిపోయే ప్రమాదమున్నది. ఏజెన్సీ ఫర్ ట్యాక్సిక్ కాన్సంట్రేషన్, అమెరికా ప్రజారోగ్య సంస్థ డిసీస్ రిజిస్ట్రీ తెలిపిన ప్రకారం పిఎస్ఐ అధ్యయనం ఇలా తెలిపింది – 'పాదరసం మెదడులోని చాలా చోట్ల ప్రభావం చూపి రకరకాల రోగ లక్షణాలని చూపెడుతుంది. అంటే వ్యక్తిలో మార్పు (చికాకు, సిగ్గుపడడం, నరాల బలహీనతలు), దృష్టిలో మార్పు (చూపు సన్నగిల్లడం – మందగించడం), చెవుడు, కండరాల బాధలు, జ్ఞాపక శక్తి సమస్యలు మొదలగునవి'.

**అమెరికాలో న్యాయ పోరాటం**

గతంలో గ్రీన్‌పీస్ సూచించిన నివారణోపాయాలతో పిసిఐ, సృష్టి సంస్థలు ఏకాభిప్రాయంతో ఉన్నాయి. పీడితులు, బాధితుల పక్షాన వాదిస్తున్న, పోరాడుతున్న ఈ సంస్థలు నివారణోపాయాలకై పెట్టాల్సిన సొమ్ము యుసిసి, దాని ప్రస్తుత యజమాని అమెరికాకు చెందిన డవ్ కెమికల్స్‌లు మాత్రమే భరించాలనే విషయాన్ని చెపుతున్నాయి. భోపాల్ పీడితులకు మద్దతుగా నిలిచిన అమెరికాలోని కొన్ని గ్రూపులు, బాధితుల పక్షాన ఉన్న కొన్ని సంస్థలు 1999 నవంబర్ 15న అమెరికాలో న్యూయార్క్ దక్షిణ జిల్లా కోర్టులో ఒక సివిల్ దావా వేశారు.

యుసిసి (యూనియన్ కార్బైడ్ కార్పొరేషన్) దుర్ఘటన జరిగినప్పుడు దీనికి ఛైర్మన్‌గా ఉన్న వారెన్ ఆండర్సన్‌లకు కోర్టు నోటీసులిచ్చారు. భోపాల్ ప్లాంటు వద్ద వేయబడ్డ రసాయన పదార్థాలకు సంబంధించిన డాక్యుమెంట్‌ను యుసిసి సమర్పించాల్సి ఉండింది. 2000 ఆగస్ట్‌లో కోర్టు కేసు కొట్టివేయడం – అమెరికా కోర్టు ఆఫ్ అప్పీల్స్ కేసును జిల్లా కోర్టుకు 2001 నవంబర్ 21న తాజా పరిశీలన కోసం తిప్పి పంపింది. ఏది ఏమైనా కేసులో ఎలాంటి పురోగతి లేక 2006 ఆగస్ట్ 10న అమెరికా కోర్టు కోర్ట్ ఆఫ్ అప్పీల్స్ కేసును కొట్టివేసింది. 1984లో జరిగిన దుర్ఘటన బాధితుడు జానకీబాయి సాహు మరో తాజా పిటిషన్‌ను వేయగా అది కూడా ఏ పురోగతి లేకుండా 2012 జూన్ 12న కొట్టివేయబడింది. అలాగే జిల్లా కోర్టు ఆర్డర్‌కు వ్యతిరేకంగా వచ్చిన అప్పీలును కూడా అమెరికా కోర్ట్ ఆఫ్ అప్పీల్స్ కొట్టివేసింది. జగన్నాథ్ సాహు పేర మరో ఫిర్యాదు వెళ్లినా దాన్ని కూడా 2016 మే 24న కొట్టివేశారు.

2004 జూలై 23న ప్లాంటు చుట్టు పక్కల విషతుల్య రసాయన పదార్థాలను శుభ్రం చేయించాలని జబల్‌పూర్‌లోని మధ్యప్రదేశ్ హైకోర్టుకు (డబ్ల్యుపి నెం. 2802 ఆఫ్ 2004) ఒక ఫిర్యాదు చేరింది. ఈ విషయంలో బిజిపిఎస్ఎస్ఎస్, బిజిపిఎంయుఎస్, బిజిఐఎ – ఈ మూడు సంస్థలు సంయుక్తంగా ఈ ఫిర్యాదును కోర్టుకు చేశాయి. అదే సమయంలో 1989 ఫిబ్రవరి నాటి భోపాల్ సెటిల్‌మెంట్‌కు వ్యతిరేకంగా భారత కేంద్ర ప్రభుత్వం క్యురేటివ్ పిటిషన్‌ను (డబ్ల్యుపి నెం. 345–347 ఆఫ్ 2010) సుప్రీంకోర్టులో వేసింది. భోపాల్ విషవాయువు దుర్ఘటనకు సంబంధించిన ప్లాంటు ప్రాంగణ శుద్ధిని డవ్ కెమికల్స్ చేపట్టాలనే అంశం కూడా ఆ పిటిషన్‌లో ఉన్నది.

వివిధ కోర్టుల్లో నలుగుతూ వివిధ పటిషన్‌లు అలాగే ఉండగానే యుసిఐఎల్ మరింత భయ భ్రాంతులకు గురిచేసే వార్తలందుతున్నాయి. గత అధ్యయనానికి అదనంగా గ్రీన్‌పీస్ తాజా అధ్యయనంలో ఈ కింది అంశాలు తేటతెల్లమవుతున్నాయి.

'ఆ ప్రాంతంలో నివసిస్తున్న జనాభా విషతుల్యమైన మట్టిని స్పృశించడంలో, విషపూరిత గాలిని పీల్చుకునే ప్రమాదంలో ఉన్నారు. ఎచ్‌సిఎచ్ (హెక్సా క్లోరా హెక్జాన్) అనే విషం ఆ ప్రాంతంలో మేత మేస్తున్న పశువుల పాలలో కలుస్తున్నది. గ్యాస్ విడుదలయ్యాక పలు రకాల రుగ్మతలకు ఆ ప్రాంత జనాభా గురవుతున్నారు. ఇంకనూ రసాయనాలు వెదజల్లే విషవాయువు పీల్చడం అత్యంత అభ్యంతరకరం'.

'వీటికి అదనంగా ఎన్ఇఆర్ఐ, హైదరాబాద్‌లోని ఎన్‌జిఆర్ఐ (నేషనల్. జియోఫిజికల్ రీసర్చ్ ఇనిస్టిట్యూట్) 2010 సంయుక్త అధ్యయనాన్ని చేపట్టింది. ఆ అధ్యయనం ప్రాథమిక అంచనాల ప్రకారం – యుసిఐఎల్‌కు బయటా, సమీపాన గల విషతుల్యమైన నేల సుమారుగా అంచనా వేయబడింది. 6,50,000 ఎం. 1.7 జిఎంఎస్/సిసిగా లెక్కిస్తే వేయబడ్డ నేల సాంద్రతను ను శుద్ధి చేయాలంటే కావాల్సింది 11,00,000 ఎంటిగా అంచనా వేయబడ్డది'.

ఈ రెండు సంస్థలు విషతుల్యమైన నేల ఎంతవరకుందో బహిర్గత పరిచాయి. ఈ అధ్యయనం చొరవతో భోపాల్ ఎన్విరాన్‌మెంటల్ సాంద్రత ఓవర్‌సైట్ కమిటీ ఛైర్మన్, అడవులు, పర్యావరణ మంత్రిత్వ శాఖలను జాగృతం చేయగా వారు బాధితుల పక్షాన ఈ అధ్యయనంపై వారి అభిప్రాయాలనడిగారు. 2010 జూలై 9న ఎన్ఇఆర్ఐ, ఎన్‌జిఆర్ఐలు లోతైన నివేదికల్ని తయారు చేసి ప్రభుత్వానికి సమర్పించాయి. వాటిలో ఈ కింద తెలిపిన కీలకాంశాలున్నాయి.

లీకేజీ ప్రాంతంలో వాడిన పదార్థాలపై సవివరమైన అధ్యయనం – వర్గీకరించడం – ప్రాథమిక దశలోని కలుషితాల ద్వారా విడుదలయ్యే పదార్థాల పరిశీలన. స్థలం నమూనా అభివృద్ధి, సాంప్లింగ్, విశ్లేషన పథకం – లీకేజీ మొదలగు పరీక్షలు, ప్రయోగశాలల ఏర్పాటు – ఇవన్నీ తదనంతర కాలంలో నివారణా చర్యల్లో సహాయాన్ని అందించే ఏర్పాట్లు.

- ◆ విశ్లేషించిన వాటి సరియైన ఫలితాల ప్రకటన – మిగతా అసంపూర్తి గణాంకాల విడుదల.
- ◆ ప్లాంటును నిర్వీర్యం చేసి సరియైన ఆరోగ్య సలహా పథకాల ఏర్పాటు.
- ◆ వివిధ రకాల భూముల్లోని నేలను పరిగణించుటకు స్థల పరిశీలన.
- ◆ గ్రిడ్ పరిశోధన కోసం స్థల పరిశోధన (ఇలాటి విషయాల్లో 25 ఎం లేదా 50 ఎం గ్రిడ్ సహజమే).
- ◆ లోపలా బయటా చక్కగా డిజైన్ చేసి బావులను డ్రిల్లింగ్ చేయుట. ఇది కేవలం భూగర్భ జలాలను పరీక్షించుట కోసం.
- ◆ నియత స్థల నమూనా
- ◆ నివారణా లక్ష్యాల సాధన కోసం ప్రమాదకరమైన పరిస్థితుల ఆచరణ.
- ◆ నివారణా ఐచ్ఛికాల – అవసరమైనన్ని ట్రయల్స్ నిర్వహణ.

దురదృష్టవశాత్తు గత పదేండ్ల కాలంలో ఎలాంటి ప్రగతి లేదు. కాకపోతే ఒకే ఒక్క ప్రాథమిక కార్యశాలను సెంటర్ ఫర్ ఎన్విరాన్‌మెంట్ అండ్ సైన్స్ (సిఎస్ఇ) ఆధ్వర్యాన నిర్వహించితే మధ్యప్రదేశ్ ప్రభుత్వం తప్ప మిగతా సంబంధిత అధికార అనధికారులు అందులో పాల్గొన్నారు. ఇది ఢిల్లీలో 2013 ఏప్రిల్ 25, 26లలో జరిగింది. విషతుల్య ప్రదేశం శుభ్రపరిచే ఒకే లక్ష్యంతో ఏర్పాటు చేయబడిన ఈ కార్యశాలలో నివారణ కోసం తగిన కార్యాచరణ పథకం సిద్ధం చేయుటకై చర్చ జరిగింది.

సంబంధిత అధికార అనధికారులతో కలిసి తాజా సమావేశాన్ని ఏర్పాటు చేసి నివారణా ప్రయత్నాలు కొనసాగించుటకు కెమికల్ అండ్ ఫర్టిలైజర్స్ మంత్రిత్వ శాఖ, ప్రధాన మంత్రి కార్యాలయం కలిసి కొన్ని ప్రయత్నాలు ప్రారంభించాయి. దీంట్లో మధ్యప్రదేశ్ ప్రభుత్వం, కేంద్ర ప్రభుత్వం, స్వచ్ఛంద సంస్థలు, జాతీయ, అంతర్జాతీయ సైన్స్ సంస్థలు, రసాయన కర్మాగారాల ప్రతినిధులు, ఐక్యరాజ్య సమితి పర్యావరణ సంస్థ మొదలగు వారంతా ఇందులో విధిగా పాల్గొనాలి. అలాంటి సమావేశంలో విషతుల్యమైన స్థలం ఎలా శుద్ధిచేయబడి పరిరక్షించబడాలో సవివరమైన కార్యాచరణ సథకం సిద్ధం చేయాలి. అదీ ఒక నిర్ణీత కాల వ్యవధిలో జరగాలి.

*(రచయిత కో కన్వీనర్, బిజిపిఎస్ఎస్ఎస్)*

*(మొదట ఈ వ్యాసం 'లీఫ్‌లెట్'లో ప్రచురితమై తిరిగి 'జనతా వీక్లీ' 2020 సెప్టెంబర్ 20 సంచికలో పునర్ముద్రణ జరిగింది)*

*(స్వేచ్ఛానువాదం: ఎనిశెట్టి శంకర్)*

వీ

## పాలపర్తి ప్రసాద్ మృతి

ప్రముఖ జర్నలిస్టు, చారిత్రక నవలా రచయిత పాలపర్తి ప్రసాద్ (88) నవంబర్ 9న హైదరాబాద్‌లోని స్వగృహంలో మృతి చెందారు. ఆంధ్రప్రదేశ్‌లోని గుంటూరు జిల్లా బాపట్లకు చెందిన ప్రసాద్ విద్యాభ్యాసం అంతా అప్పటి మద్రాస్‌లో జరిగింది. ఆయన ఆంధ్రపత్రిక సంపాదకులుగా పనిచేశారు. ఆయన సాహిత్యంలో విశేష కృషి చేశారు. ఆయన కలం నుంచి 'రోషనారా', 'అక్బర్', 'ఆర్యచాణక్య', 'పృథ్వీరాజ్', 'షాజహాన్' వంటి నవలలు వెలువడ్డాయి.

## ఆలూరి లలిత మృతి

*విప్లవ రచయితల సంఘం సభ్యురాలు, ఆలూరి భుజంగరావు సహచరి ఆలూరి లలిత (76) నవంబర్ 21న మరణించారు. కర్ణాటకలోని గుల్బర్గాలో కుమారుడి వద్ద ఉంటున్న ఆమె గుండెపోటుతో చనిపోయారు. ఆలూరి భుజంగరావు మరణం తరువాత లలిత అనారోగ్యం కారణంగా గుల్బర్గాలో ఉంటున్న కుమారుడు శివప్రసాదరావు దగ్గరకు వెళ్లి అక్కడే ఉంటున్నారు. భుజంగరావు బతికిన కాలమంతా ఇద్దరూ కలిసి ప్రతి ప్రజా సంఘం సభకు హాజరయ్యేవారు. గత 40 ఏళ్లు ప్రజా సంఘాలతో కలిసి పనిచేశారు. భుజంగరావుతో కలిసి దశాబ్దానికి పైగా అజ్ఞాత జీవితం గడిపారు. భుజంగరావు రచనా వ్యాసంగంలో భాగస్వామిగా నిలిచారు. ఆమె చాలాకాలంగా విరసం సభ్యురాలుగా కొనసాగుతున్నారు.*

# వినియోగదారుల హక్కులు

*వినియోగదారుల రక్షణ చట్టంలో పొదుపరిచిన వినియోగదారుల హక్కుల గురించి, వాటిని పొందే విధానం గురించి వివరిస్తున్నారు* **డా. ఎస్.యమ్. సయ్యద్**

"వినియోగదారుడు మన ప్రాంగణానికి ముఖ్య సందర్శకుడు. అతను మనమీద ఆధారపడి లేడు. మనమే అతనిమీద ఆధారపడి ఉన్నాం. అతను మన పనికి అంతరాయం కాదు. అతనిని ఉద్దేశించుకొనే మన పని ఉంది. వినియోగదారునికి అవకాశం ఇవ్వడం ద్వారా మేము అతనికి సహాయం చేయడం లేదు. ఆయనకు సేవ చేయడానికి మాకు అవకాశం ఇవ్వడం ద్వారా ఆయన మాకు సహాయం చేస్తున్నారు"

– మహాత్మాగాంధీ

**జాతీయ వినియోగదారుల దినోత్సవం**

భారతదేశంలో ప్రతి సంవత్సరం జాతీయ వినియోగదారుల హక్కుల దినోత్సవాన్ని డిసెంబర్ 24న జరవుకుంటారు. వినియోగదారుల రక్షణ చట్టం 1986ను 24 డిసెంబర్ 1986న అమల్లోకి తెచ్చిన సందర్భాన్ని పురస్కరించుకొని ఈ దినోత్సవాన్ని నిర్వహిస్తారు.

**నూతన వినియోగదారుల రక్షణ చట్టం, 2019**

డిజిటల్ యుగంలో వినియోగదారులు ఎదుర్కొంటున్న కొత్త సవాళ్లను పరిష్కరించడానికి, సకాలంలో సమర్థవంతమైన వివాద పరిష్కార దిశగా వినియోగదారులకు మరింత రక్షణగా కేంద్ర ప్రభుత్వం మూడు దశాబ్దాలకు పైగా ఉన్న పాత వినియోగదారుల రక్షణ చట్టం, 1986 స్థానంలో నూతన "వినియోగదారుల రక్షణ బిల్లు, 2019"ను ఆగస్టు 9న అధికారికంగా తీసుకువచ్చింది.

**వినియోగదారు**

వినియోగదారుల రక్షణ చట్టం 2019 (కన్స్యూమర్ ప్రొటెక్షన్ యాక్ట్, 2019) ప్రకారం వినియోగదారు అంటే ఆన్‌లైన్ లేదా ఆన్‌లైన్, టెలిఫోనింగ్, ప్రత్యక్ష అమ్మకం లేదా బహుళస్థాయి మార్కెటింగ్ ద్వారా ఏదైన వస్తువును లేదా సేవను కానీ తన సొంత అవసరాలకు కొనుగోలు చేసేవారుగా నిర్వచించారు.

**వినియోగదారుల హక్కులు**

**1. భద్రత హక్కు: (ప్రమాదకర వస్తువులు, సేవల నుండి రక్షణ):** వినియోగదారులు వారి ఆరోగ్యం, జీవితానికి హానికరించే వస్తువులు, సేవల మార్కెటింగ్ నుండి రక్షణ పొందే హక్కు ఉంది. ఈ హక్కు ప్రకారంగా వినియోగదారునికి నష్టం లేదా అసౌకర్యం సంభవించినట్లైతే దానికి కారకులైన ఉత్పత్తిదారులు (లేదా) డీలర్ మీద ఫిర్యాదు చేసే హక్కు ఉంది.

**2. సమాచార హక్కు (వస్తువులు, సేవల నాణ్యత పనితీరు):** ఉత్పత్తిదారులు వినియోగదారులకు అందుబాటులో ఉన్న వస్తువుల, సేవల పరిమాణం, నాణ్యత, స్వచ్ఛత ప్రమాణం, ధర గురించి తెలియజేసే హక్కు ఉంటుంది.

**3. ఎంచుకునే హక్కు** ప్రతి వినియోగదారునికి అనేక రకాల వస్తువుల సారుప్యాల నుండి అవసరమైన వస్తువు (లేదా) సేవను ఎన్నుకొనే హక్కు ఉంది.

**4. అభిప్రాయం తెలియచేసే హక్కు** వినియోగదారులు వారి అభిప్రాయాలను, ఆసక్తిని ఉత్పత్తిదారులకు, డీలర్లకు, ప్రకటనదారులకు తెలియజేసే హక్కు ఉంది.

**5. పరిష్కార హక్కు** తయారీదారు యొక్క లోపం కారణంగా వినియోగదారునికి నష్టం లేదా అసౌకర్యం కలిగినట్లైతే న్యాయస్థానంలో చట్టపరమైన పరిష్కారాలను కోరే హక్కు ఉంది.

**6. వినియోగదారుల విద్య హక్కు** ఉత్పత్తిదారుల దోపిడి నివారించడానికి వినియోగదారులకు తమ హక్కుల పట్ల అవగాహన, విద్య అవసరం. ఈ ప్రయోజనం కోసం వినియోగదారుల సంఘాలు, విద్యా సంస్థల, ప్రభుత్వ విధాన నిర్ణేతాలు వినియోగదారులకు వారి హక్కుల గురించి అవగాహణ కల్పించటానికి వీలు కల్పిస్తాయి.

**వినియోగదారుల పరిరక్షణ చట్టం, 2019 లోని కీలక అంశాలు**

– లోపాలతో ఉన్న వస్తువులు, సేవల వల్ల హాని కలిగితే వాటిని తయారు చేసిన సరఫరా చేసిన వ్యక్తి లేదా అమ్మకందారు నుంచి క్లెయిమ్ పొందే అవకావం ఫిర్యాదుదారునికి ఉంటుంది.

– ఈ చట్టం తప్పుడు వ్యాపార ప్రకటనలు, కల్తీలు, మోసాల నుంచి వినియోగదారులను రక్షించి వారి హక్కులను కాపాడటానికి ఉపయోగపడుతుంది.

– ఈ చట్టంలో నేరం రుజువైనప్పుడు విధించే జరిమానాలు, శిక్షలు చాలా కఠినంగా ఉంటాయి.

– ఈ–కామర్స్, టెలిషాపింగ్ లావాదేవీలు కూడా ఈ నూతన చట్టం పరిధిలోకి వస్తాయి. మునుపటి చట్టం (వినియోగదారుల చట్టం, 1986) ప్రత్యేకంగా ఈ–కామర్స్ లావాదేవీలను కలిగిలేదు. పెక్యునియరీ అధికార పరిధి (పెక్యునుమరీ జూరిస్‌డిక్షన్) పెరిగింది.

| | వినియోగదారుల పరిరక్షణ చట్టం, 1986 | నూతన వినియోగదారుల పరిరక్షణ చట్టం, 2019 |
|---|---|---|
| జిల్లా కమిషన్ | 20 లక్షల రూపాయలలోపు | ఒక కోటి రూపాయల లోపు |
| రాష్ట్ర కమిషన్ | 20 లక్షల నుండి ఒక కోటి రూపాయల వరకు | ఒక కోటి నుండి 10 కోట్ల వరకు |
| జాతీయ కమిషన్ | కోటి రూపాయలకు మించిన ఫిర్యాదులు | 10 కోట్ల రూపాయలు మించిన ఫిర్యాదులు |

పరిధి పెంచటంలో అత్యధిక వినియోగదారుల వివాదాలు జిల్లా కమిషన్ పరిధిలోకి రానున్నాయి.

**ఫిర్యాదుల ఇ-ఫైలింగ్**

కొత్త చట్టం ప్రకారం వినియోగదారుడు తన నివాస స్థలంలో లేదా పనిచేసే ప్రదేశంలో ఉన్న అధికార పరిధిలో వినియోగదారుల ఫోరమ్‌లో ఫిర్యాదు చేయడానికి వీలు ఉంటుంది. మునుపటి చట్టం ప్రకారం కొనుగోలు చేసిన ప్రదేశంలో లేదా విక్రేత రిజిష్టర్ అయిన కార్యాలయ ప్రదేశంలో ఫిర్యాదు చేయాల్సి వచ్చేది.

ప్రస్తుత నూతన వినియోగదారుల పరిరక్షణ చట్టం, 2019 వినియోగదారులకు మరింత వెసులుబాటు కల్పించింది. అంతేకాకుండా వినియోగదారులు ఎలక్ట్రానిక్ మెయిల్ ద్వారా వీడియో కాన్ఫరెన్స్ ద్వారా ఫిర్యాదు చేసుకునే అవకాశం, పరిష్కరించుకునేందుకు వీలు కల్పించబడింది.

**సి.సి.పి.ఎ. (సెంట్రల్ కన్జ్యూమర్ ప్రొటెక్షన్ అథారిటీ) ఏర్పాటు**

కేంద్ర ప్రభుత్వం నూతన చట్టంలో భాగంగా సి.సి.పి.ఎ. (సెంట్రల్ కన్జ్యూమర్ ప్రొటెక్షన్ అథారిటీ) ఏర్పాటు చేసింది. ఇది అనైతిక వాణిజ్య పద్ధతులు నిరోధించుటలో కీలక పాత్ర వహించనుంది. తప్పుదోవ ప్రకటించే ప్రకటనదారులకు, తయారీదారుపైన ఎండార్సర్ పైన అధిక మొత్తంలో జరిమానాలు, లైసెన్స్ రద్దుతో పాటు జైలు శిక్షలు విధించే అవకాశం ఉంది. కనుక బ్రాండ్ అంబాసిడర్లుగా వ్యవహరించే సెలబ్రిటీలు బాధ్యతాయుతంగా ప్రవర్తించాల్సిన అవసరం ఎంతైన ఉంది.

**ప్రత్యామ్నాయ వివాద పరిష్కారానికి సదుపాయం**

నూతన వినియోగదారుల పరిరక్షణ చట్టం, 2019 'మధ్యవర్తిత్వం' (మీడియేషన్) అను ప్రత్యామ్నాయ వివాద పరిష్కారము అందిస్తుంది. ఇది వివాదాల వేగవంతమైన పరిష్కారానికి సహాయపడుతుంది, వినియోగదారుల కోర్టులపై ఒత్తిడిని తగ్గిస్తుంది.

**ఫిర్యాదుల పరిష్కార గణాంకాలు**

| వ.సం. | ఏజెన్సీ పేరు | ఇప్పటి వరకు నమోదు అయిన ఫిర్యాదుల సంఖ్య | పరిష్కారమైన ఫిర్యాదులు | పెండింగ్‌లో ఉన్న ఫిర్యాదులు | పరిష్కారమైన ఫిర్యాదుల శాతం |
|---|---|---|---|---|---|
| 1. | జాతీయ కమిషన్ | 132596 | 111597 | 20999 | 84.16 శాతం |
| 2. | రాష్ట్ర కమిషన్‌లు | 943620 | 818719 | 124901 | 86,76 శాతం |
| 3. | జిల్లా ఫోరమ్‌లు | 4301258 | 3959149 | 342109 | 92.05 శాతం |
| | **మొత్తం** | **5377474** | **4889465** | **488009** | **90.92 శాతం** |

(సంగ్రహణ : www.ncdre.nic.in)

**నేషనల్ కన్స్యూమర్ హెల్ప్‌లైన్ (ఎన్.సి.హెచ్)**

వినియోగదారుల సహాయార్థం "కేంద్ర వినియోగదారుల వ్యవహారాల మంత్రిత్వ శాఖ", భారత ప్రభుత్వం, నేషనల్ కన్జ్యూమర్ హెల్పైన్ (ఎన్.సి.హెచ్.)ను ప్రారంభించింది. వినియోగదారులు తమ రోజువారీ సమస్యలను పరిష్కరించుకోవడానికి ఇది ఎంతగానో ఉపయోగపడుతుంది.

ఎన్.సి. హెచ్. నేషనల్ టోల్ ఫ్రీ నెం. 1800-11-4000 నకు ఫోన్ చేయుట ద్వారా లేదా 918130009809కు ఎస్.ఎం.ఎస్. ద్వారా వినియోగదారులు సహాయం పొందవచ్చును.

**ఎన్.సి.హెచ్. సేవలు పలు రంగాలలో**

జి.యస్.టి., అడ్వర్టయిజ్ మెంట్, అగ్రికల్చరల్, ఎయిర్ లైన్స్, ఆటోమొబైల్స్, బ్యాంకింగ్, విద్యుత్తు, ఆహార భద్రత, ఇన్సూరెన్స్, న్యాయ, వైద్య, పోస్టల్, పెట్రోలియం, రిటైల్, ఈ-కామర్స్, ఎమర్జెన్సీ, టెలికాం మొదలగు వివిధ రంగాల వినియోగదారులు ఎన్.సి. హెచ్. సేవలను పొందవచ్చు. (వెబ్ సైట్: www.consumerhe lpline.gov.in)

**కన్జ్యూమర్ వెల్ఫేర్ ఫండ్ (సి.డబ్ల్యూ.ఎఫ్.)**

డిపార్ట్మెంట్ ఆఫ్ కన్జ్యూమర్ అఫైర్స్ 'సి.డబ్ల్యూ.ఎఫ్.'ను నిర్వహిస్తుంది. దీనియొక్క ప్రాథమిక లక్ష్యం- "భారతదేశంలోని వినియోగదారుల న్యాయవాద ఉద్యమాన్ని బలోపేతం చేయడం". వినియోగదారులలో అవగాహన పెంచడానికి, వినియోగదారుల రక్షణ, సంక్షేమాన్ని బలోపేతం చేయడానికి భారతదేశంలో పలు స్వచ్ఛంద వినియోగదారు సంస్థలు (వాలంటరీ కన్స్యూమర్స్ ఆర్గనైజేషన్స్) పని చేస్తున్నవి. వీటికి (సి.డబ్ల్యు. ఎఫ్.) కన్జ్యూమర్ వెల్ఫేర్ ఫండ్ నిధులను సమకూరుస్తుంది. ప్రభుత్వానికి, వినియోగదారులకు మధ్య పారదర్శకత పెంచుటలో ఇది ఎంతగానో తోడ్పడుతుంది.

**జాగో గ్రాహక్ జాగో**

వినియోగదారులలో 'వినియోగదారుల రక్షణ చట్టం' గురించి అవగాహన, చైతన్యం పెంచుటకు కేంద్ర వినియోగదారుల వ్యవహారాల మంత్రిత్వ శాఖ, భారత ప్రభుత్వం 'జాగో గ్రాహక్ జాగో" అనే ప్రాజెక్టును ఢిల్లీ కేంద్రంగా ప్రారంభించింది.

వినియోగదారులకు న్యాయపరమైన సలహాలు, ఫిర్యాదుల పరిష్కారంలో ఇది ఎంతగానో ఉపయోగ పడుతుంది. (www.jagograhakjago.com, E-mail : support@jagograhakjago.com)

మరింత చైతన్యం మన బాధ్యత

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రజా శ్రేయస్సుకు ఎన్నో పథకాలు,

# పశ్చిమాసియా కోసం మరో కూటమి

***ప్రపంచ దేశాలపై ఆధిపత్యం నిలుపుకోవడానికి అమెరికా తన చెప్పుచేతల్లో ఉండే దేశాలతో క్వాడ్-1, క్వాడ్-2 కూటములను ఏర్పాటుచేసి అందుకు భారతదేశాన్ని బలిపెడుతున్నదని అంటున్నారు* ఎ. నర్సింహారెడ్డి**

ఇవాళ ఆసియా ప్రాంతంలో ప్రపంచ భౌగోళిక రాజకీయాల ప్రాధాన్యత పెరిగింది. ఆసియాలో అమెరికా ఆధిపత్యానికి చైనా, రష్యా, ఇరాన్‌లు అడ్డుగా నిలిచాయి. అమెరికా దశాబ్ద కాలంగా ఆర్థిక సంక్షోభాన్ని ఎదుర్కొంటోంది. రోజు రోజుకు ఆసియా దేశాలపై దాని ప్రభావం కొడిగడుతోంది. అయినా అనేక ప్రపంచ దేశాల చేతుల్లో చావుదెబ్బలు తింటూనే తన ఆధిపత్యం కోసం, తన మార్కెట్‌ల విస్తరణకు అనేక కూటమిలను ఏర్పాటు చేస్తోంది. ఇటీవలనే ఆఫ్ఘనిస్తాన్‌పై రెండు దశాబ్దాల యుద్ధం నుండి 'చావు తప్పి కన్ను లొట్టబోయి' అన్న చందంగా పలాయనం చిత్తగించిన నేపథ్యంలో సామ్రాజ్యవాద అమెరికా అనేక నూతన ఎత్తుగడలతో ముందుకు వస్తోంది. అమెరికా అతిపెద్ద సైనిక శక్తిని కలిగి ఉన్నప్పటికీ ఆర్థికంగా, సాంకేతికంగా చైనా, రష్యాలతో పోటీపడలేక పోతోంది. ఆసియాపై తన ఆధిపత్యాన్ని నిలబెట్టుకోవడానికి నూతన కూటములను ఏర్పరచుకుంటోంది. చైనాను లక్ష్యంగా చేసుకుని ఆస్ట్రేలియా, ఇంగ్లాండ్, అమెరికాలు కలిసి సెప్టెంబర్ 15న సైనిక ఒప్పందం కుదుర్చుకున్న విషయం తెలిసిందే.

పశ్చిమాసియాలో భౌగోళిక రాజకీయాలు భారీ పరివర్తనకు లోనవుతున్నాయి. భారత విదేశాంగ మంత్రి జయశంకర్ ద్వైపాక్షిక చర్చల నిమిత్తం ఐదు రోజులు (అక్టోబర్ 17-21) ఇజ్రాయిల్‌ను సందర్శించాడు. ఇజ్రాయిల్ ప్రధాని నఫ్తాలి బెన్నెట్‌తో చర్చలు జరిపారు. అక్టోబర్ 18న అమెరికా, ఇజ్రాయిల్, భారత్, యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్ దేశాల విదేశాంగ మంత్రుల సమావేశం సగం ఆన్‌లైన్‌లోనూ, సగం ముఖాముఖి గానూ జరిగింది. ఈ సమావేశంతో పశ్చిమాసియాలో మరో కొత్త గ్రూపు ఆవిర్భవించింది. ఇజ్రాయిల్ ప్రధాని నఫ్తాలి బెన్నెట్ ప్రభుత్వంతో ద్వైపాక్షిక చర్చలు జరిపేందుకు భారత విదేశాంగ మంత్రి ఎస్. జయశంకర్ ఇజ్రాయిల్‌లో 5 రోజులు పర్యటిస్తున్న తరుణంలో ఈ సమావేశం జరగడం ప్రాధాన్యత సంతరించుకుంది. ప్రాంతీయంగా, గ్లోబల్ స్థాయిలో పరస్పరం సహకరించుకునే అంశాలైన వాణిజ్యం, వాతావరణ మార్పులు, ఇంధనం, సముద్ర జలాల భద్రత అంశాలతో పాటు ఆర్థిక, రాజకీయ రంగాలలో ఉమ్మడి కృషిని విస్తృతం చేసుకునే దిశలో చర్చలు జరిగాయని అమెరికా తెలిపింది. టర్కీ, రష్యా, ఇరాన్‌లను పశ్చిమాసియాలో కట్టడి చేయడానికి అమెరికా, ఇజ్రాయిల్, యుఎఇ, భారత్‌లు కలిసి ఈ కూటమిని ఏర్పాటు చేశాయి. దీనిని క్వాడ్-2 లేదా పశ్చిమాసియా కూటమిగా పేర్కొంటున్నారు.

పాలస్తీనా వివాదాన్ని పక్కన పెట్టి ఈ అరబ్బు దేశాలు ఇజ్రాయిల్‌తో స్నేహం నెరపడం ఆశ్చర్యకరమే. కానీ అంతర్జాతీయ రంగంలో వచ్చిన మార్పుకు ఇది నిదర్శనం. క్వాడ్-2 ఆర్థిక కూటమి మాత్రమేనని ఇటీవల ఇజ్రాయిల్ స్పష్టం చేసినప్పటికీ దీని వెనుకున్న రాజకీయం దాచిపెట్టలేనిది. అగ్రరాజ్యంగా పెత్తనం చేసిన అమెరికా క్రమంగా బలహీనపడుతున్నది. ఇండో పసిఫిక్‌లో చైనాను ఎదుర్కొంటూ పశ్చిమాసియాపై పూర్తి స్థాయి ఆధిపత్యం చెలాయించలేకపోతున్నది. దీంతో ఇరాన్ ప్రాబల్యం పెరిగే అవకాశాలున్నాయి. మరోవైపు ఇంతకాలం అమెరికా మిత్రదేశంగా ఉన్న టర్కీ ఇప్పుడు సొంత విదేశాంగ విధానం అనుసరిస్తూ, పశ్చిమాసియాలోకి చొచ్చుకువస్తున్నది. రష్యా, చైనాల ప్రాబల్యం పశ్చిమాసియాలో పెరుగుతున్నది.

ప్రపంచ దేశాల సహజ వనరులను కొల్లగొట్టడానికి, ఆ దేశాలపై ఆధిపత్యం నెలకొల్పడానికి సామ్రాజ్యవాద దేశాల మధ్య (అమెరికా, చైనా, రష్యా) వైరుధ్యాలు రోజు రోజుకు తీవ్రమవుతున్నాయి. వీటికి ఇప్పుడు ఆసియా ఖండం కేంద్రంగా మారింది. పశ్చిమాసియా భౌగోళికంగా యూరప్, ఆఫ్రికా, మధ్య ఆసియా, దక్షిణాసియా దేశాలకు సమీపంలో ఉన్న కారణంగా అంతర్జాతీయంగా ప్రాధాన్యతను సంతరించుకుంది. పశ్చిమాసియా అబ్రహమిక్ మతాల కేంద్రం. ఈ ప్రాంతం వ్యూహాత్మకంగా ముఖ్యమైనది, ఎందువల్లనంటే ఆపారమైన ఇంధన వనరులు కలిగి ఉండటమే కాక ప్రపంచంలోని వివిధ ప్రాంతాలకు వాణిజ్య మార్గం లింకులు కలిగిఉంది. ఈ ప్రాంతం ప్రపంచ ముడి చమురు ఉత్పత్తిలో 34 శాతం, చమురు ఎగుమతుల్లో 45 శాతం, గుర్తించిన చమురు నిల్వలలో 48 శాతం కలిగి ఉన్న కారణంగా సామ్రాజ్యవాద దేశాలు మొత్తంగా పశ్చిమాసియాను రెండవ ప్రపంచ యుద్ధ కాలం నాటి నుంచి చాలవరకు బాహ్య శక్తుల ప్రమేయం వల్ల, అంతర్గత వైరుధ్యాల వల్ల అస్థిరతతో నిత్యం రక్తమోడుతోంది.

1990లో సోవియట్ యూనియన్ పతనానంతరం అమెరికా ఏకైక

---

చట్టాలు తీసుకువస్తున్నప్పటికీ అవి అమలు అవడంలో తడబాటుకు ప్రధాన కారణం ప్రజల అవగాహన రాహిత్యం, చైతన్య లేమి అనేవి పలు పరిశోధనలలో ఋజువైనది.

నేటి టెక్నాలజీ యుగంలో కూడా కన్జూమర్ ఎడ్యుకేషన్ (వినియోగదారుల విద్య) అనేది ఒక సవాలుగా మారింది. దీనిని అధిగమించుటకు కార్పొరేట్ వర్గాలు, ప్రభుత్వాలు, మీడియాతోపాటు విద్యాలయాలు, స్వచ్ఛంద సంస్థలు, విద్యావంతులు దీనిని ఒక సామాజిక బాధ్యతగా తీసుకోవలసిన ఆవశ్యకత ఎంతైన ఉంది.

*(రచయిత సహాయ ఆచార్యులు, ఎంబిఏ విభాగం, వాగ్దేవి కాలేజ్ ఆఫ్ ఇంజనీరింగ్, వరంగల్)* వీ

అగ్ర రాజ్యంగా ప్రపంచాధిపత్యం చలాయించగలనన్న ఆశలకు చైనా కళ్లెం వేస్తోంది. అన్ని రంగాలలో ప్రపంచ మార్కెట్‌లో అమెరికాకు అతిపెద్ద పోటీదారుగా చైనా సోషల్ సామ్రాజ్యవాదం ముందుకొచ్చింది. ఈ నేపథ్యంలో భారత్‌ను చైనాకు వ్యతిరేకంగా నిలిపేందుకు అమెరికా తీవ్రంగా ప్రయత్నిస్తోంది. భారత్ అందుకు సుముఖంగానే అడుగులు వేస్తోంది. చైనాతో భారత్ సరిహద్దు సమస్య కొలిక్కి రాకూడదని అమెరికా కోరుకుంటోంది. అందువల్లనే మీడియా ద్వారా చైనా వ్యతిరేకతను పెద్ద ఎత్తున ప్రచారం చేస్తోంది. భారత్ చైనాపై వ్యతిరేకతతో అమెరికాతో జూనియర్ భాగస్వామిగా వ్యవహరిస్తోంది. ఇది మన విదేశాంగ విధానానికి, దేశ ప్రయోజనాలకు శ్రేయస్కరం ఏమాత్రం కాదు. సరిహద్దు వివాదాలు యుద్ధం ద్వారా కాకుండా చర్చల ద్వారా, దౌత్యపరంగా పరిష్కరించు కోవడం ఉత్తమ మార్గం. భారతీయ జనతా పార్టీ పార్లమెంటులో ఎదురులేని మెజారిటీతో అధికారం చేపట్టిన తర్వాత దేశ విదేశీ విధానపరమైన గమనంలో పూర్తి మార్పు వచ్చింది.

యుపిఎ ప్రభుత్వం అమెరికాతో శాంతియుత అణు సహకార ఒప్పందాన్ని కుదుర్చుకున్నప్పటికీ దానితో గాఢంగా పెనవేసుకునే విషయంలో ఇండియా జాగ్రత్తగా అడుగు వేసేది. ప్రధాని మోడీ నాయకత్వంలో బిజెపి వరుసగా రెండోసారి అధికారం చేపట్టిన తర్వాత అమెరికా తన వైపు మూడడుగులు వేయమంటే భారత్ అరడుగులు వేసే పరిస్థితి ఇప్పుడు నెలకొన్నది. డోనాల్డ్ ట్రంప్ అమెరికా అధ్యక్షుడుగా ఉన్నప్పుడు మన ప్రధాని మోడీ ఆయనతో ఎంత సన్నిహిత సంబంధాలు పెట్టుకున్నారో తెలిసిందే. జో బైడెన్ అధికారంలోకి వచ్చిన తర్వాత కూడా అమెరికాతో అదే మైత్రిని భారత్ కొనసాగిస్తోంది. ట్రంప్ హయాంలో అమెరికా మన వాణిజ్య ప్రయోజనాలను దెబ్బతీసే నిర్ణయాలను తీసుకున్నది. వాణిజ్య ప్రాధాన్య దేశాల జాబితా నుంచి భారత్‌ను తొలగించింది. దాని ప్రభావం వల్ల మన ఎగుమతులపై అమెరికా సుంకాలు బిగించింది. అయినప్పటికీ మనం దానితోనే చెట్టపట్టాలేసుకొని నడిచాము.

జో బైడెన్ 2021 జనవరిలో అమెరికా అధ్యక్షుడిగా బాధ్యతలు స్వీకరించిన తర్వాత ఇండో-పసిఫిక్ జలాల్లో చైనా ప్రాబల్య కాంక్షను ప్రతిఘటించే లక్ష్యంతో ఏర్పరచిన కూటమి (క్వాడ్-1)లో అమెరికా, ఆస్ట్రేలియా, జపాన్‌లతో కలిసి భారత్ గత మార్చ్‌లో చేరింది. ఇప్పుడు పశ్చిమాసియా కూటమి (క్వాడ్-2)లో కూడ చేరింది. పశ్చిమాసియాలో అమెరికా ఎత్తుగడలకు మద్దతుగా ఇజ్రాయిల్- భారత్ కూటమి మరింత తోడ్పడనుంది. ప్రధాని మోడీ ఆధ్వర్యంలో ఇజ్రాయిల్‌తో ఈ వ్యూహాత్మక పొత్తును భారత్ మరింత ముందుకు తీసుకెళ్లనుంది. ఇజ్రాయిల్‌తో భారత్‌కు సన్నిహిత భద్రత, సైనిక సమాచారం పునాదిగా ఉంది. భారత్‌కు పెద్ద మొత్తంలో రక్షణ సరఫరాలను భద్రతా పరికరాలను అందచేసే దేశాల్లో ఇజ్రాయిల్ ఒకటి. హిందూత్వ, యూదు తీవ్రవాదానికి మధ్య గల సైద్ధాంతిక సంబంధాలు ఇందుకు సుస్థిరమైన కారణంగా ఉన్నాయి.

**యుఎఇ-ఇజ్రాయిల్-అబ్రహాం అకార్డ్స్**

అమెరికా మాజీ అధ్యక్షుడు డొనాల్డ్ ట్రంప్ అతిథ్యంలో 2020, సెప్టెంబర్ 15న నూతన 'అరబ్ యూదు' శాంతి ఒప్పందానికి వైట్ హౌస్ వేదిక అయింది. అరబ్ దేశాలైన యుఎఇ, బహ్రయిన్‌లు యూదు దేశమైన ఇజ్రాయిల్‌తో శాంతి ఒప్పందం చేసుకున్నాయి. ఈ ఒప్పందం 'అబ్రహాం ఎకార్డ్స్' పేరుతో పిలవబడుతోంది. ఇది దాదాపు 26 సంవత్సరాల తర్వాత కుదిరిన మొట్టమొదటి అరబ్ - యూదు శాంతి ఒప్పందం. 1967 నాటి అరబ్-ఇజ్రాయిల్ యుద్ధం తర్వాత 1979లో మొదటిసారి ఇజ్రాయిల్-ఈజిప్టు మధ్య మొదటి అరబ్-యూదు శాంతి ఒప్పందం కుదిరింది. ఆ తర్వాత 1994లో ఇజ్రాయిల్‌తో శాంతి ఒప్పందం చేసుకున్న అరబ్ దేశం జోర్డాన్. ఈ వరుసలో అబ్రహాం ఎకార్డ్స్ ద్వారా యుఎఇ, బహ్రయిన్‌లు ఇజ్రాయిల్‌తో మూడవ అరబ్. యూదు శాంతి ఒప్పందం చేసుకున్నాయి.

అబ్రహాం ఎకార్డ్స్ ప్రకారం యుఎఇ, బహ్రయిన్‌లు ఇజ్రాయిల్‌లో ఎంబసీలు తెరవాలి. రాయబారులను నియమించాలి. టూరిజం, వాణిజ్యం, ఆరోగ్య, భద్రతా రంగాలలో ఇజ్రాయిల్‌తో కలిసి పని చేయాలి. ఎకార్డ్స్‌లో పాలస్తీనా హక్కుల గురించిన ప్రస్తావన లేదు. అబ్రహాం ఎకార్డ్స్, పాలస్తీనా ప్రయోజనాలకు నేరుగా వ్యతిరేకంగా ఎక్కుపెట్టబడింది. పాలస్తీనాకు మాత్రమే కాక ఇజ్రాయిల్ శాశ్వత శత్రువుగా భావించే ఇరాన్‌కు వ్యతిరేకంగా, ప్రాంతీయ ఆధిపత్యం కోసం పోటీపడుతూ సిరియా, లిబియా, ఆఫ్ఘనిస్తాన్‌లలో వేలు పెట్టిన టర్కీ వ్యూహాలకు వ్యతిరేకంగా ఈ కూటమి ఏర్పడింది. అదే సమయంలో క్రమంగా అమెరికాకు దూరం అవుతూ రష్యాకు దగ్గర కావడానికి ప్రయత్నిస్తున్న సౌదీ అరేబియాకు వ్యతిరేకంగా కూడ అబ్రహాం ఎకార్డ్స్ ఎక్కుపెట్టబడిందని స్పష్టం అవుతున్నది.

**ఉద్రిక్తతలు పెంచుతున్న సైప్రస్ సమావేశం**

అబ్రహాం ఎకార్డ్స్ కొనసాగింపుగా ఏప్రిల్ 14-15, 2021 తేదీలలో జో బైడెన్ ప్రోత్సాహంతో యుఎఇ, ఇజ్రాయిల్, గ్రీసు, సైప్రస్ దేశాల విదేశాంగ మంత్రులు పాఫోస్ (సైప్రస్) నగరంలో సమావేశం అయ్యారు. "ఈ వ్యూహాత్మక భాగస్వామ్యం సభ్యత్వం అరేబియన్ గల్ఫ్ తీరాల నుండి మధ్యధరా, ఐరోపాల వరకు విస్తరించింది" అని ఇజ్రాయిల్ విదేశీ మంత్రి గాబి అష్కెనాజీ ప్రకటించగా, "మా సమావేశం మధ్యప్రాచ్యం మారుతున్న ముఖానికి గుర్తుగా నిలుస్తుంది. ఇజ్రాయిల్‌తో సంబంధాలు ప్రత్యామ్నాయ వ్యూహాత్మక దృక్పథానికి ప్రతీక" అని యుఎఇ ప్రతినిధి అన్వర్ గర్గాష్ ప్రకటించాడు. 1970ల మధ్యలో గ్రీసు ప్రోత్సాహంతో జరిగిన సైనిక కుట్రకు వ్యతిరేకంగా టర్కీ తన సైన్యాలను సైప్రస్‌లోకి నడిపించి మూడవ వంతు భూభాగాన్ని తన నియంత్రణలోకి తెచ్చుకుంది. ఫలితంగా మధ్యధరా సముద్రంలోని సైప్రస్ ద్వీపం గ్రీసు, టర్కీల మధ్య గ్రీక్ సైప్రస్, టర్కిష్ సైప్రస్‌లుగా విభజించబడి ఉంది. తూర్పు మధ్యధరా సముద్రంలోని అపారమైన చమురు నిల్వల కోసం గ్రీసు, టర్కీల మధ్య సైప్రస్ వివాదం కొనసాగుతోంది. సైప్రస్ ఏకీకరణకు గ్రీసు డిమాండ్ చేస్తుంటే, రెండు వేరు వేరు దేశాల ఉనికిని గుర్తించాలని టర్కీ డిమాండ్ చేస్తోంది.

టర్కీ నాటో సభ్య దేశమైనప్పటికీ పశ్చిమ దేశాల ఆదేశాలను పెద్దగా పట్టించుకోలేదు. అధ్యక్షుడు రెసిప్ తయ్యిప్ ఎర్డోగాన్ టర్కీ ప్రాంతీయ ఆధిపత్యం కోసం కృషి చేస్తూ సిరియా, లిబియాలకు తన సైన్యాన్ని పంపింది. టెర్రరిస్టులకు, ఇరాన్‌కు మద్దతు ఇస్తోందన్న సాకుతో 2017లో కతార్ పై సౌదీ అరేబియా, ఇతర గల్ఫ్ దేశాలు దిగ్బంధనం ప్రకటించినప్పుడు టర్కీ కతార్‌కు మద్దతుగా నిలిచింది. ఇది యుఎఇకి కంటగింపు అయింది. టర్కీ, కతార్‌ల మద్దతుతో ఇస్లామిక్ సంస్థ 'ముస్లిం బ్రదర్ హుడ్' ద్వారా తమ దేశాల్లో అసంతృప్తి

రేపి తీవ్రవాద చర్యలకు పాల్పడతారని గల్ఫ్ రాచరిక ప్రభుత్వాలు, ముఖ్యంగా యుఎఇ భయపడుతున్నాయి. ఈ నేపథ్యంలో ఇజ్రాయిల్‌తో పాటు యుఎఇని కూడా మధ్యప్రాచ్యంలో తన ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించే మరో ప్రాంతీయ శక్తిగా నిలిపేందుకు అమెరికా సైప్రస్ సమావేశాన్ని నిర్వహించింది. ఈ విధంగా పాత శతృత్వాలను, కొత్త మిత్రుత్వాలను కలగలిపి నూతన భౌగోళిక-రాజకీయ వేదికను అమెరికా అంకురార్పణ చేసింది. యుఎఇ, ఇజ్రాయిల్‌లు ప్రాంతీయ ఆధిపత్యం కోసం, అమెరికా ప్రపంచాధిపత్యం పునరుద్ధరణ కోసం ఈ నూతన వేదికలో భాగం అవుతున్నాయి.

సైప్రస్ సమావేశంలో పాల్గొన్న నాలుగు దేశాలకూ చాలాకాలంగా టర్కీతో విభేధాలు ఉన్నాయి. యుఎఇ, ఇజ్రాయిల్ పాల్గొన్న ప్రతి సమావేశంలో ఇరాన్ గురించి తప్పనిసరిగా చర్చ జరుగుతుంది. ఇక టర్కీ దూకుడు అమెరికాకు అసలే గిట్టదు. సైనిక కుట్ర ద్వారా ఎర్డోగన్‌ను పదవీచ్యుతుడిని చేసేందుకు జూలై 2016లో అమెరికా విఫలయత్నం చేసింది. రష్యా గూఢచార సమాచారంతో ఎర్డోగన్ కుట్ర నుండి బైట పడ్డాడు. సైప్రస్ సమావేశాల్లోనే ఇజ్రాయిల్, గ్రీసులు అతి పెద్ద రక్షణ ఒప్పందం చేసుకున్నాయి. దీని ప్రకారం ఇజ్రాయిల్ డిఫెన్స్ కంపెనీ ఎల్బిట్ సిస్టమ్స్, 22 సం.ల కాలం పాటు 1.65 బిలియన్ల డాలర్ల మేర హెలెనిక్ ఎయిర్ ఫోర్స్ (గ్రీసు వైమానిక బలగం)కు ట్రైనింగ్ సెంటర్లు నిర్వహిస్తుంది. ఇటలీ కంపెనీ "లియోనార్డో" తయారుచేసిన వీ-346 శిక్షణ విమానాలు పదింటిని ఇందుకు వినియోగిస్తారు.

ఇక గ్రీసు యుఎఇలు నవంబర్ 2020లోనే 'వ్యూహాత్మక భాగస్వామ్యం' ఒప్పందం చేసుకున్నాయి. తద్వారా విదేశీ విధానం రక్షణ రంగంలో సహకరించుకోవాలని నిర్ణయించాయి. ఇది నేరుగా టర్కీకి వ్యతిరేకంగా ఉద్దేశించిందన్నది స్పష్టమే. 2018 నుండి గ్రీకు నేతృత్వంలో జరుగుతున్న మిలట్రీ డ్రిల్లులో అమెరికా, ఇజ్రాయిల్, సైప్రస్‌లతో పాటు యుఎఇ పాల్గొంటోంది. టర్కీ, తూర్పు మధ్యధరా సముద్రంలో వేలు పెట్టడానికి వ్యతిరేకంగా సైప్రస్, గ్రీస్, ఫ్రాన్స్, ఈజిప్టుల ఉమ్మడి అవగాహనలో యుఎఇ బాగస్వామి అయింది. ఈ విధంగా గ్రీసు, ఇజ్రాయిల్, యుఎఇ దేశాల ప్రయోజనాలు టర్కీ విస్తరణవాదానికి వ్యతిరేకంగా ఐక్యం అవుతుండగా, దీనికి అమెరికా పూర్తి మద్దతు అందిస్తోంది. ఈ అమెరికా మద్దతు టర్కీకి మరింత కంటగింపు అవుతోంది. టర్కీ క్రమంగా రష్యా వైపు జరిగేందుకూ, ఇరాన్, కతార్ లాంటి దేశాలతో ప్రతీకార కూటమి ఏర్పరిచేందుకు దోహదం చేస్తోంది. ఈ క్రమంలో రష్యా నుండి ఎస్-400 క్షిపణులను టర్కీ కొన్నందుకు ప్రతిస్పందనగా టర్కీకి అమెరికా ఎఫ్-35 విమానాల అమ్మకపు ఒప్పందాన్ని రద్దు చేసింది.

సౌది అరేబియా గతంలో లాగా ప్రాంతీయ, అంతర్జాతీయ రాజకీయాలను ప్రభావితం చేయలేని స్థితికి చేరుకుంది. ఈ స్థితిలో అమెరికా సౌది నుంచి రియాజ్‌లోని వాయు రక్షణ వ్యవస్థ - మిసైల్ రక్షణ వ్యవస్థలను ఉపసంహరించుకుంది. పశ్చిమాసియాలో అమెరికా ప్రత్యక్షంగా లేని లోటును యుఎఇ ద్వారా భర్తీ చేయాలనుకుంటోంది. ఈ విధంగా అమెరికా తన ప్రాముఖ్యత తగ్గకుండా చూసుకునే వ్యూహాన్ని అనుసరిస్తోంది. పశ్చిమాసియా కూటమి ఏర్పాటుకు ముందే అమెరికా, ఇజ్రాయిల్, యుఎఇలు అక్టోబర్ 13న వాషింగ్టన్‌లో సమావేశం కావడం గమనార్హం. ఇందులో త్రైపాక్షిక సహకారం గురించి చర్చించినట్లు తెలుస్తోంది. ఈ సందర్భంగా భిన్న మతాల సహజీవనం, నీరు - ఇంధనం అంశాలపై రెండు వర్కింగ్ గ్రూపులు కూడా ఏర్పాటు చేసినట్లు ప్రకటించారు. ఆ తర్వాతనే ఇండియాతో ఇజ్రాయిల్‌లో సమావేశమై చతుర్భుజ కూటమిని ప్రకటించారు. ఈ నేపథ్యంలో నూతన క్వాడ్ కూటమిలో ఇండియాకు ఉన్న ప్రాముఖ్యత ఏమిటా అన్నది ఒక ప్రశ్నగా మారింది. ఆకస్ ప్రకటన వెలువడ్డాక అమెరికా దృష్టిలో ఇండియాకు (ఆ మాటకొస్తే జపాన్‌కు కూడా) ఉన్న ప్రాముఖ్యత అలంకార ప్రాయమే అన్న అభిప్రాయం స్థిరపడింది.

అబ్రహాం ఎకార్డ్స్ దరిమిలా యుఎఇ, ఇజ్రాయిల్ మధ్య దౌత్య, వాణిజ్య సంబంధాలు ఏర్పడ్డాక గత యేడాది కాలంగా ఇండియా-ఇజ్రాయిల్- యుఎఇ దేశాలలోని వాణిజ్య కంపెనీల గ్రూపులు వివిధ వేదికలపై చర్చలు జరిపాయి. కానీ ఈ చర్చలు యుఎఇ, ఇజ్రాయిల్ లకు లాభించినంతగా ఇండియాకు ఒనగూరే ప్రయోజనం ఏమి లేదు. ఉదాహరణకి ఇంటర్నేషనల్ ఫెడరేషన్ ఆఫ్ ఇండో-ఇజ్రాయిలీ చాంబర్స్ ఆఫ్ కామర్స్(ఐఎఫ్ఐఐసి) ప్రకారం ఇజ్రాయిల్ నూతన ఆవిష్కరణలు, యుఎఇ నిధులు, ఇండియా మాన్యుఫాక్చరింగ్ రంగ పునాది ఈ మూడింటి కలయిక ద్వారా 2030 లోపు 100 బిలియన్ డాలర్ల మేర వాణిజ్యం జరిగే అవకాశం ఉందనేది ఒక అంచనా. ఇందులో ఇండియాకు లభించే వాటా ఏమిటో తెలియదు. అయితే ఇండియాలో మాన్యుఫాక్చరింగ్ పునాది కలిగిన ఇజ్రాయిలీ కంపెనీ ఎకోప్పియా ద్వారా రోబోటిక్ సోలార్(పానెల్) క్లీనింగ్ టెక్నాలజీ అభివృద్ధికై యుఎఇ ఒక ప్రాజెక్టు తలపెట్టినట్లు తెలుస్తోంది. అయితే ఈ కంపెనీలో వాటాలన్నీ అమెరికన్ ఇజ్రాయిలీల కంపెనీలవే. కనుక ఈ ప్రాజెక్టు లబ్ధిదారులు అంతిమంగా అమెరికా, ఇజ్రాయిల్, యుఎఇల బిలయనీర్లే తప్ప భారత ప్రజలు కాదు. ఈ కంపెనీలో మొత్తం ఉద్యోగులే 150 మంది. దరిమిలా ఇండియాకు లభించే ఉపాధి నామమాత్రం.

### దశాబ్దాల అరబ్-యూదు శతృత్వం

అరబ్ - యూదు శతృత్వానికి దశాబ్దాల చరిత్ర ఉంది. మొదటి ప్రపంచ యుద్ధంలో ఒట్టోమాన్ సామ్రాజ్యం ఓటమి చెందాక సైక్స్-పికోటా ఒప్పందం ద్వారా బ్రిటన్, ఫ్రాన్స్‌లు ఒట్టోమాన్ రాజ్యాన్ని పంచుకున్నాయి. యూదులకు సొంత దేశం ఏర్పాటు చేస్తానని అప్పుడే బ్రిటన్ ప్రకటించి పాలస్తీనాను లీగ్ ఆఫ్ నేషన్స్ పెత్తనానికి అప్పగించింది. బ్రిటన్ ప్రకటనతో పశ్చిమాసియాలో అరబ్బు ప్రాంతాలు, రాజ్యాలు యూదు రాజ్యం ఏర్పాటుకు వ్యతిరేకంగా సంఘటితం అయ్యాయి. అరబ్-యూద్ శతృత్వానికి కారణం ఇజ్రాయిల్ పాలస్తీనా భూభాగాన్ని దురాక్రమించడం. కానీ అరబ్బుల అంతఃకలహాలు, అనైక్యతలను ఉపయోగించుకుని 1948, మే 14న యూదు రాజ్యం ఇజ్రాయిల్ ఏర్పాటు చేయడంలో పశ్చిమ రాజ్యాలు సఫలం అయ్యాయి. ఇజ్రాయిల్ ఏర్పాటుతో ప్రపంచం నలుమూలల నుండి యూదులు పాలస్తీనా చేరుకున్నారు. పశ్చిమ దేశాల సహాయంతో పాలస్తీనా ప్రజల భూములు, ఇళ్లను లాక్కొని వెళ్లగొట్టారు. పాలస్తీనా అరబ్బులు చుట్టుపక్కల అరబ్బు దేశాలకు శరణార్థులుగా వలస వెళ్లి ఇప్పటికీ అక్కడే శిబిరాల్లో తలదాచుకుని బ్రతుకుతున్నారు. తిరిగి తమ స్వంత భూములకు చేరుకునే అవకాశం కోసం ఎదురు చూస్తున్నారు.

ఈ నేపథ్యంలో అరబ్ దేశాలు, ఇజ్రాయిల్ మధ్య 3 యుద్ధాలు

జరిగాయి. ఈ యుద్ధాల్లో అరబ్బు దేశాలు ఘోర ఓటమి పాలైనాయి. క్రమంగా అమెరికా, పశ్చిమ ఐరోపా రాజ్యాల ఒత్తిడితో అరబ్బు దేశాలు ఒక్కొక్కటి ఇజ్రాయిల్ అమెరికా ప్రలోభాలకు తలొగ్గి పాలస్తీనా ప్రజలకు ద్రోహం చేస్తూ వచ్చాయి. ఫలితంగా బిల్ క్లింటన్ అరబ్బు నేత యాసర్ అరాఫత్ అనేక పరిమితులతో, షరతులతో, పరిమిత భూభాగంతో (1967 నాటి సరిహద్దులతో కూడిన వెస్ట్ బ్యాంక్, గాజా) "ఓస్లో ఒప్పందం" కుదుర్చుకున్నాడు. ఇజ్రాయిల్ ఆధిపత్యానికి లోబడి 'పాలస్తీనా ఆథారిటీ' పేరుతో పాలస్తీనా ప్రభుత్వం ఏర్పరిచాడు. కానీ ఓస్లో ఒప్పందాన్ని మరుసటి రోజు నుండే ఇజ్రాయిల్ బుట్ట దాఖలు చేసింది. తూర్పు జెరూసలేంతో సహా, వెస్ట్ బ్యాంక్‌లో భూములు, నివాసాలు, నీటి వనరులు దురాక్రమించి యూదు సెటిల్మెంట్లు నిర్మిస్తూ వచ్చింది. పాలస్తీనాపై ఇజ్రాయిల్ యూదు దురహంకార వలసాధిపత్యం కొనసాగుతోంది.

**పాలస్తీనా పట్ల మారిన భారత్ వైఖరి**

2014 వరకు అరబ్ దేశాల పక్షాన నిలిచి ముఖ్యంగా పాలస్తీనాకు మద్దతుగా ఉంటూ ఇజ్రాయిల్‌ను దూరంగా ఉంచింది. గత విదేశాంగ విధానానికి తూట్లు పొడుస్తూ ఇజ్రాయిల్‌తో మైత్రిని నెలకొల్పుకొని సంయుక్త వైమానిక దళ విన్యాసాల్లో కూడా పాల్గొంది. యూదు దురహంకార ఇజ్రాయిల్‌తో వ్యూహాత్మక, మిలిటరీ భాగస్వామ్యం కుదుర్చుకున్న మోడీ ప్రభుత్వం దానిని మరింత పటిష్టపరచు కునేందుకు యత్నిస్తోంది. దీనిలో భాగంగానే విదేశాంగ మంత్రి జయశంకర్ ఇజ్రాయిల్‌లో అయిదు రోజుల పర్యటనకు వెళ్లారు. మానవ హక్కుల ఉల్లంఘనలో ప్రపంచంలో నెంబర్ వన్ అని ఐరాస మానవ హక్కుల కమిషన్‌తో సహా పలు సంస్థలచే విమర్శలు ఎదుర్కొంటున్న ఇజ్రాయిల్‌ను విదేశాంగ మంత్రి ఆకాశానికెత్తేశారు. జయశంకర్ మాట్లాడుతూ భారత్, ఇజ్రాయిల్‌లు తమ దేశాలకు ఎదురవుతున్న రాడికలిజం, తీవ్రవాదం, భౌగోళిక రాజకీయ భూభాగంలో అభివృద్ధి చెందుతున్న ఇతర పరిణామాల నుంచి ఎదురవుతున్న సవాళ్లను పంచుకుంటున్నాయని అన్నారు.

పాలస్తీనీయులను ఊచకోత కోసిన అతిపెద్ద తీవ్రవాద రాజ్యం అయిన ఇజ్రాయిల్‌ను తీవ్రవాద బాధితురాలిగా జయశంకర్ పేర్కొనడం విడ్డూరంగా ఉంది. ఆర్ఎస్ఎస్ ఎజెండాలో భాగంగానే ఇజ్రాయిల్‌ను మోడీ 2017లో పర్యటించి ఆ దేశంతో వ్యూహాత్మక, సైనిక భాగస్వామ్యం కుదుర్చుకున్నారు. యూదు జాతిదురహంకార ఇజ్రాయిల్‌లో పర్యటించిన మొదటి భారత ప్రధాని మోడీనే. ఇజ్రాయిల్‌ను సందర్శించిన ఆయన దీర్ఘకాలంగా భారత్ సంఘీభావం తెలుపుతూ వస్తున్న పాలస్తీనాను సందర్శించడానికి తిరస్కరించారు. ఇప్పుడు ఇజ్రాయిల్‌తో స్వేచ్ఛా వాణిజ్య ఒప్పందం కుదుర్చుకునే వైపు అడుగులు వేస్తోంది. 2022 జూన్ నాటికి దీనిపై సంతకాలు చేయాలని నిర్ణయించుకున్నారు. ఈ విధంగా విదేశాంగ విధానంలో మనం పూర్తిగా అమెరికా వైపు మళ్లిపోయాము. ఇరుగుపొరుగు దేశాలతో సత్సంబంధాలను పెంచుకోవడం ద్వారా మన భద్రతను మెరుగుపరుచుకొనే విజ్ఞతాయుత వైఖరికి స్వస్తి చెప్పాం. పాకిస్తాన్, చైనాలతో గల వైరాన్ని ఆసరా చేసుకొని దేశంలో జనాభిప్రాయాన్ని తనకు మరింత అనుకూలంగా మలచుకోవడం ద్వారా ఎన్నికల విజయాలకు ఢోకాలేని పరిస్థితిని సృష్టించుకోవడమే లక్ష్యంగా కేంద్రంలోని బిజెపి ప్రభుత్వ విదేశీ విధానం రూపుదిద్దుకుంటున్నదనే అభిప్రాయానికి అవకాశం కలుగుతున్నది.

**ముగింపు**

ఇజ్రాయిల్, యుఎఇ, అమెరికాలతో కుదిరిన చతుర్భుజ ఒప్పందం వల్ల మధ్య ఆసియాతో భారత వాణిజ్య సంబంధాలు మెరుగుపడే అవకాశాలు ఏమాత్రం లేవు. ఆ ప్రాంతంలో ఇరాన్‌కున్న విశేష ప్రాధాన్యాన్ని దానితో మనకు గల గత, ప్రస్తుత సంబంధాలను కూడా ఈ సందర్భంలో పరిగణనలోకి తీసుకోవలసి ఉంటుంది. ఆఫ్ఘనిస్తాన్ నుంచి అమెరికా ఉపసంహరించుకున్న తర్వాత అక్కడి ప్రభుత్వం నుంచి మనకు ఎదురయ్యే సవాళ్లను అధిగమించడానికి ఇరాన్‌తో సత్సంబంధాలు ఎంతో అవసరం. అమెరికా, ఇజ్రాయిల్ రెండింటితోనూ ఇరాన్‌కు సంబంధం ఉప్పు నిప్పులా ఉంది. ఇరాన్ నుంచి మనం గతంలో గణనీయంగా ప్రయోజనం పొందాము. ట్రంప్ ప్రభుత్వం తీవ్రమైన ఆంక్షలు విధించక ముందు ఇరాన్ నుంచి మనం ప్రతి నెలా 2.5 బిలియన్ టన్నుల చమురును దిగుమతి చేసుకునే వాళ్లము. అమెరికా ఇరాన్‌పై విధించిన ఆంక్షల మూలంగా దాని నుంచి ఆయిల్ దిగుమతులను మోడీ ప్రభుత్వం తగ్గించుకున్నది. అమెరికా, ఇజ్రాయిల్, యుఎఇలతో కుదుర్చుకున్న తాజా ఒప్పందం వల్ల ఇరాన్‌తో మన సంబంధాలు శత్రు పూరితంగా మారవచ్చు.

నేటి సమకాలీన భౌగోళిక రాజకీయాలను మలుపు తిప్పే కీలక ఘట్టాలుగా క్వాడ్-1, ఆకస్, క్వాడ్-2 కూటములను పేర్కొనవచ్చు. వీటివల్ల రాబోయే కాలంలో రాజకీయాలలో ముఖ్యంగా ఇండో-పసిఫిక్, పశ్చిమాసియా ప్రాంతాలలో నూతన పరిణామాలు చోటు చేసుకునే అవకాశాలున్నాయి. అమెరికాకు వ్యతిరేకంగా రష్యా- చైనా- ఇరాన్ దేశాల మైత్రి బలపడనుంది. ఐ.రా.స. నేతృత్వంలో కుదిరిన ఆయుధ నియంత్రణ, నిరాయుధీకరణలకు పూర్తిగా స్వస్తిచెప్పి, 1971 అణ్వాయుధ వ్యాప్తి నిరోధక సంధి, దక్షిణ పసిఫిక్ ప్రాంతాన్ని అణ్వస్త్ర రహిత జోన్‌గా ప్రకటించిన 1985 'రారొతోంగా' ఒప్పంద సూత్రాలకు వ్యతిరేకంగా, ఈ కూటములు ఆయుధ పోటీకి దారితీయగలవు. ఇప్పుడున్న ప్రచ్ఛన్న యుద్ధ వాతావరణం ముందు ముందు మూడవ ప్రపంచ యుద్ధానికి దారితీసిన ఆశ్చర్యపడవలసినదేమి లేదు. యుద్ధాలు, ఆయుధ విక్రయాలు సామ్రాజ్యవాదుల ఉనికికి అవసరం. అందువల్లనే లెనిన్ 'సామ్రాజ్యవాదం అంటే యుద్ధం' అని సూత్రీకరించాడు.

ఇండో-పసిఫిక్ ప్రాంతంలో, పశ్చిమాసియా ప్రాంతంలో యుద్ధ వాతావరణాన్ని పెంచే, భారత్‌ను అమెరికా సామ్రాజ్యవాద రథ చక్రాలకు బంధించే దుర్మార్గమైన క్వాడ్-1, క్వాడ్-2 కూటమిలను ప్రజలందరు ఖండించాలి. ఆసియా ఖండంలోని పలు దేశాలతో, ఆ దేశాల ప్రజలతో మిత్ర దేశంగా ఉండే అవకాశాన్ని భారత్ కోల్పోయింది. అంతేగాక వారందరితో శత్రుత్వం కొని తెచ్చుకుంటున్నది. సామ్రాజ్యవాద దేశాల మధ్య ఆధిపత్య పోటీలకు, యుద్ధ క్రీడలకు వ్యతిరేకంగా ఆయా దేశాల ప్రజలు సాగించే పోరాటాలతో బాగం పంచుకునే అవకాశాన్ని మన దేశం కోల్పోయింది. అమెరికాతో చేసుకున్న అన్నీ సైనిక ఒప్పందాల నుండి భారత్ వైదోలగాలని ప్రజలంతా మోడీ ప్రభుత్వాన్ని డిమాండు చేయాలి. అమెరికాకు భారత్ లొంగుబాటు విధానానికి వ్యతిరేకంగా సంఘటితంగా ఉద్యమించాల్సిన చారిత్రక సందర్భంలో మనం ఉన్నామన్న వాస్తవాన్ని బుద్ధిజీవులు గ్రహించాలి.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)* వీ

# నిరాశ మిగిల్చిన కాప్-26 సదస్సు

***శాస్త్రవేత్తలు, పర్యావరణ వేత్తలు, ప్రగతిశీలురు ఊహించినట్లుగానే కాప్-26 సదస్సు శిలాజ ఇంధన కంపెనీల ఒత్తిడికి అనుకూలంగా, ఉత్తుత్తి హామీలతో ముగిసిందని అంటున్నారు*** **సంతోష్**

ప్రపంచ వ్యాప్తంగా భూతాపం పెరుగుతున్నందున మానవాళి చరిత్రలో ఏనాడు లేని సవాళ్లను నేడు ఎదుర్కొంటుంది. ఇవ్వాళ ఏ దేశమైన జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో కలుగుతున్న వాతావరణ ప్రభావాన్ని విస్మరించలేదు. పెరుగుతున్న భూతాపంపై 1997 డిసెంబర్‌లో 84 దేశాలతో జరిగిన క్యోటో సదస్సు చేసిన నిర్ణయాలు 'క్యోటో ప్రోటోకాల్' మైలురాయి లాంటివి. క్యోటో ప్రోట్రోకాల్ అంటే కార్బన్‌డయాక్సైడ్ (సిఓ2) ఉద్గారాలను, వాతావరణంలో గ్రీన్‌హౌస్ వాయువుల (జిహెచ్‌జి) ఉనికిని తగ్గించడానికి ఉద్దేశించిన అంతర్జాతీయ ఒప్పందం. మానవాళి భవిష్యత్తుపై మృత్యు ఖడ్గం వేలాడుతున్నదని ప్రపంచ దేశాల నేతలందరు గుర్తించారు. పారిశ్రామిక విప్లవం తరువాత గడచిన 150 ఏండ్లలో భూతాపం 1.3 సెల్సియస్ డిగ్రీలు పెరిగింది. తక్షణం భూతాపాన్ని తగ్గించే చర్యలు చేపట్టకపోతే మానవాళి సమస్తం అంతమయ్యే ప్రమాదముందని శాస్త్రవేత్తలు హెచ్చరికలు చేస్తున్నారు. అభివృద్ధి పేరుతో జరుగుతున్న మానవ కార్యకలాపాల వల్ల వాతావరణంలో ప్రతికూల మార్పులు శ్రుతిమించి పోతున్నాయి. ముఖ్యంగా ఇంధన అవసరాల కోసం బొగ్గు వాడకాన్ని కొనసాగించినంత కాలం పర్యావరణానికి వేడి వాయువుల ముప్పు అపరిమితంగా ఉంటుంది. ఓజోన్ పొర చిరిగిపోయి మనిషి మనుగడ సాగించలేని ప్రమాదకర స్థాయికి వాతావరణం వేడెక్కిపోతుంది.

1992లో బ్రెజిల్‌లోని రియో డి జెనరోలో జరిగిన భూ సదస్సు ఈ ప్రమాదాన్ని మొదటగా గుర్తించింది. ఈ సదస్సులో వాతావరణ మార్పుల నిరోధానికి (1992లో) ఐరాస ఆధ్వర్యంలో ఒక ప్రాతిపదిక ఒప్పందం కుదిరింది. దానిపై సంతకాలు చేసిన దేశాల సమావేశాన్ని కాన్ఫరెన్స్ ఆఫ్ పార్టీస్ (కాప్)గా వ్యవహరిస్తున్నారు. ఐక్యరాజ్య సమితి వాతావరణ మార్పుల సదస్సు 1994లో అందుకొక కార్యక్రమాన్ని రూపొందించింది. అదే యునైటెడ్ నేషన్స్ ఫ్రేమ్‌వర్క్ కాన్ఫరెన్స్ ఆన్ క్లైమేట్ ఛేంజ్ (యుఎన్ఎఫ్‌సిసి)గా పేరొందింది. ఫ్రేమ్‌వర్క్ కింద ఏటా సమావేశం కావడానికి కాన్ఫరెన్స్ ఆఫ్ పార్టీస్(కాప్) ఏర్పాటైంది. ఇందులో సభ్యత్వం గల 197 దేశాలు ప్రతి ఏటా వాతావరణ మార్పులపై సమావేశమవుతుంటాయి. 1995లో జర్మనీ రాజధాని బెర్లిన్‌లో తొలిసారి సమావేశమైన కాప్ ఇప్పటికి 25 భేటీలు జరిపింది. 26వ సమావేశం 2020లోనే జరగవలసి ఉండగా కొవిడ్ కారణంగా వాయిదాపడి ఈ ఏడాది అక్టోబర్ 31 నుంచి రెండు వారాల పాటు బ్రిటన్‌లోని గ్లాస్గో (స్కాట్లాండ్) నగరంలో జరిగింది. ఈ సమావేశంలో 200 దేశాల నుంచి 25,000 వేల మంది ప్రతినిధులు పాల్గొన్నారు. చైనా, రష్యా అధ్యక్షులు ఆన్‌లైన్‌లో పాల్గొన్నారు.

భూతాపం పెరుగుతుండటంతో తరచూ ప్రకృతి వైపరీత్యాలు వస్తూ ప్రతీ సంవత్సరం అంతకుమించి పెరుగుతున్నాయి. అతివృష్టి, అనావృష్టి, వరదలు, అడవులు మంటలు, ఆర్కిటిక్, అంటార్కిటిక్ ధృవాల్లోని మంచు కొండలు కరిగి సముద్ర నీటి మట్టాలు పెరగడం, కార్బన్ డై ఆక్సైడ్‌ల ప్రభావంతో గ్రీన్ గ్యాసులు పెరిగి వాతావరణ ఉష్ణోగ్రతల్లో మార్పు రావడం ప్రత్యక్షంగా చూస్తున్నాం. భూతాపం పెరగడంతో ఆహార భద్రతకు ముప్పు వాటిల్లటమే గాక అనేక ఆరోగ్య సమస్యలు గుండెకు సంబంధించినవి, కలరా, మలేరియా వంటివి మరలా విజృంభించటం, అస్తమా, మానసిక రుగ్మతలు వ్యాపించటం జరుగుతుందని శాస్త్రజ్ఞులు అంటున్నారు. అడవులను నరికేయటం, కాల్చటం, భూతాపానికి కారణమవటమే గాక జంతువుల నుండి మానవులకు వ్యాధులు సంక్రమిస్తాయని, అట్టి విపత్తుల్లో కొవిడ్ ఒకటని ఒక పెద్ద చర్చ జరుగుతున్నది. వైపరీత్యాల వల్ల మరణాల సంఖ్య 2000 నాటికి 11.9 లక్షల నుండి 2020 నాటికి 12.3 లక్షలకు, అదే కాలంలో బాధితులు 325 కోట్ల నుండి 403 కోట్లకు పెరగగా, ఆర్థికపరంగా నష్టాలు 1.63 లక్షల కోట్ల డాలర్ల నుండి 2.97 లక్షల కోట్ల డాలర్లకు చేరుకున్నాయి.

**విఫలమైన వాతావరణ కాప్-26 సదస్సు**

గత ఏడేళ్లుగా చరిత్రలోనే అత్యధిక ఉష్ణోగ్రతలు నమోదవుతున్నట్లు ప్రపంచ వాతావరణ సంస్థ భూగోళం భవిష్యత్తు అగమ్యగోచరం అవుతోందని ఆందోళన వ్యక్తం చేసింది. కర్బన ఉద్గారాల కట్టడి ప్రణాళికలు సత్వరం కార్యరూపం దాల్చకపోతే 2100 సంవత్సరం నాటికి భూతాపం 2.7 డిగ్రీల వరకు పెచ్చరిల్లే ప్రమాదం పొంచి ఉందని క్లైమేట్ యాక్షన్ ట్రాకర్ (సిఎటి) తాజాగా హెచ్చరించింది. వాతావరణ మార్పుల పరిణామాలుగా విరుచుకుపడుతున్న విపత్తులపై కొన్నేళ్లుగా శాస్త్రవేత్తలు మొత్తుకుంటున్నారు. వారి వేడుకోళ్లన్నీ అరణ్యరోదనలే అవుతున్న దుస్థితిలో... యుకెలోని గ్లాస్గో నగరం ఆతిథ్యమిచ్చిన 'కాప్-26' విశ్వసదస్సులో వాగ్దానాలు వెల్లువెత్తాయి. దాదాపు రెండు వందల దేశాలకు చెందిన 25 వేల మంది ప్రతినిధులు సాగించిన చర్చోపచర్చలు, దేశాధినేతల ప్రసంగాల్లో అనేక అంశాలు ప్రస్తావనకు వచ్చాయి. కానీ కార్యాచరణ శూన్యం. సంపన్న దేశాలు హామీలు గుప్పించి నిర్దిష్ట కార్యాచరణకు కట్టుబడకుండానే బయట పడ్డాయి. సుదూర టార్గెట్లు ప్రకటించడంతో సరిపుచ్చుకున్నారు. మొత్తంగా సదస్సు అట్టహాసంగా ప్రారంభమై ఆశించిన ఫలితాలు లేకుండానే ముగిసింది. మొత్తంగా ఐ.రా.స. వాతావరణ సదస్సు కాప్-26 లక్ష్యసాధనలో విఫలమైంది.

వాతావరణ మార్పులు పెను ముప్పుగా మారుతున్న నేపథ్యంలో ధరిత్రి పరిరక్షణకు ఒక్క అడుగైనా ముందుకు పడుతుందని ఆశించిన వారికి నిరాశే మిగిలింది. అందుకు కారణం కాప్-26 వాతావరణ

సదస్సులో పాల్గొన్న వారిలో శిలాజ ఇంధన పరిశ్రమకి చెందినవారే అత్యధికంగా ఉన్నారు. గ్లోబల్ విట్నెస్ నేతృత్వంలోని కార్యకర్తలు సదస్సులో పాల్గొన్న వారి జాబితాను సమీక్షించగా ఈ విషయం వెలుగులోకి వచ్చింది. ఐక్యరాజ్య సమితి సదస్సు ప్రారంభానికి ముందుగా జాబితాను ప్రకటించింది. శిలాజ ఇంధన ప్రయోజనాలకు సంబంధించిన వారు 603 మంది హాజరైనట్లు వెల్లడైంది. కెనడా, రష్యాతో సహా 27 దేశాల నుంచి వచ్చిన ప్రతినిధుల బృందంతో శిలాజ ఇంధన లాబీయిస్టులు ఉన్నారు. వందకు పైగా ఇంధన కంపెనీలకు వీరు ప్రాతినిధ్యం వహిస్తున్నారు. ఇందులో 30 వాణిజ్య సమాఖ్యలు ఉన్నాయి. చమురు, గ్యాస్ పరిశ్రమల కొరకు లాబీయింగ్ జరిపేందుకు ఈ ప్రతినిధులు వచ్చారని, వారిని సదస్సుకు హాజరు కాకుండా నిషేధం విధించాలని పర్యావరణ కార్యకర్తలు డిమాండ్ చేశారు. వాతావరణ సంక్షోభంపై వాస్తవ కార్యాచరణ చేపట్టడానికి దశాబ్దాలుగా శిలాజ ఇంధన పరిశ్రమ నిరాకరిస్తూ వస్తోంది. అందువల్లే ఇది అతిపెద్ద సమస్యగా మారిందని గ్లోబల్ విట్నెస్‌కి చెందిన ముర్రే వర్తీ వ్యాఖ్యానించారు. 25 ఏళ్లుగా ఐక్యరాజ్య సమితి ఆధ్వర్యాన వాతావరణ చర్చలు జరుగుతున్నా కాలుష్య ఉద్గారాలు పెద్ద మొత్తంలో తగ్గకపోవడానికి వీరి ప్రభావమే అతి పెద్ద కారణమని చెప్పవచ్చు.

### రోమ్‌లో జి-20 సదస్సు

ఇటలీ రాజధాని రోమ్‌లో అక్టోబర్ 30న ముగిసిన జి-20 సంపన్న దేశాల సదస్సు కూడా పారిస్ ఒప్పందం లక్ష్యాల సాధనకు కట్టుబడి ఉంటానని ప్రకటించింది. పారిస్ ఒప్పందం నిర్దేశించిన విధంగా భూవేడిని పారిశ్రామిక విప్లవం నాటి స్థాయి కంటే 1.5 సెంటిగ్రేడ్‌కు మించకుండా చూడడం 2030 నాటికి సాధ్యం అవుతుందేమో గాని 2050 నాటికి దానిని శూన్య స్థితికి చేర్చడం దుస్సాధ్యమే. పర్యావరణ పరిరక్షణ ప్రాధాన్యంపై ప్రపంచవ్యాప్తంగా ప్రజలలో స్పృహ పెరిగింది. దీనివల్ల ఆయా దేశాల నాయకులపై ఒత్తిడి పెరిగింది. ఈ ఒత్తిడి వల్ల పారిశ్రామిక దేశాల నాయకులు మొక్కుబడిగా చర్చలు జరుపుతున్నారే తప్ప, వారిలో చిత్తశుద్ధి కనిపించడం లేదు. వర్ధమాన దేశాలకు సంపన్న రాజ్యాలు పరిపూర్ణ స్థాయిలో సహకారమందిస్తే గాని ప్రపంచం వేడెక్కడం నుంచి కలిగే ఉత్పాతాల నుంచి విముక్తి చెందడం సాధ్యం కాదు.

ప్రపంచంలోని 20 దేశాల భారీ ఆర్థిక వ్యవస్థలు, ప్రపంచ వాణిజ్యంలో 75 శాతం వాటా, జనాభాలో మూడింట రెండొంతులు, భూభాగంలో సగానికి ప్రాతినిధ్యం వహిస్తున్న 20 దేశాల నేతలు ఒక్కచోట కలిసి పర్యావరణం, వాణిజ్యం, ప్రపంచ రాజకీయ పరిణామాలు చర్చించినా ఆశించిన ఫలితాలు రాలేదనే చెప్పవచ్చు. కర్బన తటస్థతను సాధించేందుకు కచ్చితమైన గడువు నిర్ణయించలేక పోయారు. కేవలం ఉద్గారాల్ని తగ్గిస్తే సరిపోదని తెలిసినా కార్యాచరణ ఏమిటో స్పష్టం చేయలేదు. జి-20 నేతలు ఎంతసేపటికీ మాటలతో గారడీ చేస్తున్నారన్నది గ్రేటా థన్‌బెర్గ్ లాంటి పర్యావరణ ఉద్యమకారుల వాదన. 'జి-20' సదస్సులో అధినేతల తుది ప్రకటన సైతం వారి వాదనకు తగ్గట్టే ఉంది. జి-20 సదస్సు ముగింపు వేళ .... పర్యావరణ సంక్షోభంలో తరచూ విస్మరణకు గురయ్యే మూడు మౌలిక అంశాలను గుర్తుచేస్తూ ఉద్యమకారులు థన్‌బెర్గ్, వానెస్సా నకాటే బహిరంగ లేఖ రాశారు. పర్యావరణ సంక్షోభంపై జాగు చేయడానికి వీలు లేదన్నారు. ఏ పరిష్కారమైనా సరే పర్యావరణ మార్పు వల్ల తీవ్ర దుష్పరిణామాలు ఎదుర్కొంటున్న వారికి న్యాయం చేసేదిగా ఉండాలన్నారు. అత్యంత భారీగా కాలుష్యం వెదజల్లుతున్నవారు తమ ఉద్గారాలపై అసంపూర్ణమైన గణాంకాలు చెప్పి, తప్పించుకుంటున్నారని తీవ్రంగా విమర్శించారు.

అభివృద్ధి కోసం పర్యావరణానికి తూట్లు పొడిచే నిర్ణయాలు తీసుకుంటున్న జి-20 దేశాధినేతల తీరును పర్యావరణ కార్యకర్తలు, కార్మికులు, విద్యార్థులు నిరసించారు. అక్టోబర్ 29-30 తేదీలలో రోమ్‌లో జరిగిన జి-20 దేశాధినేతల సమావేశం రెండోరోజు నిరసనకారులు ఆందోళన చేపట్టారు. రోమ్ నుంచి ప్రారంభమైన నిరసన జ్వాల కాప్-26 సమావేశం జరుగుతున్న గ్లాస్గోలో కూడా తలెత్తింది. 'మీరు జి-20 మేం భవిష్యత్తు' అంటూ నిరసించారు. పర్యావరణ కార్యకర్తలు చేపట్టిన గ్లాస్గో ర్యాలీలో దాదాపు ఐదు వేల మంది పాల్గొన్నారు. జి-20కి ప్రత్యామ్నాయంగా మేమే అంటూ ప్లకార్డులు చేపట్టి ఉద్యమించారు. 'కాపిటలిజమ్ ఈజ్ డెత్' అంటూ అస్థిపంజరం వేషం వేసిన స్పెయిన్ వ్యక్తి తన ఆందోళనను తెలియజేశాడు. నాయకుల నుంచి ఫలితాలు లేని నిర్ణయాలుగా నిరసనకారులు తమ అసంతృప్తిని వ్యక్తం చేశారు.

### గ్లాస్గో వాతావరణ సదస్సు

'ఇదే గ్లాస్గోలో 250 ఏండ్ల కిందట జేమ్స్ వాట్ బొగ్గును మండించడం ద్వారా పనిచేసే ఆవిరి యంత్రాన్ని కనుగొన్నాడు. ఇప్పుడు ప్రళయ యంత్రం మొదలైన అదే చోటికి మిమ్మల్ని తీసుకొచ్చాం' అంటూ బ్రిటిష్ ప్రధాని బోరిస్ జాన్సన్ నవంబర్ 1న కాప్-26వ సదస్సును ప్రారంభిస్తూ హెచ్చరించారు. జేమ్స్ వాట్ ఆవిరి యంత్రాన్ని కనుగొన్న తరువాత పారిశ్రామిక విప్లవం ప్రభవించింది. మానవాళికి ఎంతో మేలు చేసిన ఈ విప్లవం క్రమంగా ప్రకృతి విధ్వంసానికి దారితీసింది. కర్బన ఉద్గారాలను అరికట్టడానికి ఆరేండ్ల కిందట ప్యారిస్ ఒడంబడిక కుదిరినా ఆ తరువాత ఆశించిన ప్రగతి జరగలేదు. రెండేండ్ల క్రితం మాడ్రిడ్‌లో జరిగిన ఐక్యరాజ్యసమితి వాతావరణ సదస్సు కాప్-25 ఘోరంగా విఫలమైంది. ఈ నేపథ్యంలో గ్లాస్గోలో రెండు వారాల పాటు జరిగిన ఈ సదస్సులో సుదీర్ఘంగా సాగిన మేధోమథనం వివిధ దేశాల నాయకులు హోరెత్తించే ప్రకటనలకే పరిమితమయ్యారు. వాతావరణ మార్పులతో భూగోళానికి పొంచి ఉన్న ముప్పును మరోమారు నొక్కి చెప్పడం మినహా ఈ సదస్సు సాధించిందేమి లేదు.

భూ ఉష్ణోగ్రతను పారిశ్రామిక విప్లవం మొదలు కావడానికి ముందున్న స్థాయి కంటే 2 సెంటిగ్రేడ్ డిగ్రీలకు మించకుండా, వీలైతే 1.5 డిగ్రీలకే పరిమితం చేయాలని పారిస్ ఒప్పందం లక్ష్య నిర్దేశం చేసింది. ఇందుకోసం థర్మల్ విద్యుదుత్పాదనను పరిమితం చేయడం, బొగ్గు వాడకాన్ని గణనీయంగా తగ్గించుకోవడం, శిలాజ ముడిచమురు అవసరం లేని సౌర, వాయు విద్యుత్తు వంటి పునరుత్పాదక ఇంధనాల ఉత్పత్తి వాడకాన్ని పెంచడం వంటి లక్ష్యాలను నిర్ణయించింది. వర్ధమాన దేశాలు తమ సాంకేతిక సాధనాలను పర్యావరణ హితంగా ఆధునికీకరించుకోవడం కోసం వాటికి సంపన్న దేశాలు వంద కోట్ల డాలర్లను ఇవ్వాలని పారిస్ ఒప్పందం నిర్దేశించింది. అందులో 80 శాతం నిధులను మాత్రమే ధనిక దేశాలు ఇచ్చాయి. ప్రధాన విరాళ ప్రదాత అయిన అమెరికా అధ్యక్షుడు ట్రంప్ 2019లో పారిస్ ఒప్పందం నుంచి ఏకపక్షంగా తప్పుకొని అక్కడ బొగ్గు పరిశ్రమను

పునరుద్ధరించే వైపు అడుగులు వేసిన సంగతి తెలిసిందే. గత జనవరిలో అధికారం చేపట్టిన ప్రెసిడెంట్ జో బైడెన్ ప్రభుత్వం అమెరికాను తిరిగి పారిస్ ఒప్పందంలో చేర్చడానికి నిర్ణయించింది.

కాప్-26 అక్టోబర్ 31 నాటి ప్రారంభ సమావేశంలో ప్రపంచాన్ని కాపాడుకోవడానికి ఇదే చిట్టచివరి అత్యుత్తమ ఆశ, అవకాశం అంటూ ప్రపంచ దేశాలన్నీ పర్యావరణ మార్పులను అరికట్టడానికి పూనిక వహించాయి. అందుచేత గ్లాస్గో సమావేశం నుంచి మంచి నిర్ణయాలు వెలువడగలవనే ఆశ అందరిలో కలిగింది. 2015లో పారిస్‌లో జరిగిన సమావేశంలో తీసుకున్న నిర్ణయాల అమలు ప్రగతిని గ్లాస్గో భేటీ సమీక్షిస్తుందని, వాతావరణ మార్పుల వల్ల ప్రసరించే గ్రీన్ హౌస్ వాయువుల (వేడి, బొగ్గు పులుసు గాలులు)ను పరిమితం చేయడానికి అదనపు లక్ష్యాలను కూడా గ్లాస్గో సమావేశం నిర్దేశించవచ్చునని అందరు ఆశించారు. అయితే శిలాజ ఇంధన వాడకాలపై మెతక వైఖరి అవలంబించడం వల్ల భూతాపాన్ని 1.5 డిగ్రీల సెల్సియస్‌కు పరిమితం చేయాలన్న లక్ష్యసాధన దిశగా కార్యాచరణ కనిపించడం లేదు.

ముసాయిదాలో వాడిన భాషను గమనిస్తే శిలాజ ఇంధన కంపెనీల ప్రభావం కనిపిస్తోంది. సంపన్నదేశాలు వ్యూహాత్మకంగా వ్యవహరించాయి. ముసాయిదా పత్రంలో ఆఖరి క్షణం వరకు ఉంచిన కీలక ప్రతిపాదనల్ని కూడా, ఉద్యమకారులు సందేహించినట్టే... నవంబర్ 12 రాత్రి (భారత కాలమానం ప్రకారం) పొద్దుపోయాక నిస్సిగ్గుగా తొలగించారు. ఇంధన- వాహన లాబీ బలానికిది నిదర్శనం. పునరుత్పాదక ఇంధనాల వైపు ఎంత వేగంగా, ఏయే కార్యాచరణతో మళ్లేది సంపన్న దేశాలు స్పష్టపరచలేదు. ఉద్గారాల శూన్య (తటస్థ) స్థితిని ఎప్పటివరకు సాధిస్తాయో గడువు ప్రకటించి, అదే గొప్ప కర్తవ్యంగా చేతులు దులుపుకున్నాయి. అత్యధిక దేశాలు 2050, చైనా 2060, భారత్ 2070 గడువుగా వెల్లడించాయి.

### అమెరికా, బ్రిటన్‌ల మొండివాదన

పారిశ్రామిక విప్లవం మొదలై గట్టిగా వేళ్లూనుకున్న యూరప్, అమెరికాల్లోనే ఆదిలో అత్యధికంగా బొగ్గు వినియోగం జరిగింది. అందుచేత అవే పర్యావరణ పరిరక్షణ వ్యవస్థను దెబ్బతీశాయి. భూగోళ తాపం పెరగడానికి, పర్యావరణ విధ్వంసం జరగడానికి ఇప్పటివరకు పాశ్చాత్య దేశాలలో సాగిన విధ్వంసకర పారిశ్రామిక విధానాలే కారణం. ఇంతకాలం బొగ్గు వాడకం ద్వారా భూగోళాన్ని కాలుష్యమయం చేసింది అభివృద్ధి చెందిన దేశాలే. తాము త్యాగాలు చేయకుండా, భారత్ వంటి వర్ధమాన దేశాలను కట్టడి చేయాలనడం ఏమిటనే ప్రశ్న వినిపిస్తున్నది. వర్ధమాన దేశాలకు సాంకేతికత బదిలీ, ఆర్థిక తోడ్పాటు, కొంతకాలం వెసులుబాటు ఇవ్వాలనే వాదనలో న్యాయం ఉంది. బొగ్గు వినియోగంపై భారత్ వైఖరి అభ్యంతరకరంగా ఉన్నట్టు కనిపిస్తున్నది. అయితే భారత్‌తో పాటు అమెరికా, చైనా సహా పలు దేశాలు తమ వంతు వెసులుబాట్లు పొందాయనేది గమనార్హం.

సంపన్న దేశాలైన అమెరికా ఇంగ్లాండ్, ఫ్రాన్స్, జర్మనీ దేశాలు కర్బన ఉద్గారాల కట్టడి విషయంలో చైనా, భారత్ వంటి వర్ధమాన దేశాలకూ సమాన బాధ్యత ఉండాలని పేర్కొనడం సబబు కాదు. పైగా పర్యావరణ హితమైన సాంకేతిక పరిజ్ఞానాన్ని వర్ధమాన దేశాలకు బదిలీ చేయడానికి నిరాకరిస్తూ, ఇక్కడి అభివృద్ధిని కట్టడి చేయడం కూడా సరికాదు. భూగోళం తాపం పెరగడం వల్ల అందరికీ హానికరమే. ఇప్పుడవి పర్యావరణ హితమైన హరిత సాంకేతిక వ్యవస్థలను నెలకొల్పుకొని వర్ధమాన దేశాల వైపు వేలెత్తి చూపుతున్నాయి. ఆలస్యంగా పారిశ్రామికమైన వర్ధమాన దేశాలు తమ ఉత్పాదక కార్యకలాపాలకు అధికంగా ఇంకా బొగ్గు పైనే ఆధారపడి ఉన్నాయి. అత్యధిక బొగ్గు వినియోగ దేశంగా చైనా, భారత్‌లు ఇప్పటికీ కొనసాగుతున్నవి. భారత బొగ్గు అవసరాన్ని ఇప్పట్లో వదిలించు కోజాలదు.

బ్రిటన్ ఆతిథ్యంలో జరిగిన గ్లాస్గో సదస్సులో సంపన్న దేశాలు భారత్, చైనా వంటి దేశాలు ఈ శతాబ్ది సగం ముగిసేసరికి తమ బొగ్గు పులుసు వాయు విసర్జనలకు పూర్తిగా తెర దించాలని ఒత్తిడి తెచ్చాయి. అదే సమయంలో అమెరికా తదితర దేశాలు తమ ఆయిల్, గ్యాస్ వినియోగాన్ని తగ్గించుకునే దిశగా లక్ష్యాలను ప్రకటించడానికి నిరాకరించాయి. తమ ఆర్థిక వ్యవస్థలకు కీలక అవసరం. ఇంధనాలైనందున వాటి వినియోగాన్ని తగ్గించడానికి అవి సిద్ధంగా లేవు. వాతావరణ మార్పులను అరికట్టడానికి అందరూ సమానంగా బాధ్యత వహించాలంటే బొగ్గు, చమురు, గ్యాస్ - ఈ మూడు శిలాజ ఇంధనాల వినియోగాన్ని దేశాలన్నీ ఒకే రీతిలో తగ్గించుకోవాలని భారత్ ప్రతిపాదించింది. ఇందుకు సంపన్న దేశాలు నిరాకరించాయి. 23 సంపన్న దేశాలు సగం కర్బన ఉద్గారాలకు కారణమైతే, భారత్, చైనాతో పాటు మిగిలిన 150 దేశాలు మరో సగానికి కారణం అవుతున్నాయి. ఈ నేపథ్యంలో అభివృద్ధి చెందిన దేశాలు 'సొంత లాభం కొంత మానుకొని పొరుగువారికి తోడ్పడాలి'.

చైనా ఏడాదికి 4,319,921,826, ఇండియా 966,288,639 టన్నుల బొగ్గును మండిస్తున్నాయి. చైనా పరిశ్రమలు అత్యధికంగా బొగ్గు మీదనే ఆధారపడి నడుస్తున్నాయి. 2019లో చైనాలో 57.7 శాతం ఇంధనం బొగ్గు నుంచే ఉత్పన్నమైంది. చైనా, ఇండియాల తర్వాత స్థానంలోని అమెరికా ఏటా 650,302.68 టన్నుల బొగ్గును వినియోగిస్తున్నది. అలాగే రష్యా 238,444.66 టన్నులు, జర్మనీ 225,249.82 టన్నుల బొగ్గును ఏటా వినియోగిస్తున్నాయి. థర్మల్ విద్యుత్ ఉత్పాదనను భారీగా తగ్గించుకుంటే గాని బొగ్గు అవసరం నుంచి బయటపడలేము. పరిమితంగా మాత్రమే అందుబాటులో ఉన్న జల, వాయు, సౌర విద్యుత్ ఉత్పాదనను అసాధారణ స్థాయిలో పెంచుకోవలసి ఉంది. ఎంత పెంచినా బొగ్గు వినియోగాన్ని పూర్తిగా మానుకోగల స్థాయికి ఈ ఇంధనాలను ఉత్పత్తి చేసుకోవడం సులభ సాధ్యం కాదు. అలాగే వాటి వినియోగాన్ని సమూలంగా వదులు కోవడం ఇప్పట్లో అయ్యే పని కాదు. ముఖ్యంగా వర్ధమాన, పేద దేశాలకు సంపన్న దేశాలు తగినంత ఆర్థిక సాయం చేసి హరిత ఇంధనాల వైపు వాటిని పూర్తిగా మళ్లించినప్పుడు గాని ఈ భూతాప వాయు విసర్జన గండం నుంచి ప్రపంచానికి గణనీయమైన విముక్తి లభించదు.

### ఇంధన ఉత్పత్తి, వ్యాపార కార్పొరేట్ల లాబీయింగ్

కాప్-26 సదస్సు చర్చల సరళి అంతా దోషులను దొడ్డిదారిలో సాగనంపడం, బాధితులకే కొత్త బంధాలు వేయడం అన్న తరహాలో సాగింది. ఇప్పటివరకు జరిగిన వాతావరణ అనర్థంలో ఏమాత్రం పాత్ర-ప్రమేయం లేని పేద, అభివృద్ధి చెందుతున్న దేశాల తాజా నియంత్రణలు ప్రతి బంధకమవుతున్నాయి. సాధారణ పద్ధతిలో

అభివృద్ధి చెందడానికి శిలాజ ఇంధన వినియోగ కట్టడి, కర్బన ఉద్గారాల నియంత్రణ అడ్డంకి, ప్రత్యామ్నాయాల వైపు మళ్లడానికి అవసరమయ్యే సాంకేతికత బదలాయింపు వంటి అంశాలు ప్రతికూలంగా ఉన్నాయి. ఆర్థిక సహాయానికి ఆరేళ్ల కింద మాటిచ్చి సంపన్న దేశాలు ఆచరించటం లేదు. ఈ 'వాతావరణ ఆర్థిక వనరు' విషయంలో కాప్-26 ఓ మార్గదర్శి అవుతుందనుకుంటే, పరిస్థితి ఏం మారలేదు. ఏటా పదివేల కోట్ల (వంద బిలియన్) డాలర్ల ఆర్థిక సహాయానికి 2009లో అంగీకరించిన సంపన్న దేశాలు మాట తప్పాయి. అందువల్ల భూతాపాన్ని తగ్గించే లక్ష్యం కేవలం నినాదానికే పరిమితమైంది.

వాతావరణ మార్పులకు అనుగుణంగా పేద దేశాలు మనగలగాలంటే తమకు మరిన్ని నిధులు కావాలని అవి పట్టుబడుతున్నాయి. ఇందుకోసం పేద వర్ధమాన దేశాల భద్రత, అభివృద్ధి కోసం కేటాయించిన నిధిని రెట్టింపు చేయాలని గ్లాస్గో ముసాయిదా చెబుతోంది. సంపన్న దేశాల ప్రతినిధులు అభివృద్ధి చెందుతున్న దేశాలను వాటా పంచుకోవాలని కోరడం, అలా అయితేనే పేద దేశాలకు న్యాయం చేస్తామనడం విడ్డూరంగా ఉంది. మరోవైపు సంపన్న దేశాలు విడుదల చేస్తున్న కాలుష్యాల వల్ల తమకు జరుగుతున్న నష్టానికి పరిహారంగా నిధులు కావాలని పేద దేశాలు కోరుతున్నాయి. దీన్ని అమెరికా ఇతర దేశాలు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నాయి. దీనిపై బలవంతంగా రాజీ కుదిర్చి గ్లాస్గో ఒప్పందం సాధించినా ఆచరణలో అది మరో ప్రహసనంగా మిగిలిపోయే అవకాశముంది.

ఐక్యరాజ్య సమితి (యుఎన్), అంతర్ ప్రభుత్వాల బృందం (ఐపిసిసి) తాజా నివేదిక ప్రపంచాన్ని హెచ్చరిస్తూ చేసిన 'కోడ్ రెడ్' ప్రకటనకు సరితూగే చిత్తశుద్ధి సర్వత్రా లోపించింది. సదస్సు చివరి రోజైన అక్టోబర్ 13న యునైటెడ్ కింగ్‌డమ్ నేతృత్వంలో 'కీలక నిర్ణయాల' (కవర్ డెసిషన్స్) పత్రం సిద్ధమౌతున్న సమయంలోనే సదస్సు ఏం సాధించిందని సమీక్షించినప్పుడు నిరాశే కళ్లకు కడుతోంది. ముసాయిదా ప్రతిలోనే ఆశాజనక ప్రతిపాదనలు లేవు. పేద, అభివృద్ధి చెందుతున్న దేశాలకు తీరని అసంతృప్తి మిగిలింది. ఏ కీలక విషయంలోనూ నిర్దిష్ట అంగీకారం, విస్పష్ట నిర్ణయం ఆవిష్కృతం కాలేదు. ముంచుకొస్తున్న ప్రమాదం నుంచి పుడమి జీవరాశిని కాపాడే ధీమా కలిగించకుండానే సదస్సు ముగిసింది. ఆయా దేశాలు, వారి గోప్య ఎజెండాలు, వాటికి లోబడ్డ మార్కెట్ శక్తులు, లాబీయిస్టులు సదస్సులో ఆధిపత్యం చెలాయించారు. వారంతా చర్చల గమనాన్నీ, అంశాల ప్రాధాన్యతల్నీ, నిర్ణయాల సరళిని, గమ్యాన్నీ తాము కోరుకున్న దిశలో నడిపారు. ఏర్పాట్ల నుంచి ఎజెండా దాకా, చర్చల్లో భాగస్వామ్యం నుంచి కార్యాచరణ లోపించడం వరకు ఎన్నెన్నో అంశాలు ప్రశ్నార్థకమయ్యాయి.

**ముగింపు**

సుమారు రెండు వారాల (అక్టోబర్ 31 నుంచి నవంబర్ 13 వరకు) చర్చల అనంతరం కాప్-26 వాతావరణ సదస్సు రాజీ ఒప్పందానికి వచ్చింది. ఈ ఒప్పందంపై 197 దేశాలు సంతకాలు చేశాయి. భూతాపానికి ప్రధాన కారణం బొగ్గు వినియోగమేనని గుర్తించినప్పటికీ, బొగ్గును ఇంధన వనరుగా ఉపయోగించడాన్ని దశల వారీగా నిలిపివేయాలన్న ప్రతిపాదనపై భారత్, చైనాలు అభ్యంతరం చెప్పడంతో చివర్లో ముసాయిదాలో 'షట్ అవుట్' (స్వస్తి చెప్పాలి) అనే పదాన్ని 'షట్ డౌన్' (తగ్గిస్తూ పోవాలి) అనే పదంతో సవరించారు. వర్ధమాన దేశాలు 2025 నాటికి వాతావరణ లక్ష్యాలు చేరుకునేలా సహకరించేందుకు సంపన్న దేశాలు అందించే నిధులను రెట్టింపు చేయాలని ఈ ఒప్పందంలో చేర్చారు. అందుకు హామీ పత్రం పొందలేదు. దాట వేత కన్పించింది.

'ఐక్యరాజ్యసమితి వాతావరణ సదస్సు' కాప్-26 ఆశించిన లక్ష్యాన్ని సాధించకపోవడం విషాదకరం. సదస్సుకు ఆతిథ్యం ఇచ్చిన బ్రిటన్‌తో పాటు అగ్రరాజ్యం అమెరికా కాప్-26' విజయవంతమైందని ప్రకటించగా.. మాల్దీవుల వంటి చిన్న పేద దేశాలు మాత్రం మా తప్పేమీ లేకపోయినా జలసమాధి అయ్యే తమ పరిస్థితి ఏమిటని ప్రశ్నిస్తున్నాయి. కాప్ సదస్సులో కుదిరిన ఒప్పందంలో సంపన్న దేశాల ప్రయోజనాలు, రాజకీయ వైరుధ్యాలు, లోపించిన చిత్తశుద్ధి స్పష్టంగా కనిపిస్తోంది. పరిస్థితి తీవ్రతకు అనుగుణంగా ఒప్పందం లేదని, ఒప్పందం లొసుగులతో నిండి ఉందని ఐ.రా.స చీఫ్ ఆంటోనియో గుటెర్రెస్ వ్యాఖ్యానించాడు. దుర్బలత్వంతో కూడిన మన భూగోళం సన్నని దారంతో వేలాడుతుందని ఆయన హెచ్చరించారు.

భూతాప నియంత్రణకు సమగ్ర నిధి, గ్రీన్ టెక్నాలజీ అందజేసే విషయాల్లో సంపన్న దేశాలకు, వర్ధమాన దేశాలకు మధ్య తలెత్తిన విబేధాలను పరిష్కరించేందుకు అదనంగా ఒక రోజు తీసుకున్నారు. కర్బన ఉద్గారాల తగ్గింపు లక్ష్యాలను నీరుగార్చేదిగా తుది ముసాయిదా ఉందంటూ గ్లాస్గో సదస్సు నుంచి చివరి రోజున పర్యావరణ కార్యకర్తలు, ప్రతినిధులు వాకౌట్ చేశారు. శిలాజ ఇంధనాలపై మెతకవైఖరి అవలంబించడం వల్ల గ్లోబల్ వార్మింగ్‌ను 1.5 డిగ్రీల సెల్సియస్‌కు పరిమితం చేయాలన్న లక్ష్యం నెరవేరే స్థితి లేదని వాతావరణ ప్రచార కార్యకర్తలు హెచ్చరిస్తున్నారు. తాజా ముసాయిదా చూస్తుంటే ప్రజలు ఆశించిన ప్రగతిశీల ఒప్పందంగా కనబడడం లేదని, ఆ ముసాయిదాలో శిలాజ ఇంధన కంపెనీల ముద్ర అడుగడుగునా కనిపిస్తోందని అన్నారు. సంపన్న దేశాల తీరుకు నిరసనగా కాప్-26కి వారు అంత్యక్రియలు నిర్వహించారు. సంపన్న దేశాల ఆధిపత్యం కొనసాగినంత కాలం పర్యావరణ పరిరక్షణ ఒట్టిమాటేనన్న చేదు నిజాన్ని గ్లాస్గో సదస్సు మరోమారు రుజువు చేసింది.

నిజానికి భూతాపం తెచ్చిపెట్టే అనర్థాలపై ప్రజలకు అవగాహన కల్పించడమే కాదు... నియంత్రణ నిబంధనలు కఠినంగా అమలు చేయాల్సిన బాధ్యత ప్రభుత్వాలపై ఉంది. పాలకులు నిర్లక్ష్యానికి భారీ మూల్యం చెల్లించాల్సి వస్తుందనే సత్యాన్ని తెలుసుకొని మసలుకోవాలి. తీర్మానాలు అవసరం లేదు. వాటిని కచ్చితంగా అమలు చేసే విధానం ఉండాలి. లేకపోతే ఎన్ని సదస్సులు జరిగినా ఫలితం శూన్యం. అందువల్ల కాప్-26 వంటి సమావేశాల కంటే ముఖ్యమైనది మానవ చైతన్యం, ప్రకృతిని నాశనం చేసే వారిపై తిరుగుబాటు లేనిదే రానున్న కాలంలో భూతాప సమస్య పరిష్కారం కాదనేది వాస్తవం. అదే సమయంలో ఉత్పత్తి, రవాణా రంగాలలో ఉపయోగించే పెట్రోలు, డీజిల్, బొగ్గుకు బదులు ప్రత్యామ్నాయ పునరుత్పాదక శక్తి గల (సోలార్, వాయు, హరిత) ఇంధనాల ఉత్పత్తి, వాడకం పెరగాలి.

*(రచయిత ఉపాధ్యాయులు)*

# తాత్విక రంగంలో మార్క్సిజం పూర్వీకులు

**యు. ఎ. ఖారిన్** *రచించిన 'ఫండమెంటల్స్ ఆఫ్ డయలెక్టిక్స్' పుస్తకం లోని రెండవ అధ్యాయం లోని రెండవ ఉపశీర్షిక : అనువాదం - రాజేంద్ర బాబు అర్విణి*

**18,** 19వ శతాబ్దానికి చెందిన ప్రముఖ జర్మన్ తత్వవేత్తలు ప్రతిపాదించిన సిద్ధాంతాలు సాధారణంగా జర్మన్ దేశ తత్వశాస్త్ర చరిత్రలో అత్యుత్తమ స్థాయి గల ప్రామాణిక సూత్రాలుగా పరిగణించబడుతున్నాయి. జర్మన్ తత్వశాస్త్రంలో ఈ ప్రామాణిక సూత్రాలను ప్రతిపాదించిన వారిలో ముఖ్యులు ఇమ్మాన్యుయేల్ కాంట్ (1724–1804). కాంట్ ప్రతిపాదించిన తత్వశాస్త్ర విజ్ఞానాన్ని అభివృద్ధి చేసిన వాళ్లు జోహాన్ గోట్లీబ్ ఫిచ్టే, ఫ్రెడ్రిక్ విల్హెం జోసెఫ్ వాన్ స్కెల్లింగ్. మార్క్సిస్టు తత్వశాస్త్ర భావనలను ఎక్కువగా ప్రభావితం చేసినవి హెగెల్ (1770–1831), ఫ్యూయర్బా (1804– 1872)ల అభిప్రాయాలు.

వస్తుగత ఆదర్శవాదం కోణం నుండి పరిశీలించి జార్జ్ విల్హేమ్ ఫ్రెడరిక్ హెగెల్ తత్వశాస్త్రం యొక్క ప్రాథమిక సమస్యకు సమాధానం వెతికే ప్రయత్నం చేశాడు. కాని, గతంలోని వస్తుగత భావవాదుల వలె కాకుండా (ఉదాహరణకు ప్లేటో), ఆయన గతితార్కిక భావవాద సిద్ధాంతాన్ని ప్రతిపాదించి, దానిని మెరుగు పరిచే విధంగా కృషి చేశాడు. ఆయన అభిప్రాయంలో నిజంగా ఉనికిలో ఉన్న వాస్తవము, ఉనికిలో ఉన్న వేటికయినా మూలం తటస్థంగా ఉన్న మానసిక స్థితి లేదా వివేకము. దాన్నే ఆయన 'సమగ్రమయిన భావం' అన్నాడు. ప్రపంచానికి సంబంధించిన భావనలు శాశ్వతంగా ఉనికిలో ఉంటాయి. సమాజానికి, ప్రకృతికి సంబంధించి కళ్లకు కనిపించే అన్ని పరిణామాలలోను అవి అవ్యక్తంగా ఉంటాయి.

ఈ 'భావన' స్వీయ జ్ఞానాన్ని కలిగి ఉండేదిగా ఉంటుంది, కాబట్టి దాని అంతర్గత సారాంశాన్ని తెలుసుకునే క్రమంలో వివిధ దశలు దాటి స్వీయ వృద్ధిగా పరిణతి చెందుతుంది. 'ఉనికిలో ఉండడం అంటే ఆలోచనలో ఉండడం', అంటూ హెగెల్ ఈ విధంగా రాస్తాడు, 'అది కదలిక లేకుండా విశ్రాంతిగా ఉండే విషయం కాదు, కఠినంగా ఉన్నందువల్ల అప్పుడప్పుడు అనుకోని సంఘటనలు జరుగుతూ ఉంటాయి, కాని ఆ భావన సదా చలనంలో ఉంటుంది, తనలోనే తాను నిర్వచనాలు వెతుక్కుంటూ ఉంటుంది.' మొదట స్థల కాలాలకు అతీతంగా ప్రాపంచిక కారణం స్వచ్ఛమయిన ఆలోచనగా రూపుదిద్దుకుంటుంది. ఆ తర్వాత 'మరొక రూపం'లోకి పరిణామం చెందుతుంది. అంటే ఆ భావన ప్రకృతిలో ఏదో రూపంలో కనపడుతుంది (లేదా అది సృష్టించుకుంటుంది).

కాబట్టి హెగెల్ ఉద్దేశ్యంలో భౌతిక ప్రపంచం అప్రధానమయినది. అది నిజమయిన వస్తు ఉనికికి పరాయిది. కళ, మతము లాంటి ఇతర రూపాలలోకి 'రాజ్యము' మారిన తర్వాత 'ఆలోచన' తత్వశాస్త్ర దశలో మాత్రమే తన స్వగృహమయిన స్వచ్ఛమయిన 'భావన' స్థాయికి చేరుకుంటుంది.

హెగెల్ ఫిలాసఫీలో చాలావరకు హేతుబద్ధత గూడిన విలువైన మౌలిక సూత్రాలు ఉన్నాయి. హెగెల్ కాలానికి సైన్స్‌లో, తత్వశాస్త్రంలో పారలౌకికమయిన ప్రాపంచిక దృక్పథం ప్రధానంగా ఉండేది. దానిని విభేదిస్తూ హెగెల్ భావవాదం ఆధారంగా గతితార్కిక పద్ధతిని తాను ఒక విధానంగా రూపొందించాడు. ఈ పద్ధతి ఆధారంగా "పరస్పరం సంబంధం ఉండి కూడా అంతర్గతంగా విభేదించే సమగ్రమయిన ప్రక్రియ"గా 'వాస్తవాన్ని' నిర్వచించాడు. ఈ ప్రక్రియ గుణాత్మక మార్పుకు లోనవుతుంది. అదే సమయంలో తన్ను తాను వ్యతిరేకిస్తుంది కూడా. హెగెల్ అభిప్రాయంలో విరుద్ధాంశాలు ఒకదానిలోకి ఒకటి చొచ్చుకు వస్తాయి అన్న గతితార్కిక సూత్రం ప్రకారం సంఖ్యాపరంగా పెద్దదయిన పరిణామం నుండి గుణాత్మకంగా, విరుద్ధాంశాలలోనే మళ్లీ విరుద్ధాంశాలు 'వాస్తవం' మారుతుంది (వాస్తవం అంటే ప్రపంచంలోని హేతువాద ఉనికికి అవసరమయిన ఒక రూపంగా హెగెల్ చెప్పిన విషయాన్ని ఈ సందర్భంగా మనం గుర్తుంచుకోవాలి). హెగెల్ వ్యక్తపరచిన ఈ భావనలు, ఇంకా ఇలాంటి అభిప్రాయాలు గతితార్కిక భౌతికవాదం అభివృద్ధి చెందడంలో ఉపయోగపడ్డాయి.

అయినప్పటికీ, భావవాది కావడం వల్ల హెగెల్ నికార్సయిన శాస్త్రీయ గతితార్కిక వాదాన్ని తన సొంతం చేసుకోలేకపోయాడు. ఆయన సిద్ధాంతం వ్యవస్థకు విధానానికి మధ్య తీవ్రమయిన అంతర్గత వైరుధ్యంతో సతమతమయ్యింది. ప్రకృతి గురించి, సమాజం గురించి, చైతన్యం గురించి ఆ కాలంలో ఉన్న అవగాహన తనలో ఐక్యం చేసుకొని సమగ్రమయిన, అంతిమ సత్యాన్ని కనుగొనే ప్రయత్నం చేసాడు. కాబట్టి, ఆయన తత్వశాస్త్ర విధానం పునాదిలోనే అధిభౌతికం. మరోవైపు ఆయన తత్త్వం అభివృద్ధి పొందిన పద్ధతి మాత్రం గతితార్కికం.

గతితార్కికం ఎప్పుడూ ఏ విషయమయినా సంపూర్ణంగా ఉంటుంది అన్న అభిప్రాయాన్ని తిరస్కరిస్తుంది, దేన్నయినా ఎప్పుడయినా పరిమితమయిన అభివృద్ధి దశలోనే వీక్షించాల్సి ఉంటుంది అని భావిస్తుంది. ఏది ఏమయినప్పటికీ హెగెల్ తన సాంప్రదాయ బద్ధమయిన వస్తుగత భావవాదం కోసం ఆయన గతితార్కిక పద్ధతిపై అంతగా శ్రద్ధ చూపలేదు. ఆయన ఉద్దేశ్యంలో అభివృద్ధి ఎల్లవేళలా అన్ని చోట్లా సంభవించదు; ప్రకృతి అభివృద్ధి చెందదు, 'సమగ్రమయిన భావం' మాత్రం తన పునాదిని పదిల పరచుకుంటూ అభివృద్ధి దశలో ఉంటుంది. 'సమగ్రమయిన భావం' కూడా అభివృద్ధి చెందుతున్న ఒక దశలో ఆగిపోతుంది, ఇక ముందుకు వెళ్లలేక వెనక్కి తిరిగి వస్తుంది అని హెగెల్ భావించాడు. అంటే హెగెల్ అభిప్రాయం ప్రకారం గతం పునరావృతమవుతుంది. అంటే హెగెల్ గతితార్కికం విశిష్టంగా పూర్వవర్తి సిద్ధాంతం. సమాజానికి సంబంధించిన చరిత్ర రాజ్యాంగబద్ధమయిన భూసంపత్తి గలిగిన

ప్రష్యన్ సామ్రాజ్యంతో అంతమౌతుందని, తత్వశాస్త్రపు చరిత్ర అంతా తన భావవాదం శైలిలో ఉచ్ఛ స్థానం పొందుతుందని హెగెల్ విశ్వసించాడు. (జర్మనీలో ప్రష్యా ఒక భాగంగా ఉండేది. క్రీ. శ. 1530వ దశకంలో జర్మనీలో కలిసిపోయింది. మళ్లీ ప్రష్యా పునరుత్థానం పొందుతుందని, అంటే చరిత్ర వెనక్కి వెళుతుందని హెగెల్ భావన – అనువాదకుడు). అభివృద్ధి క్రమాన్ని కేవలం భావాల గతితార్కికంగా సూక్ష్మీకరించి అభివృద్ధిని మరుగుపరచాడు. ఆయన సిద్ధాంతం లాగే ఆయన కూడా భావవాద గతితార్కిక వాది మాత్రమే. హెగెల్ గతితార్కిక వాదాన్ని గురించి మార్క్స్ ఇలా అన్నాడు: "హెగెల్ గతితార్కికం తలక్రిందులుగా ఉంది. నిగూఢంగా గుల్లలో దాక్కున్న ఆయన తత్త్వంలోని వివేచనతో కూడిన సారాన్ని మనం పూర్తిగా అర్థం చేసుకోవాలంటే దాన్ని నిటారుగా నిలబెట్టాలి."

మార్క్సిజానికి ఆద్యులు భౌతికవాదం గురించి ఫ్యూయర్‌బా బోధనలపై కూడా ఆధారపడ్డారు. ప్రష్యన్ భూస్వామ్య అగ్రవర్గంతో రాజకీయంగా రాజీపడ్డ జర్మన్ బూర్జువాలకు అనుకూలంగా తన సిద్ధాంతాన్ని వ్యక్తపరచిన హెగెల్‌లాగా కాకుండా, ఫ్యూయర్‌బా 1830, 1840లలో బూర్జువా వర్గంలోని రాడికల్ విభాగానికి చెందిన భావవాది. ఆ కాలంలోనే జర్మనీలో 1848 బూర్జువా విప్లవానికి బీజాలు పడ్డాయి. ఆయన చాలా బలంగా హెగెల్ భావవాదాన్ని, మొత్తంగా భావవాద సిద్ధాంతాన్ని వ్యతిరేకించాడు. మతపరమయిన వేదాంత శాస్త్రంతో సంబంధం కలిగిన హెగెల్ తత్వాన్ని ఎత్తి చూపుతూ ఫ్యూయర్‌బా, ప్రాపంచిక జ్ఞానానికి సంబంధించి భావవాదాన్ని పూర్తిగా తిరస్కరించి,




ప్రకృతియే ప్రాథమికమని, అదే మనిషిని చైతన్యవంతుణ్ణి చేస్తుందని వాదించాడు. ఫ్యూయర్‌బా ఈ విధంగా రాసాడు: "ఆత్మయే ప్రారంభమని, ప్రాథమిక వనరు అని వాదిస్తే అది ప్రకృతిలో ఉండే క్రమ బద్ధతను వక్రీకరించి తప్పుగా అన్వయించినట్టే!" 'సమగ్రమయిన ఆత్మ' గురించి సారంలేని సిద్ధాంతాలు వల్లించడం తత్వశాస్త్రం లక్ష్యం కాదని, అదే లక్ష్యమయితే మెదడు నుండి ఆలోచనను వేరు చేసినట్టేనని, ఆలోచించడం అనే క్రియ దానికదే స్వతంత్రంగా ఉనికిలో ఉంటుందని నమ్మినట్టేనని ఫ్యూయర్‌బా వాదించాడు. మనిషిని, ప్రకృతిని ఉన్నవి ఉన్నట్టుగా అధ్యయనం చెయ్యాలని సూచించాడు. ప్రకృతి తనలోనే తాను, తనకు తానుగా జీవిస్తుంది; మనిషి అందులో భాగం; ప్రకృతిని ఆ విధంగానే చూడాలని ఆయన భావించాడు. ప్రకృతి అంతరాళంలో, అనంత కాలంలో జీవించి ఉంటుంది. ప్రకృతిని గురించి మనం అధ్యయనం చెయ్యవచ్చు. తార్కికంగా స్పష్టమయిన రూపంలేని అమూర్తమయిన వర్గీకరణలను సూత్రీకరించకుండా బయటి ప్రపంచంలో ప్రతిఫలించే ప్రకృతిని గురించి మనిషి తన గ్రాహక ఇంద్రియాల ద్వారా, వాటి గురించి అవగాహన పెంచుకోవడం ద్వారా తెలుసుకోవచ్చు. హెగెల్‌తో విభేదించిన సందర్భంలో ఆయన ఈ రకంగా తన అభిప్రాయం వెలిబుచ్చాడు: "హేతుబద్ధమయినదే నిజమని, వాస్తవమని పురాతన తత్త్వం విశ్వసించింది, కానీ ఆ తర్వాత వచ్చిన నూతన తత్వ విచారం మనిషి మాత్రమే నిజమని, వాస్తవమని సూచిస్తున్నది. నిజానికి మానవుడు హేతుబద్ధంగా ఉండగలడు; మనిషి మాత్రమే హేతువుకు కొలబద్ధ."

ఆ విధంగా ఫ్యూయర్‌బా, తన భౌతికవాద సిద్ధాంత రూపకల్పనను సజీవంగా ఉన్న, ఇంద్రియ జ్ఞానం కలిగిన మనిషి నుండి ప్రారంభించి తత్వశాస్త్రానికి మానవ విజ్ఞాన శాస్త్ర పరిజ్ఞానాన్ని జోడించాడు. మానవ విజ్ఞాన శాస్త్ర కోణం నుండి భావవాద సిద్ధాంతాన్ని అవలోకించి మనిషి కేవలం ఆలోచించే ప్రాణి మాత్రమే అని విడమరచి చెపుతూ, ఆత్మ శరీరం అనే ద్వంద్వ అస్తిత్వాలు ఉనికిలో ఉంటాయన్న మత సిద్ధాంతాలు అసంబద్ధంగా, విడ్డూరంగా ఉన్నాయని, అవన్నీ అబద్ధాలని తెగించి చెప్పాడు. తనకు అందుబాటులో ఉన్న ప్రకృతి శాస్త్రాల విజ్ఞానాన్ని ఆధారం చేసుకొని ఫ్యూయర్‌బా అంతవరకూ హెగెల్ భావవాదంచే కిందకు తోసివేయబడ్డట్టుగా ఉన్న భౌతికవాదానికి 19వ శతాబ్దపు ప్రారంభ దశాబ్దాలలో తిరిగి పునరుత్థానం కావించాడు. ఇది భౌతికవాద ప్రాపంచిక దృక్పథానికి ఫ్యూయర్‌బా చేసిన గొప్ప సేవ.

ఏది ఏమయినప్పటికి మొత్తం మీద, ఫ్యూయర్‌బా సిద్ధాంతం

# "తరహాలు" అన్నీ సారం కోల్పోయిన డొల్లలే

**- సి.యస్.ఆర్. ప్రసాద్**

వీక్షణం సెప్టెంబర్ 2021 సంచికలో "కమ్యూనిస్టు సారంలేని చైనా కమ్యూనిస్టు పార్టీ" అనే శీర్షికతో నేను రాసిన వ్యాసం అచ్చు అయింది. నవంబర్ సంచికలో ఎం. సజయ రాసిన "చైనా కమ్యూనిస్టు పార్టీ సమీక్ష–మంత్లీ రివ్యూ పునరాలోచన" అనే వ్యాసం అచ్చు అయింది. "ఇది ప్రసాద్‌గారి వ్యాసం పై చర్చే కాదు" అని ఆమె అందులో ప్రస్తావించినా, నా వ్యాసం గురించి కొన్ని విశేషణాలు వాడారు. "పాత వాదనే", "పాత అవాస్తవాలు, పాత వక్రీకరణలనే ఆధారంగా చూపెట్టారు" అనీ, "తుది తీర్పులు చెప్పారు ప్రసాద్" అనీ, "ఊహాజనిత సోషలిజం దృష్టితోనూ, పిడివాద దృక్కోణం నుండి చేసినది ప్రసాద్ విమర్శ అనడానికి ఇదొక్కటి చాలు'' అనీ ప్రస్తావించారు. ఈ చివరి ప్రస్తావన గురించి ముందు నా అభిప్రాయం చెప్తాను. నేను చైనాలో కమ్యూనిజం ఉందా లేదా అనే చర్చే చేయలేదు. అక్కడి కమ్యూనిస్టు పార్టీ తన కమ్యూనిస్టు సారాన్ని పోగొట్టుకున్నదని మాత్రమే అన్నాను. నిజానికి ఏ ఒక్క సమాజమూ ఇంత త్వరితంగా కమ్యూనిస్టు సమాజంగా మారుతుందన్న భావన నాకు లేనే లేదు.

చైనా ప్రజా రిపబ్లిక్ ప్రయాణం అక్కడి పాలక కమ్యూనిస్టు పార్టీ ఆధ్వర్యంలో ఏ దిశగా అడుగులు వేస్తోందో తెలియచెప్పడమే నా ఉద్దేశం. దీనికి నేను నా బుర్రలో తొలిచిన ఉదాహరణలనో, ఆధారాలనో చూపెట్టలేదు. అయినా నా మీద అలాంటి వ్యాఖ్యలు వచ్చాయి కాబట్టి నాకు తెలిసిన మేరకు చైనా కమ్యూనిస్టు పార్టీ తన కమ్యూనిస్టు సారాన్ని కోల్పోయిందనే అభిప్రాయం ఎందుకు కలిగిందో చెప్పడానికి అధికారిక వాస్తవాలను మళ్లీ ఉటంకిస్తున్నాను. ఇందులో మొదటిది: చైనా రాజ్యాంగం. ఈ దిగువన నేను ప్రస్తావిస్తున్న అంశాలన్నీ 1982లో ఆమోదించబడి, 2018లో సవరించబడిన చైనా రాజ్యాంగంలోనివే. ఎవరి వ్యాసంలో నుంచీ తీసుకున్నవి కావు.

**పీఠిక:** ఏ రాజ్యాంగానికైనా ఒక పీఠిక వుంటుంది. అది ఆ రాజ్యాంగపు తాత్వికతకు అద్దం పడుతుంది. చైనా రాజ్యాంగ పీఠికలో ఏముందో చూద్దాం.

"చైనాలో ప్రజా రిపబ్లిక్ స్థాపన తరువాత చైనా సమాజం నూతన ప్రజాస్వామిక దశనుండి **సోషలిస్టు సమాజం**గా పరిణామం చెందడం దశలవారీగా పూర్తి అయింది. ఉత్పత్తి సాధనాలపై ప్రైవేటు యాజమాన్యాన్ని **సోషలిస్టు యాజమాన్యం**గా మార్చే ప్రక్రియ కూడా పూర్తి అయింది. మనిషిని మనిషి దోచుకునే వ్యవస్థ రద్దు అయింది. **సోషలిస్టు వ్యవస్థ** ఏర్పడింది. శ్రామికవర్గ నియంతృత్వ సారాంశమైన, ప్రజల ప్రజాస్వామిక నియంతృత్వం, కార్మికుల, రైతుల మిత్రత్వం పునాదిగా కార్మికవర్గ నాయకత్వంలో అభివృద్ధి చెంది సంఘటిత మైంది."

''ఆర్థికాభివృద్ధిలో ప్రధానమైన విజయాలను సాధించాం. స్వతంత్రమైన, చాలావరకు సమగ్రమైన సోషలిస్టు పారిశ్రామిక

---

చారిత్రిక పరిస్థితుల వల్ల కొన్ని పరిమితులకు కట్టుబడి ఉన్నది; 18వ శతాబ్దపు భౌతిక వాదంలో సహజసిద్ధంగా ఉండిన కొన్ని లోపాల వల్ల కొంతమేరకే వృద్ధి పొందగలిగింది. మనిషిని సామాజిక జీవిగా పరిగణించకుండా శారీరకంగా, జీవశాస్త్ర సంబంధిత అంశంగా మాత్రమే పరిశీలించిన ఆయన మానవ విజ్ఞాన శాస్త్ర సిద్ధాంతం కూడా అధిభౌతికమే. వాస్తవమయిన మనుష్య జీవితాన్ని సమాజానికి, సామాజిక సంబంధాలకు అతీతంగా జమకట్టలేము. మానవ విజ్ఞాన శాస్త్రం కోణం నుండి సామాజిక చరిత్రను అంచనా వేయాలని ప్రయత్నిస్తే, అది సరిఅయిన ఫలితాలు ఇవ్వకపోవచ్చు. ఆ రకంగా ఫ్యూయర్‌బాని భావవాది కిందనే లెక్క గట్టవచ్చు. మతంలో వచ్చిన మార్పులను బట్టే మానవ చరిత్రలోని వివిధ దశలలో విభిన్నమయిన పరిణామాలు సంభవించాయని ఆయన నమ్మాడు. అంతకు పూర్వం ఉన్న అన్ని మతాలను తోసిపుచ్చి, ఫ్యూయర్‌బా "దేవుడు లేని" ఒక కొత్త మతాన్ని స్థాపించాల్సిన అవసరం ఉందన్నాడు. అది "ప్రేమ మతం" కావాలి; "ప్రేమలో మాత్రమే నిజమయిన, వాస్తవమయిన దేవుడు ఉన్నాడు" అని ఆయన భావించాడు. ఆ మతంలో "ఇద్దరే ఇద్దరు.. భార్య, భర్త..". ఆయన ప్రధానంగా సెక్స్‌తో కూడిన ప్రేమను, స్త్రీ పురుషుల శారీరక సంబంధాలను "మతం" హోదాకు పెంచాడు. ఈ సంబంధాలను సహజ సామాజిక సంబంధాలుగా పరిగణించకుండా ఆయన, పూర్తిగా స్వచ్ఛమయిన ప్రేమ, స్నేహం లాంటి మానవ సంబంధాలను ఒక నూతన నికార్సయిన మతంగా పరిగణించాలని ప్రతిపాదించాడు. అయితే, మతపరమయిన భావవాదానికి ఆయన వీడ్కోలు పలికినట్టుగా భావించవచ్చు. కానీ, హెగెల్ భౌతికవాదంలోని అనుకూల అంశాలను ఫ్యూయర్‌బా ఉపేక్షించాడు. ఇది ఆయన తత్త్వంలో మరొక ముఖ్యమయిన లోటుగా పరిగణించవచ్చు. ప్రకృతికి ఉన్న ప్రాధాన్యతను ఫ్యూయర్‌బా సరిగ్గానే గుర్తించాడు కాని, దాని వస్తుగత గతితార్కికాన్ని అవగాహన చేసుకోలేకపోయాడు.

ఈ విధంగా హెగెల్, ఫ్యూయర్‌బాల తాత్విక విచారాలను సంక్షిప్తంగా పరిశీలించడం వల్ల గతితార్కిక భౌతికవాదం రూపుదిద్దుకోవడంలో సిద్ధాంత వనరులు ఏ రకంగా ప్రత్యక్షంగా, పరోక్షంగా పనిచేసాయో మనం తెలుసుకునే వీలు కలుగుతుంది. నిజానికి, మార్క్సిజం ప్రారంభకులు ఈ రకమయిన తత్వవేత్తల హేతుబద్ధ మయిన భావనలను సృజనాత్మకంగా విపులీకరించడమే కాదు, వారి పూర్వీకుల యోచనల నన్నింటినీ ప్రశస్తంగా పరిగణనలోకి తీసుకున్నారు. ఇంకా వారు ప్రకృతి విజ్ఞాన శాస్త్రాలు సాధించిన విజయాలను గురించి సిద్ధాంతీకరణ చేశారు; రాజకీయార్థిక శాస్త్రం నుండి, చరిత్ర నుండి లభించిన సమాచారాన్ని విశ్లేషించి ఊహాజనిత సోషలిజంపై విమర్శనాత్మ కమయిన పరిశీలన చేశారు. తమ శ్రమ శక్తిని దోపిడీ చేస్తున్న దోపిడీదారులకు వ్యతిరేకంగా శ్రామిక జనుల పోరాటాలను విశ్లేషించడం, శ్రామిక వర్గ నాయకులుగా వర్గపోరాటంలో ప్రత్యక్షంగా పాల్గొనడం మార్క్స్, ఎంగెల్స్‌ల గతితార్కిక భౌతికవాద భావనలు రూపు దిద్దుకోవడానికి ప్రధాన కారణాలుగా భావించవచ్చు. ఈ అంశాలన్నీ తత్వశాస్త్రంలో నిఖార్సయిన విప్లవంగా భావించబడే ఉన్నతమయిన భౌతికవాదం ఆవిర్భవించడానికి తోడ్పడ్డాయి. వీ

వ్యవస్థను రూపొందించుకున్నాం. సోషలిస్టు భావజాల విద్యా ప్రచారం గణనీయమైన ఫలితాలను అందించింది."

''చైనా దీర్ఘకాలంపాటు సోషలిజానికి సంబంధించిన ప్రాథమికదశలో ఉంటుంది. **చైనా తరహా సోషలిజం** పంథాలో **సోషలిస్టు ఆధునికీకరణ**పై దృష్టిని కేంద్రీకరించడం మన ప్రాథమిక కర్తవ్యం. చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం కింద, మార్క్సిజం–లెనినిజం–మావో ఆలోచనా విధానం, డెంగ్ జియావో పింగ్ సిద్ధాంతం, గ్జీ జిన్ పింగ్ సోషలిస్టు ఆలోచనా విధానం– అంటే నూతన శకానికి తగినట్లుగా చైనా తరహా సోషలిజం వెలుగులో ఈ విజయాలన్నీ సాధించాం."

"మనదేశంలో దోపిడీ వర్గాలు ఒక వర్గంగా రద్దయ్యాయి. అయినా వర్గ పోరాటం కొన్ని పరిమితుల లోపల సుదీర్ఘకాలం కొనసాగుతుంది. చైనా సోషలిస్టు వ్యవస్థపట్ల శత్రుపూరిత వైఖరి కలిగి ఉండి దాన్ని నిర్మూలించడానికి కృషి చేస్తున్న ఇంటా బయటా వున్న శక్తులతో చైనా ప్రజలు పోరాడాలి."

**సాధారణ సూత్రాలు:**

ఆర్టికల్ 1: చైనా ప్రజా రిపబ్లిక్ ఒక **సోషలిస్టు దేశం**.

ఆర్టికల్ 6: సోషలిస్టు ఉత్పత్తి సాధనాలను సోషలిస్టు ప్రజా యాజమాన్యం కింద – అంటే ప్రజలందరి యాజమాన్యం– కార్మికుల సమష్టి యాజమాన్యం – ఉంచడం చైనా సోషలిస్టు ఆర్థిక వ్యవస్థకు పునాది. సోషలిస్టు ప్రజా యాజమాన్యం ఒక మనిషిని వేరొక మనిషి దోపిడీ చేసే పద్ధతిని రద్దు చేస్తుంది. "ప్రతి వ్యక్తీ తన శక్తిమేరకు పనిచేయడం, తన శ్రమకు తగిన ఫలితాన్ని పొందడం" అనే సూత్రాన్ని అమలుచేస్తుంది.

ఆర్టికల్ 7: ప్రభుత్వ యాజమాన్యంలోని ఆర్థిక వ్యవస్థ – అంటే ప్రజలందరి యాజమాన్యంలోని సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ – జాతీయ ఆర్థిక వ్యవస్థలో ప్రధానశక్తిగా ఉంటుంది. రాజ్య యాజమాన్యంలోని ఆర్థిక వ్యవస్థను సంఘటితం చేయడానికి, అభివృద్ధి చేయడానికి రాజ్యం కృషి చేస్తుంది.

ఆర్టికల్ 10: నగరాలలో భూమి అంతా రాజ్య యాజమాన్యం కింద ఉంటుంది. గ్రామీణ, పట్టణ శివారు ప్రాంతాలలో భూమి సహకార సంఘాల యాజమాన్యంలో ఉంటుంది. చట్టబద్ధంగా రాజ్యానికి చెందిన భూమి మాత్రం దీనికి మినహాయింపు. ఇళ్ల స్థలాలు, కొండ ప్రాంతాలు, సాగుకు పనికివచ్చే ప్రైవేట్ ప్లాట్లు కూడా సహకార సంఘాల యాజమాన్యాల కింద ఉంటాయి. రాజ్యం ప్రజా ప్రయోజనాల దృష్ట్యా చట్టబద్ధమైన పద్ధతిలో భూమిని స్వాధీనం చేసుకోవచ్చు. అలా స్వాధీనం చేసుకున్న భూమికి నష్టపరిహారం చెల్లించాలి.

ఆర్టికల్ 13: ప్రజలకు చట్టబద్ధంగా ఉన్న వ్యక్తిగత ఆస్తి అనుల్లంఘనీయమైనది. రాజ్యం చట్టానికి అనుగుణంగా ప్రజలకున్న వ్యక్తిగత ఆస్తి హక్కును, వారసత్వపు హక్కును కాపాడుతుంది.

ఆర్టికల్ 15: రాజ్యం సోషలిస్టు మార్కెట్ ఆర్థిక వ్యవస్థను అమలులో పెట్టాలి.

ఆర్టికల్ 19: రాజ్యం సోషలిస్టు విద్యాసంస్థలను అభివృద్ధి చేస్తుంది. ప్రజలందరి శాస్త్రీయ, సాంస్కృతిక స్థాయిని పెంచడానికి కృషి చేస్తుంది.

ఆర్టికల్ 24: ఉన్నతమైన ఆదర్శాలు, నైతికత, సాధారణ విద్య, క్రమశిక్షణ, న్యాయవ్యవస్థ వంటి వాటిని వ్యాప్తి చేయడం ద్వారా సోషలిస్టు ఆధ్యాత్మికతను (స్పిరిట్యువల్) నాగరికతను శక్తివంతం చేస్తుంది.

"పెట్టుబడిదారీ, భూస్వామ్య తదితర కాలం చెల్లిన భావాలను వ్యతిరేకించేటట్లుగా ప్రజలను విజ్ఞానవంతులను చేస్తుంది."

ఆర్టికల్ 36: చైనా పౌరులకు తమ మత విశ్వాసాలను కొనసాగించుకునే స్వేచ్ఛ ఉన్నది. ఒక మతంలో నమ్మకం వుంచుకోమనిగాని, లేదా నమ్మకం వుంచుకోవద్దనిగాని రాజ్యం లేదా సంస్థలు లేదా వ్యక్తులు పౌరులను వత్తిడి చేయరాదు. సాధారణమైన మత కార్యకలాపాలకు రాజ్య రక్షణ ఉంటుంది.

చైనా పార్లమెంటు అయిన నేషనల్ పీపుల్స్ కాంగ్రెస్ తన సమావేశంలో చైనా అధ్యక్ష, ఉపాధ్యక్షుల పదవీ పర్యాయాలపై ఉన్న పరిమితిని తొలగిస్తూ 2018లో రాజ్యాంగాన్ని సవరించింది. పాత నిబంధనల ప్రకారం ఏ వ్యక్తీ ఈ పదవులకు రెండు పర్యాయాల కంటే ఎన్నికకావడానికి వీలులేకుండా పరిమితి విధించారు, దాన్ని ఇప్పుడు రద్దు చేశారు. అంటే ఒకే వ్యక్తి ఎంతకాలమైనా చైనా అధ్యక్షుడుగా కొనసాగవచ్చునన్నమాట.

**ఛారిటీ కిచెన్:** 2021, నవంబరు 11న గ్లోబల్ టైమ్స్ (చైనాకు చెందిన పీపుల్స్ డైలీకి అనుబంధ పత్రిక)లో వచ్చిన వార్త. తూర్పు చైనాలోని జియాంగ్జీ రాష్ట్రంలోని నాన్‌చాంగ్ పట్టణంలో గల ఒక క్యాన్సర్ ఆసుపత్రిలో చికిత్స పొందుతున్న రోగుల కోసం వచ్చే బంధువులకు భోజన సదుపాయాన్ని కల్పించేందుకు ఒక ఛారిటీ కిచెన్‌ను ఏర్పాటు చేసిన ఒక వృద్ధ జంటను చైనా ప్రభుత్వం నైతిక విషయాలలో రోల్‌మోడల్స్‌గా ఎంపికచేసినట్లు ప్రకటించింది. అంటే ప్రభుత్వం తీసుకోవల్సిన బాధ్యతను ఇంకా ప్రజలలోనే కొంతమంది తీసుకోవల్సిన స్థితి అక్కడ వున్నదన్నమాట.

**కన్ఫ్యూషియస్ భావజాల పునరుద్ధరణ:** 2021 సెప్టెంబర్ 21న చైనాలో ప్రపంచ కన్ఫ్యూషియస్ మహాసభ జరిగింది. ఆయన భావజాలాన్ని పునరుద్ధరించి వర్తమాన చైనాకు అన్వయించడం ఎలానో ఆలోచించడం కోసం ఇది జరిగింది. పాతకాలపు చైనాలో ఆయనను గొప్ప ఋషిగా గౌరవించారు. అయితే విప్లవకాలంలోనూ, సాంస్కృతిక విప్లవకాలంలోనూ ఆయనను అభివృద్ధి నిరోధకుడుగా వర్ణించారు. మే 4 ఉద్యమ కాలం నుండి సాంస్కృతిక విప్లవం పూర్తి అయ్యేవరకు ఆయనను "భూస్వామ్య భావజాల ప్రవక్తగా, సామాజికాభివృద్ధిని ఆటంకపరిచిన వ్యక్తి''గా మావో వర్ణించారు. కన్ఫ్యూషియస్ భావజాలపు కాడిని మోసినంతకాలం చైనా జాతికి విముక్తి ఉండదని ఆయన భావన. అలానే లూసన్ కూడా తన రచనలలో కన్ఫ్యూషియస్ భావజాలపు భూస్వామ్య అనుకూల స్వభావాన్ని ఎండకట్టారు.

అయితే 2014లో అధ్యక్షుడు గ్జీ ఇలా అన్నారు."కన్ఫ్యూషియనిజం, ఇతర తాత్విక భావనలు, సంస్కృతులు చైనాలో రూపుదిద్దుకుంటూ అభివృద్ధి చెందుతున్నాయి. చైనా తన జాతి సారాంశాన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్న కాలంలో జాతి సాధించిన ఆధ్యాత్మిక అనుభవాలు, హేతుబద్ధ ఆలోచన, సాంస్కృతిక విజయాల రికార్డులు అవి."

"కన్ఫ్యూషియనిజం ప్రాతినిధ్యం వహిస్తున్న చైనా సాంప్రదాయక సంస్కృతి సాంఘిక సయోధ్యను, సామరస్యాన్ని, గుర్తింపును అభివృద్ధి చేయడానికి అవసరమైన, పటిష్టమైన విలువలను అందించగలదు." ఈ మాటలన్నది షాండాంగ్ యూనివర్శిటీలోని ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కన్ఫ్యూషియస్ స్టడీస్ శాఖ అధ్యక్షుడు వాంగ్ (WANG XYEDIAN)

కన్ఫ్యూషియస్ ఇనిస్టిట్యూట్ 2004లో స్థాపించారు. చైనా సంస్కృతి, భాషల అభివృద్ధిపై దృష్టి కేంద్రీకరించడం దీని బాధ్యత.

చైనాకు చెందిన వివిధ తాత్విక ఆలోచనా విధానాల్లో నిస్వార్థమైన సేవకు ప్రాధాన్యత లభించింది. మోహిజం[1], తావోయిజంలతో పాటు కన్ఫూషియస్ భావజాలంలోని సంక్షేమవాదం కూడా చైనా సమాజాన్ని ప్రభావితం చేసింది. ఇతరులకు విస్తృతంగా సేవ చేసేవాడే ఋషి అని కన్ఫ్యూషియస్ పేర్కొన్నారు. (1. మోహిజం : క్రీ.పూ. 5వ శతాబ్దంలో మోజీ అనే తత్వవేత్త స్థాపించిన తాత్విక అధ్యయన కేంద్రం. ఆయన కన్ఫ్యూషియస్ భావజాలాన్ని, క్రతువులపై వక్కాణింపును వ్యతిరేకిస్తూ సవాల్ చేశారు.)

**చైనా అంతర్జాతీయ దిగుమతుల ఎక్స్‌పో:** ప్రపంచంలోని విలాసవంతమైన వస్తువులు, సౌకర్యాల కల్పనకు సంబంధించిన వ్యాపార సంస్థలు చైనాలో నానాటికీ పెరుగుతున్న భాగ్యవంతులైన మధ్యతరగతిని అంటిపెట్టుకుని ఉన్నాయి. దీని నాల్గవ ప్రదర్శన ఈ నవంబర్ (2021) నెలలోనే చైనాలో జరిగింది. 280కి పైగా గ్లోబల్ 500 కంపెనీలు తమ విలాస వస్తువులను ఈ ఎక్స్‌పోలో ప్రదర్శనకు, అమ్మకాలకు పెట్టాయి. ఇందులో 70.72 బిలియన్ అమెరికన్ డాలర్ల విలువైన అమ్మకాలు జరిగాయి. చైనాలోని అనేక స్థానిక సంస్థలు, వ్యాపార సంస్థలు వివిధ దేశాల నుండి వచ్చిన వ్యాపార సంస్థలతో దిగుమతి ఒప్పందాలు కుదుర్చుకున్నాయి.

ఈ ప్రదర్శనలో అనేక ఐరోపా దేశాలకు చెందిన వ్యాపార సంస్థలు, ముఖ్యంగా దుస్తుల తయారీ సంస్థలు పాల్గొన్నాయి. వాటి అమ్మకాలు క్రమక్రమంగా చైనాలో ఊహించిన దానికంటే ఎక్కువగా జరుగుతున్నాయి. త్వరత్వరగా మారిపోయే ఫ్యాషన్ డిజైనింగ్ కంపెనీలు చైనాలో జరిగే ఈ ప్రదర్శనలలో పాల్గొనడానికి విపరీతంగా పోటీపడుతున్నాయి. వీటిల్లో ఒకటైన యునిక్లో కంపెనీ 2020లో దక్షిణకొరియాలో తన స్టోర్లు 26ని మూసివేసింది. కాని గత సంవత్సరం చైనాలో 66 కొత్త షాపులను తెరిచింది. దీనికి కారణం చైనా వినియోగదారుల కొనుగోలు శక్తి బాగా పెరగడం. ఇకనుండి సంవత్సరానికి కనీసం 80 నుండి 100 కొత్త షోరూమ్‌లను చైనాలో తెరవడానికి ప్రయత్నిస్తున్నామని ఆ కంపెనీ సి.ఇ.ఓ. చెప్పాడు.

**కార్ల అమ్మకాలు:** 2018లో ప్రపంచవ్యాప్తంగా అమ్ముడైన విలాసవంతమైన కార్లలో 30 శాతం కార్లు ఒక్క చైనాలోనే అమ్ముడయ్యాయి. 2018లో జపాన్‌లో 5.2 మిలియన్ల కార్లు, ఐరోపాలో 16.5 మిలియన్ కార్లు, అమెరికాలో 17 మిలియన్ల కార్లు అమ్ముడుకాగా, ఒక్క చైనాలో 28 మిలియన్ల కార్లు అమ్ముడయ్యాయి. ప్రపంచవ్యాప్తంగా విలాసవంతమైన కార్లను తయారుచేసే కంపెనీలు అన్నీ చైనా వ్యాపారస్తులతో సంబంధాలు పెట్టుకుని కార్ల తయారీ పరిశ్రమను స్థాపించడానికి పోటీపడుతున్నాయి. అంతేకాక వ్యక్తుల ప్రత్యేక అభిరుచులకు అనుగుణంగా అత్యంత ఖరీదైన విలాసవంతమైన కార్లను కూడా చైనాలో తయారుచేస్తున్నారు.

ప్రేమికుల దినోత్సవం సందర్భంగా విలాసవస్తువుల అమ్మకాలు గత సంవత్సరం రెట్టింపు అయ్యాయని బెయిన్ అనే కంపెనీ ప్రకటించింది. 2019లో తమ వస్తువుల అమ్మకాలు 11శాతం పెరిగితే ప్రస్తుతం 20శాతానికి పెరిగాయని అదే సమయంలో ప్రపంచ మార్కెట్‌లో అమ్మకాలు తగ్గాయని, 2021లో అమ్మకాలు 23శాతం పెరుగుతాయని ఆశిస్తున్నామని ఆ కంపెనీ ప్రకటించింది.

**రియల్ ఎస్టేట్ :** చైనాలోని రియల్ ఎస్టేట్ రంగంలో మూడు ప్రధానమైన వ్యాపారసంస్థల 2020అమ్మకాల వివరాలు. ఒకటి, కంట్రీ గార్డెన్ హోల్డింగ్స్ అమ్మకాల విలువ 749.36 బిలియన్ యువాన్లు. రెండు, ఎవర్ గ్రాండే గ్రూప్ 696.47 బిలియన్ యువాన్లు. మూడవది, చైనా వాంకే కంపెనీ 992.05 బిలియన్ యువాన్లు.

వీటిల్లో ఎవర్ గ్రాండే కంపెనీ 1996లో ప్రారంభమై 280 నగరాలకు వ్యాప్తి చెందింది. విచక్షణా రహితంగా చేసిన ఖర్చులవల్ల అప్పులవల్ల ఇది 300 బిలియన్ల్ డాలర్ల అప్పులో కూరుకుపోయింది. దీనితోపాటు మిగతా రియల్ ఎస్టేట్ సంస్థలు కూడా అప్పుల పాలవడంతో ప్రభుత్వానికి అది తలనొప్పి సమస్యగా మారింది. చాలా నగరాలలో ప్రజలు ఆ కంపెనీలమీదకి ఎగబడడం వాళ్లు కట్టి ఖాళీగా వదిలివేసిన అపార్టుమెంట్లను ఆక్రమించుకోవడం జరుగుతోంది. ఈ మధ్యకాలంలోనే ప్రభుత్వం వీటిని కట్టడి చేయడానికి కొన్ని నియంత్రణా చర్యలను చేపట్టింది.

**సమష్టి సౌభాగ్యం:** ప్రస్తుత అధ్యక్షుడు గ్జీ చైనా ఆర్థికవ్యవస్థను పునర్ నిర్మాణం చేయడంలో భాగంగా “ఇప్పుడు సమష్టి సౌభాగ్యం” అనే పదాన్ని తరచూ ఉపయోగిస్తున్నారు. అంటే ప్రజలందరూ తమ జీవితాల్లో భౌతిక, ఆధ్యాత్మిక (స్పిరిట్యువల్) నైతిక రంగాలలో అభ్యున్నతిని సాధించడమే. ముఖ్యంగా రియల్ ఎస్టేట్ రంగం మీద. గుత్తవ్యాపార సంస్థలమీద రాజ్య నియంత్రణను బిగించడం, ప్రైవేటు రంగాన్ని క్రమబద్ధం చేయడం, మధ్యతరగతిని విస్తృతం చేయడం, సంపద పోగుపడడాన్ని అరికట్టటం దీని లక్ష్యం. దీనికోసం చైనా ప్రభుత్వం ఆస్తి పన్నును తిరిగి ప్రారంభించాలని, రియల్ ఎస్టేట్ రంగంలో సత్తా వ్యాపారాన్ని క్రమబద్ధం చేయాలని నిర్ణయించింది.

అప్పులను తగ్గించడం, ప్రైవేటు రంగంలో, ముఖ్యంగా సమాచార సాంకేతిక రంగంలో ప్రైవేటు రంగాల ఆధిపత్యాలను తగ్గించడం ప్రధానమైనది. దానితోపాటు ఆ ప్రభుత్వం గత సంవత్సరం చైనాలో ప్రధాన మల్టినేషనల్ కంపెనీ అయిన ఆలీబాబా ఆస్తులపై పరిశోధనలకు ఆదేశాలు ఇవ్వడం, విపరీతంగా పెరిగిపోతున్న అత్యంత అధికమైన లాభాలను సాధిస్తున్న ప్రవేటు విద్యా వ్యవస్థలపై నియంత్రణ చర్యలుకూడా ఉన్నాయి. దీనితోపాటు ఎవర్ గ్రాండే వంటి వ్యాపార సంస్థలకు, అవి అప్పులు చెల్లించకపోతే గతంలోలాగా అప్పుల నుండి బయటపడడానికి తాము సౌకర్యం కల్పించనని కూడా ప్రభుత్వం ప్రకటించింది. ఈ చర్యల ఫలితంగా చైనా ప్రైవేటు రంగ కంపెనీల మార్కెట్ విలువ ఒక ట్రిలియన్ అమెరికన్ల డాలర్లమేరకు నష్టపోయింది. అయితే ఇక్కడ వేసుకోవల్సిన ప్రధానమైన ప్రశ్న ఒకటి వుంది. అమెరికాలో గతంలో తలెత్తిన సబ్‌ప్రైమ్ లెండింగ్ సంక్షోభంలాంటిది “సోషలిస్టు” చైనాలో ఎందుకు ఏర్పడింది. దీనికి సరైన సమాధానాన్ని ఇచ్చుకుంటే తప్ప చైనా సమాజపు నడక అర్థం కాదు.

**1979 మే 9 పీపుల్స్ డైలీ సంపాదకీయం :** “ఏ సోషలిస్టు దేశానికైనా తన స్వంత విధానాన్ని అనుసరించే హక్కు ఉంది. ఏ దేశాన్ని కూడా ‘సోషలిస్టు’ అనో, ‘రివిజనిస్టో’ అని పిలవకూడదు. ఉత్పత్తిశక్తుల అభివృద్ధికే అంకితం కావడం రివిజనిజం అని మావో తొమ్మిది కామెంట్లలో చేసిన సూత్రీకరణను తప్పుపట్టింది.

**గ్లోబల్ టైమ్స్ పత్రిక:** ఈ పత్రిక యజమాని, పబ్లిషర్ ‘పీపుల్స్ డైలీ’ పత్రిక. దీన్ని 1993లో చైనా భాషలోనూ, 2009లో ఇంగ్లిష్ భాషలోనూ ప్రచురించడం ప్రారంభించారు. ఈ పత్రికకు చెందిన ‘ఈ–పేపర్లో’ ప్రతిరోజూ, టీ బ్రేక్, హారోస్కోప్ అనే శీర్షికల కింద

రాశి, జాతక ఫలితాలను అచ్చువేస్తుంది. ఆ రోజు పుట్టినవారు ఏ పనులు చేయవచ్చో, చేయకూడదో, వాళ్ల అదృష్టపు సంఖ్య ఎంతో కూడా పేర్కొంటుంది.

**చైనా యువతలో ఆత్మ విశ్వాసం కొరత : జాతక చక్రాల సంస్థలు:** చైనాలో పెద్ద మొత్తంలో అల్లుకుపోతున్న, లాభాలార్జిస్తున్న జాతక చక్రాల సంస్థల వైనం చైనీస్ యువతలో పెరిగిపోతున్న అభద్రతా భావానికి వ్యక్తీకరణ. ఆన్‌లైన్‌లో లక్కీడ్రాలు, హార్స్‌కోప్, జాతకచక్రాల అధ్యయన సంస్థలు పెరిగిపోయాయి. తమ భవిష్యత్తును ఆన్‌లైన్ కోయ దొరల చేతుల్లో పెట్టడానికి యువత మునుపెన్నటి కంటే ముందుకు వస్తోంది. సమకాలీన సంక్లిష్ట సమాజంలో జీవితం పట్ల పెరుగుతున్న ఆందోళనే దీనికి కారణం. ఈ వ్యాపారంలో ప్రధానమైన వ్యక్తి తావో బాయ్ బాయ్. ఇతడికి దైవిక టైకూన్ అనే ట్విట్టర్ వుంది. అతని ట్విట్టర్‌లో దాదాపు 20 మిలియన్ల మంది ఫాలోవర్లు ఉన్నారు. వీళ్లలో 2 మిలియన్ల మంది ఒక్క రోజులోనే చేరారు. అదృష్టం గురించిన చర్చ సామాజిక మీడియాల్లో ఎక్కువైంది.

**ఆలీబాబా:** ఇది చైనాకు చెందిన బహుళజాతి సంస్థ. జాక్ మా దీని యజమాని. ఇది 28 జూన్ 1999లో ప్రారంభమైంది. ఈ కామర్స్, క్లౌడ్ కంప్యూటింగ్, కృత్రిమ మేథస్సు, వినోదం, రిటైల్ మొబైల్ మీడియా, సినిమా, టీవి షోలు దీని ఉత్పత్తులు. 2021లో ఈ సంస్థ రెవెన్యూ 109.480 బిలియన్ అమెరికన్ డాలర్లు. నికర ఆదాయం 21.869 బిలియన్ అమెరికన్ డాలర్లు, మొత్తం ఆస్తి, 257.978 బిలియన్ అమెరికన్ డాలర్లు. తీవ్రమైన విమర్శల అనంతరం సకల రంగాలలోనూ పెరిగిపోతున్న ఆలీబాబా ప్రాధాన్యాన్ని తగ్గించడం కోసం ఈ మధ్యనే ప్రభుత్వం చర్యలు తీసుకోవడం ప్రారంభించింది.

**సింగిల్స్ డే:** ప్రపంచంలో ఎక్కడా జరగనంత స్థాయిలో విశృంఖలంగా వినిమయ సంస్కృతిని పెంచిపోషిస్తూ జరిగే ఉత్సవం. ఆ రోజు 24 గంటల పాటు రిటైల్ విలాసవస్తువుల అమ్మకాలు జరుగుతాయి. ప్రతి సంవత్సరం నవంబర్ 11న ఈ ఉత్సవాన్ని జరుపుతారు. దీనికి కారణం 11/11 అనేది చూడడానికి నాలుగు విడివిడి కట్టెలులాగా ఉండడం. ఇది 1993లో ప్రారంభమైంది. దీన్ని పెద్ద వ్యాపార ఉత్సవంగా చేసినవాడు ఆలీబాబా. ఆ రోజు జరిగే వాణిజ్య అమ్మకాలకు అంతూపొంతూ వుండదు. ఈ మధ్యకాలంలో తీవ్రమైన విమర్శలు వచ్చిన నేపథ్యంలో ఆ రోజున "విచక్షణతో వినియోగించండి, నిలకడతో కూడిన అభివృద్ధిని సాధించండి" అనే నినాదాన్ని ప్రచారం చేసింది ఆ సంస్థ. (సింగిల్స్ డే చైనాలో ఒంటరిగా జీవించే వ్యక్తులు జరుపుకునే ఉత్సవం. దాదాపు వీళ్లందరూ అవివాహితులు. ఆ రోజున అలాంటి వాళ్లందరూ సంతోషంగా గడపడానికి విందులు, వినోదాలు చేసుకోవడం ఒక ఆనవాయితి. క్రమక్రమంగా ఇది ప్రపంచంలోనే అత్యధికంగా డబ్బులు ఖర్చు చేసి వస్తువులు కొనుగోలు చేసే దినంగా మారింది.)

ప్రజలకు వినోదాన్ని అందించే పేరుతో నడుస్తున్న 80 చైనా వాణిజ్య సంస్థలు 2021, ఆగస్టు 16న బహిరంగంగా ఒక ప్రకటన మీద సంతకం చేసి ఇక నుండి యువతకు చట్టవ్యతిరేక, అనైతిక కార్యకలాపాలు అందించబోమని ప్రకటించాయి.

**బెల్ట్ రోడ్ ఇనీషియేటివ్:** చైనాను భూ, సముద్ర మార్గాల ద్వారా ఆసియా, ఆఫ్రికాల గుండా ఐరోపాకు కలపడం దీని లక్ష్యం. 2021 నాటికి ఇందులో 140 దేశాలు చేరాయి. వీటిలో 40 సబ్ సహారా ఆఫ్రికాకు చెందినవి. దీన్ని 2013లో ప్రారంభించారు. మొత్తం ఖర్చు 4.3 ట్రిలియన్ డాలర్లుగా అంచనా వేశారు. చైనాకు చెందిన మూడు ప్రభుత్వ పాలసీ బ్యాంకులు, రాజ్య నియంత్రణలోని పెద్ద బ్యాంకులు, సిల్క్ రోడ్డుగా పిలవబడుతున్న సావరిన్ వెల్త్ ఫండ్ దీనికి నిధులు ఇస్తున్నాయి. ప్రపంచబ్యాంకు, ఆసియా డెవలప్‌మెంట్ బ్యాంకు కూడా ఇందులో పాల్గొంటున్నాయి. దీని మొత్తం ఖర్చులో 59 శాతం ప్రభుత్వ సంస్థలది, 26 శాతం ప్రైవేటు సంస్థలది, మిగతాది పబ్లిక్ ప్రైవేటు రంగాలది. ఇది ప్రపంచ చరిత్రలోనే ఒక దేశం తీసుకున్న అతి గొప్ప పథకంగా అందరూ గుర్తిస్తున్నారు. ఈ పథకంలో భాగంగా చైనా అనేక తృతీయ ప్రపంచ దేశాలలో మౌలిక వసతుల నిర్మాణానికి అవసరమైన కార్యకలాపాల కోసం పెద్ద మొత్తంలో అప్పులిస్తూ ఉంది. ఇది అంతిమంగా ఆయాదేశాల వనరులపై చైనా ఆధిపత్యాన్ని చేజిక్కించుకోవడానికి చేసే ప్రయత్నంగా విమర్శలు కూడా వస్తున్నాయి. దీన్ని సోషలిస్టు అంతర్జాతీయతా కర్తవ్యంలో భాగంగా చూడాల్సిన అవసరం లేదు.

**అవినీతి:** 2009లో లక్షా పదిహేనువేల అవినీతి కేసుల దర్యాప్తు జరగగా, 2010లో మొదటి 11నెలల్లో లక్షా పందొమ్మిదివేల కేసుల దర్యాప్తు జరిగింది. కిందిస్థాయి వ్యక్తుల మీదనేకాక చైనా కమ్యూనిస్టుపార్టీలో అగ్రశ్రేణి నాయకుల మీద కూడా అవినీతి ఆరోపణలు రావడం, కొందరిపై చర్యలు తీసుకోవడం పత్రికల్లో వచ్చిందే. ఏ సమాజంలోనైనా అవినీతికి మూలకారణం వ్యక్తిగత ఆస్తి వుండడం. అందులోనూ కమ్యూనిస్టు పార్టీ ఆధ్వర్యంలో డెబ్బై సంవత్సరాలపాటు అభివృద్ధి చెందిన సమాజంలో ఇంతటి స్థాయిలో అవినీతికి ఆస్కారం కలగడం అక్కడ పెద్దస్థాయిలో ఆస్తులు పోగేసుకోవడానికి అవకాశాలు వున్నాయనడానికి నిదర్శనం కాదా? ఈ అవినీతే కాక, ఈ మధ్యనే చైనాకు చెందిన ఒక ప్రముఖ క్రీడాకారిణి కమ్యూనిస్టు పార్టీలో అత్యున్నత స్థాయిలో ఉన్న ఒక వ్యక్తి తనను గతంలో లైంగిక వేధింపులకు గురిచేసాడని ఆరోపించడం కూడా పత్రికల్లో మనం చదివాం.

**పోటీ పరీక్షలు :** చైనాలో కమ్యూనిస్టు పార్టీ అధికారంలోకి వచ్చాక వాళ్లు ప్రవేశపెట్టిన మౌలికమైన మార్పులలో అత్యధికం విద్యా వ్యవస్థను సంస్కరించడం కోసమే. విద్యాలయాలు భావజాల వారసులను తయారుచేసే కేంద్రాలని ఆనాటి కమ్యూనిస్టు పార్టీ భావించింది. నూతన సమాజాన్ని ఏర్పాటుచేయడానికి నూతన విద్యావిధానం భూమిక అవుతుందనికూడా వాళ్ల భావన. అందుకోసమే ఉన్నత చదువులకు పోటీ పరీక్షలను రద్దుచేశారు. కేవలం 'తెలివితేటలకు' మాత్రమే ప్రాధాన్యత నీయకుండా వ్యక్తుల చైతన్యానికి, ఆచరణ శీలతకు ప్రాధాన్యతనిచ్చారు. ఉన్నత చదువులను గ్రామీణ ప్రాంతాల సాధారణ విద్యార్థులకు అందుబాటులోకి తెచ్చారు. ఇప్పుడు తిరిగి పోటీ పరీక్షలు ప్రారంభమయ్యాయి. దీనికోసం పెద్ద ఎత్తున ఫీజులు వసూలుచేసే శిక్షణాలయాలు కూడా తామరతంపరలాగా పుట్టుకు వచ్చాయి. దీనిఫలితంగా ఉన్నత విద్య పేదలకు అందని ద్రాక్షపండులాగా మారింది. తీవ్రమైన విమర్శలు చెలరేగిన ఫలితంగా ఈ మధ్యనే ఈ వ్యాపారం మీదకూడా కట్టడి పెట్టాలని ప్రభుత్వం ఆలోచించింది.

**"తరహా" సోషలిజం:** చైనా విప్లవం జరుగుతున్న కాలంలో కామ్రేడ్ మావో రష్యన్ విప్లవ నమూనాని యథాతథంగా చైనాలో అమలుపరచడం సరికాదని, చైనా నిర్దిష్ట పరిస్థితులకు అనుగుణంగా వ్యూహాన్ని, ఎత్తుగడలను రూపొందించుకోవాలని అన్నారు. విప్లవాన్ని విజయవంతం చేయడానికి ఇది తప్పనిసరియైన అవసరమని ఋజువైంది. ఇప్పుడు చైనా తరహా సోషలిజం అనే పదబంధాన్ని

నిత్యం ప్రయోగిస్తున్నారు. ఇలాంటి 'తరహా సోషలిజాలు' ఉండవు. ప్రజాస్వామ్యం, లౌకికవాదం, సమానత్వం, సోషలిజం వంటివి ఆదర్శాలు, విలువలు. వీటి అంతస్సారం ఒకే విధంగా ఉంటుంది. దేశాన్ని బట్టి మారదు. ఈ మధ్యకాలంవరకు వివిధ దేశాలను పరిపాలించిన నియంతలు తమది కూడా ప్రజాస్వామ్యమేనని, అయితే తమది గైడెడ్ ప్రజాస్వామ్యం అని, బేసిక్ ప్రజాస్వామ్యమని, ఇస్లామిక్ ప్రజాస్వామ్యమని చెప్పుకొంటూ తమ నియంతృత్వ స్వభావాన్ని దాచుకున్నారు. అలాంటిదే హిందూ లౌకికవాదం అనే మాటకూడా.

మనదేశంలో కూడా నెహ్రూ అధికారంలో ఉన్నకాలంలో "సోషలిస్టు తరహా సమాజం" అనే మాట వినబడేది. ఇలాంటిదే గతంలో జర్మనీలో నాజీపార్టీ ప్రతిపాదించిన "జాతీయ సోషలిజం". అలానే యూరో కమ్యూనిజం అనే మాట. కమ్యూనిస్టు మూల సూత్రాలు దేశాన్నిబట్టి మారవు. మార్క్సిజం ప్రధానంగా సమాజాన్ని అర్థం చేసుకోవడానికి ఉపయోగపడే గతితార్కిక పద్ధతిని మనకి అందించింది. ఆ నేపథ్యంలో ఆయాదేశాలు మార్క్సిస్టు మూలసూత్రాలను తమ నిర్దిష్ట పరిస్థితులకు అనుగుణంగా అన్వయించుకోవాలి. అంటే అర్థం మార్క్సిస్టు మూల సూత్రాలను వదిలేయడం కాదు. ఉదాహరణకి మా దేశంలో శ్రామికవర్గ నియంతృత్వం బదులు సకల ప్రజల నియంతృత్వం అమలవుతుందని అనుకోవడం మార్క్సిజం కాదు. అలానే సోషలిజం అంటే ఏ దేశంలోనైనా ఒకే విధమైన ఆర్థిక, రాజకీయ, సామాజిక విలువ. క్రమక్రమంగా వ్యక్తిగత ఆస్తి ప్రాధాన్యతను కోల్పోవడం. ప్రజలమధ్య అంతరాలు తగ్గడం. ఉత్పత్తి సాధనాలతోపాటు ఉత్పత్తి సంబంధాలలో కూడా మౌలికమైన మార్పులు రావడం. సోషలిస్టు చైతన్యీకరణ జరగడం. ఇదికాక మరో తరహాలో సోషలిజం వుంది అంటే అది ఖచ్చితంగా ముసుగులో వున్న వ్యక్తిగత పెట్టుబడిదారీ వ్యవస్థ మాత్రమే.

**సోషలిస్టు ఆధునీకరణ:** ఆధునీకరణ అంటే రూపం మారడం మాత్రమే కాదు, దానితోపాటు సారంకూడా మారడం. ఆ మారడం కూడా ఉన్నస్థితి కంటే ఉన్నతమైన మానవీయమైన స్థితికి మారడం. వ్యక్తి జీవితంలోనైనా, సమాజంలోనైనా ఆధునీకరణను ఇలానే అర్థం చేసుకోవాలి. కేవలం వస్తు సంపద పెరగడం, విలాసాలు పెరగడం, సేవలు పెరగడం, నగరాలు పెరగడం మాత్రమే ఆధునీకరణ కాదు. ముఖ్యంగా సోషలిస్టు ఆధునీకరణ కాదు. సోషలిస్టు సమాజంలో అభివృద్ధి జరుగుతున్నకొద్దీ శ్రమకాలం తగ్గి, మనిషి శ్రమ నుండి కొంతమేరకు విముక్తి కావడం. జీవిక కోసం శ్రమచేసే సమయం తగ్గి విశ్రాంత సమయం పెరగడం. పెట్టుబడిదారీ సమాజంలో యంత్రంలో యంత్రంగా మారి పరాయీకరణకు గురైన మనిషి జీవచ్ఛవంలాగా బతుకుతాడు. సమాజం సోషలిజంవైపుగా పురోగమిస్తున్నకొద్దీ తనకు లభ్యమైన విశ్రాంతి సమయంలో తనకు ఇష్టమైన, తన అభిరుచులకు అనుగుణమైన అంశాలపై దృష్టి కేంద్రీకరిస్తాడు. అది సాహిత్య సృజన కావచ్చు, సంగీతం, నృత్యం, చిత్రకళ లాంటి అభిరుచులు కావచ్చు, క్రీడలు కావచ్చు. దీని ఫలితంగా వాళ్ల చైతన్యం నిత్యనూతనంగా ఉండడమేకాక, వాళ్లు సంపూర్ణ మానవులుగా ఎదగడానికి అవకాశం ఉంటుంది. దీనికీ పెట్టుబడిదారీ ఆధునీకరణకు సంబంధం లేదు. చైనాలో జరుగుతున్న ఆధునీకరణ ఇలాంటిది మాత్రం కాదు.

**గ్జీ ని పొగుడుతూ పార్టీ నిర్ణయం :** ఈ నెలలోనే జరిగిన కమ్యూనిస్టు పార్టీ ప్లీనరీ సమావేశంలో అధ్యక్షుడు గ్జీ జిన్ పింగ్‌ను చైనా విధాతగా పొగుడుతూ తీర్మానించారు. ఆయన నాయకత్వంలో "మూడవ కొత్త శకం" ప్రారంభమైందని శ్లాఘించారు. చైనా రాజ్యాంగానికి చేసిన సవరణలో కూడా 'గ్జీ జిన్ పింగ్ ఆలోచనా విధానం' అనే మాట వాడారు. ఇదంతా చైనాలో మళ్లీ వ్యక్తి పూజకు పట్టం కట్టడమే. ఈ వ్యక్తి పూజనే మావో సాంస్కృతిక విప్లవకాలంలో తీవ్రంగా ఖండించారు. పార్టీలో అభివృద్ధి కావల్సింది సమష్టి నాయకత్వం అని ఆయన అభిప్రాయపడ్డారు. నిజానికి కేంద్రీకృత ప్రజాస్వామ్యం అంటే కింది నుండీ అధికారం పైకి ప్రయాణించడం. నిర్ణయాలు కిందస్థాయిలో జరిగి వాటి అమలుకు సంబంధించిన చర్యలు పై స్థాయిలో జరగడం. కాని చైనాలో వ్యక్తిగత అధికారం క్రమక్రమంగా పెరగడం, దానికి రాజ్యాంగం ఆమోదముద్ర వేయడం, మావో ప్రతిపాదించిన సమష్టి నాయకత్వ సూత్రాన్ని వదులుకోవడమే. శ్రామికవర్గ నియంతృత్వం పేరిట పార్టీ, పార్టీ పేరిట వ్యక్తి అధికారాన్ని చేజిక్కించుకోవడమే. ఇలాంటి వ్యవస్థలు ఎంతోకాలం నిలవవు. సోవియట్ యూనియన్ ఉదాహరణ మన కళ్లముందు ఉండనే ఉంది.

ఈ వ్యాసం పూర్తి అవుతున్న సమయంలో నవంబర్ 17న మెకన్సీ కంపెనీ ఇచ్చిన ఒక నివేదికలో ఇలా పేర్కొన్నది. "ప్రపంచ వ్యాప్త నికర సంపదలో గత 20 సంవత్సరాలలో చైనా వాటా దాదాపు 1/3వ వంతు." అలానే బ్లూమ్‌బర్గ్ నివేదిక ఇలా పేర్కొన్నట్టు తెలిసింది. "2000లలో 156 ట్రిలియన్ అమెరికన్ డాలర్లుగా ఉన్న ప్రపంచ సంపద 2020లో 514 ట్రిలియన్ అమెరికన్ డాలర్లుకు పెరిగింది. చైనా సంపద 2000లలో 7 ట్రిలియన్ అమెరికన్ డాలర్లు కాగా 2020లో అది 120 ట్రిలియన్ అమెరికన్ డాలర్లకు చేరింది. చైనా అమెరికాలలో 2/3వ వంతు సంపద 10 శాతం కుటుంబాల చేతుల్లో వుంది." ఈ పెరుగుతున్న సంపద ఎవరిది? చైనా సమాజానిదా, నానాటికీ కోటీశ్వర్లు అవుతున్న చైనా సంపన్నులదా? ఆలోచించాలి.

"ఒక సోషలిస్టు దేశంలో", "దోపిడీ వర్గాలు ఒక వర్గంగా రద్దయిన" దేశంలో, "సోషలిస్టు సమాజంగా పరిణామం చెందడం పూర్తి అయిన" దేశంలో, "మనిషిని మనిషి దోచుకునే వ్యవస్థ రద్దయిన" దేశంలో వ్యక్తుల సంపద ఇంత వేగంగా పెరగడం ఎలా సాధ్యం? ఆ పెరుగుదలను మనం ఎలా అర్థం చేసుకోవాలి. శ్రమదోపిడీ లేకుండా, అదనపు విలువను చేజిక్కించుకోకుండా వ్యక్తుల ఆస్తులు ప్రపంచ కోటీశ్వరులతో సమానంగా పెరగడం, విలాస వస్తువుల కొనుగోలు మార్కెట్‌గా ఆ దేశం ప్రపంచంలోనే ముందుపీటీన ఉండగలగడం, ఆ దేశంలో బహుళజాతి సంస్థలు బలపడి సామ్రాజ్యవాద దేశాలలో బహుళజాతి సంస్థలతో పోటీపడడం ఎలా సాధ్యమైంది? ఇదంతా ఒక "తరహా సోషలిజం" అనుకోవడం అమార్క్సీయం.

అంతేకాదు, సోషలిస్టు పునర్ నిర్మాణంలో, ఆధునీకరణలో ఆర్థికాంశం ఎంత ప్రధానమో సాంస్కృతికాంశం కూడా అంతే ప్రధానం. ఇవి రెండూ రెండు తెన్నులలో ప్రయాణం చేయవు. ఒకదాన్ని మరొకటి ప్రభావితం చేసుకుంటూ జమిలిగా ప్రయాణిస్తాయి. చైనా సమాజంలో మతం ప్రాధాన్యం పెరగడం, కన్ఫ్యూషియస్ భావజాలానికి ఇంతకుముందులేని ప్రాధాన్యత లభించడం, రాశిఫలాలు, జాతకచక్రాలు దర్శనమీయడం, యువత ఆన్‌లైన్ కోయ దొరల చేతుల్లో చిక్కుకోవడం, ఫ్యాషన్ పెరేడ్ల నిర్వహణ, అశ్లీల సంస్కృతిని ప్రోత్సహించమని వాణిజ్య సంస్థలు వాగ్దానాలు చేయాల్సిరావడం– ఇవన్నీ దేన్ని సూచిస్తున్నాయి. శాస్త్రీయమైన ప్రజా సంస్కృతినా, క్షీణసంస్కృతినా? ఇన్నేళ్ల కమ్యూనిస్టు పాలన ప్రజల

*(...4వ పేజీ తరువాయి)*

*అమెరికాను ఎండగట్టే వార్త దాదాపు కన్పించదు. ఓటర్లనే కాక, శాసన సభ్యులను, చిన్నచిన్న పార్టీలనే కొనేసే పద్ధతి కళ్లెదుటే కన్పిస్తున్నా, మనది ప్రజాస్వామ్యమని, చైనా ప్రజాస్వామ్య వ్యతిరేకి అని కథనాలు మనని నమ్మిస్తున్నాయి. ఈ మధ్యనే మరో వార్త: అరుణాచల్ ప్రదేశ్‌లో 1959 తర్వాత చైనా వశం చేసుకున్న భూభాగం 'ఇంచి'మేరకూడా లేదని మిలటరీ అధికారులతో సహా భారత ప్రభుత్వ ప్రతినిధులు చెప్పారు. అయినా మీడియా అమెరికా పెంటగాన్ కథనాల ఆధారంగా అక్కడ దురాక్రమణ జరిగినట్టుగానే ప్రచారం చేసి మనల్ని నమ్మిస్తున్నది. గల్వాన్ ఘర్షణ తర్వాత నాకు ఆశ్చర్యం కల్గించిన వార్తలు: ప్రధాని అధికారికంగా కొట్టిపారేసారు; "ఆ ఏరియాలో చైనా "చొరబాట్లు" ఏ మాత్రం లేవని, అక్కడ అగ్రిమెంటే లేదని, సరిహద్దు గీసిలేదని, ఎవరి అవగాహన వారికున్నదని, చైనా బోర్డరులో 45 ఏళ్లపాటు ఒక్క తుపాకిగుండు కూడా పేలలేదని స్వయంగా మిలటరీ మాజీ చీఫ్ జనరల్ వికె సింగ్ చెప్పారు. యుపిఏలోనూ ప్రస్తుతమూ కూడా కేంద్ర మంత్రి ఆయన. చైనాకు 14 దేశాలతో భూ సరిహద్దులున్నాయని, అందులో ఇండియా భూటాన్‌లతో తప్ప అందరితో వివాదాలు పరిష్కారమైనాయని; కాగా ఇండియాకు ఏడిటిలో భూటాన్ తప్ప అన్ని దేశాలతో పరిష్కారం కాని వివాదాలున్నాయని బిజెపి నాయకుడు, చైనా నిపుణుడు సుబ్రమణియ స్వామి, ఒక మాజీ మిలటరీ చీఫ్ 2014లో చెప్పారు. ఈ మధ్య మాటమార్చారు. అమెరికా ప్రభావంతో మీడియా తన అసత్య కథనాలు ప్రచారం చేస్తూనే ఉన్నది. అప్పటి నుంచీ ఈ వార్తలు జాగ్రత్తగా చూస్తున్నాను. ప్రస్తుత వీక్షణం వ్యాసంతో చైనా ఆంతరంగిక విషయాలూ అంతేనని బోధపడ్డది.*

*చైనా సంబంధిత వార్తలను జాగ్రత్తగా గమనించి, విశ్లేషించుకోవాలన్న విషయాన్ని రచయిత బాగా వెలికి తెచ్చారు. వాస్తవాలతో పాటు, సరైన విశ్లేషణా పద్ధతిని కూడా ఎత్తిచూపిన ఈ వ్యాసం 'వీక్షణం'లో వచ్చిన చాలా మంచి వ్యాసాల్లో ఒకటి. ఎడ్యుకేటివ్‌గా ఉన్న ఇలాంటి వ్యాసాలు ప్రచురించి చర్చను ప్రోత్సహిస్తున్నందుకు అభివందనాలు.*

***– జడల సుధీర్,***
*ఒంగోలు.*

***వీ**క్షణం పత్రికను పది సంవత్సరాలుగా, ఇంకా అంతకన్నా ఎక్కువగా చదువుతున్నాను. ఎప్పుడూ సీరియస్, సైద్ధాంతిక వ్యాసాలు వేసే మీరు నవంబర్ సంచికలో వేసిన హాస్యాస్పద వ్యాసం చూసి మీ అభిరుచిని అభినందించాలని ఈ ఉత్తరం రాస్తున్నాను. చాలా రోజుల తర్వాత నన్ను కడుపుబ్బ నవ్వించిన ఆ వ్యాసం ఎం. సజయ గారు రాసిన 'చైనా కమ్యూనిస్టు పార్టీ సమీక్ష – మంత్లీ రివ్యూ పునరాలోచన'. ఇటువంటి చౌకబారు, నవ్వులాట అభిప్రాయాలకు చోటు కల్పించవలసిన అవసరం వీక్షణంకు ఏమి వచ్చిందో నాకు అర్థం కాలేదు. ఉదాహరణకు భూమి బల్లపరుపుగా ఉందని, భూమి చుట్టూ నవగ్రహాలు తిరుగుతున్నాయని ఎవరైనా రాస్తే, దాన్ని సైద్ధాంతిక చర్చ పేరుతో మీరు అచ్చు వేస్తారా చూడాలని నాకు కుతూహలంగా ఉంది. ఈ వ్యాసం (?) లో సజయ గారు చేసిన పని అదే. పది సంవత్సరాల పాటు గ్రేట్ డిబేట్ జరిగి, సోవియట్ యూనియన్ సోషల్ సామ్రాజ్యవాదంగా మారిపోయిందని సందేహం లేకుండా రుజువు అయిపోయిన తర్వాత, 1970ల్లో, 80ల్లో సోవియట్ యూనియన్ గొప్ప సోషలిస్టు దేశమనీ, అక్కడి కమ్యూనిస్టు పార్టీ నిజమైన కమ్యూనిస్టు పార్టీ అనీ సిపిఐ గుడ్డిగా వాదిస్తుండేది, రాస్తుండేది. సిపిఎం సన్నాయి నొక్కులు నొక్కుతుండేది. పూర్వాశ్రమంలో సోషల్ సామ్రాజ్యవాదం గురించి, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ రివిజనిజం గురించి మాట్లాడిన యుసిసిఆర్ ఐ (ఎంఎల్) అనే "విప్లవపార్టీ" అనేకానేక చీలిక పాయల్లో ఒకటైన, దేవులపల్లి వెంకటేశ్వరరావు గారిని అనుసరించే ఒక వర్గం ఇప్పుడు ఆ పాత సిపిఐ, సిపిఎం వారసత్వాన్ని పుణికి పుచ్చుకుని చైనా కమ్యూనిస్టు పార్టీ మీద ఈగ వాలినా కత్తి దూస్తున్నది. ఎం సజయ గారికి ఆ రాజకీయాలు ఉన్నాయో, స్వతంత్ర పరిశీలకురాలో తెలియదు. కళ్లుమూసుకుని పాలు తాగుతూ తననెవరూ చూడలేదనుకునే పిల్లిలా, లోకమంతా తెలిసిపోయిన వంద రుజువులు ఉన్న విషయాలను లేవన్నట్టుగా, చైనా కమ్యూనిస్టు పార్టీ అనుసరిస్తున్న మార్క్సిజం గురించి వీరు మాట్లాడుతుంటారు. పిల్లి తెల్లదా, ఎర్రదా అనేది సమస్య కాదని, ఎలుకలు పడితే చాలని ప్రబోధించిన డెంగ్ సియావో పింగ్ అనే ఆధునిక క్రుశ్చేవ్ వీరికి గురువు. కోటీశ్వరులను సభ్యులుగా చేర్చుకోవచ్చునన్న పార్టీ, కార్మికుల చౌక శ్రమను, నిర్బంధపూరితంగా పిండి, ప్రపంచానికి చౌక సరుకులు ఎగుమతి చేసి, మార్కెట్లను కొల్లగొట్టి అదే పెట్టుబడిదారీ విధానంతో పోటీ అని చెప్పే పార్టీ వీరి దృష్టిలో సృజనాత్మకమైన మార్పులు చేసుకుంటున్న కమ్యూనిస్టు పార్టీ! ఇప్పుడు వీరికి మంత్లీ రివ్యూ అనే పత్రిక దొరికింది. పాల్ స్వీజీ, హారీ మెగ్డాఫ్ రోజుల నుంచి ఆ పత్రిక ఎంత దూరం వచ్చిందో, పర్యావరణం వంటి విషయాల్లో సరైన వైఖరి తీసుకునే ఆ పత్రిక, నేపాల్ విషయంలో దేవులపల్లి వెంకటేశ్వర రావు ఆలోచనా విధానం (దశల పద్ధతి విప్లవం) ఆమోదించలేని వైఖరి ఎలా తీసుకుందో, మార్క్సిస్టు రాజకీయార్థ శాస్త్ర చర్చలో ఎంత దూరం వెళ్లిపోయిందో అదొక సుదీర్ఘ చరిత్ర. సజయ గారు తన వైఖరి చెపితే చెప్పవచ్చు, దాన్ని సమర్థించుకుంటే సమర్థించుకోవచ్చు. మంత్లీ రివ్యూ మద్దతు దేనికి, అదేమన్నా ప్రామాణికమా?*

***– జి. లింగమూర్తి,***
*హుజూరాబాద్*

వీ

చైతన్యంలో ఆరోగ్యకరమైన మార్పులు తీసుకురావడంలో విఫలమైనట్లు కాదా? ఇలాంటి ప్రయాణం అంతిమంగా ఏ గమ్యానికి చేరుతుంది?

విప్లవం విజయవంతమైనంత మాత్రాన, కమ్యూనిస్టు పార్టీ పాలక పార్టీగా మారినంత మాత్రాన పాత సమాజం రద్దు అయి నూతన సమాజం దానంతట అది ఏర్పడుతుందని ఊహించడం అశాస్త్రీయం, అచారిత్రికం. ఇదంతా నల్లేరు మీద బండిలాగా జరిగే ప్రయాణం కాదని చరిత్రే రుజువు చేసింది. అందుకే మావో ఒక మాట అన్నారు. ఒకే గమ్యానికి చేరుకోవడానికి రెండు బళ్లు ప్రయాణం ప్రారంభించి, మొదటి బండి మధ్యలో పడిపోతే రెండో బండి నడిపే వ్యక్తి అది ఎందుకు పడిపోయిందో అర్థం చేసుకుంటే తప్ప తన బండిని గమ్యానికి చేర్చలేడని. సోవియట్ యూనియన్‌లో పెట్టుబడిదారీ విధానం ప్రారంభమైందని అది ఇంకెంత మాత్రమూ సోషలిస్టు దేశం కాదని విమర్శకులు చెప్పినప్పుడు చాలామంది నమ్మలేదు. అది అలా జరగడం సాధ్యమా అనుకున్నారు. కాని అది అలానే జరిగింది. ఇప్పుడు చైనాలో కూడా బండి క్రమంగా గాడి తప్పిందని, దాని ప్రయాణం సోషలిస్టు గమ్యంవైపు జరగడంలేదని, వాస్తవాల ఆధారంగా గుర్తించడానికి కొందరికి అభ్యంతరాలు ఉండవచ్చు. అయినా వాస్తవం వాస్తవం కాకుండా పోదు.

చివరగా ఒక మాట. "తరహా సోషలిజం", "మార్కెట్ సోషలిజం", "సోషలిస్టు ఆధునీకరణ" వంటి భావనలపైన మరింత విస్తృతమైన చర్చ జరగాల్సిన అవసరం ఎంతైనా ఉంది. వీటి గురించి అధ్యయనం చేసిన మిత్రులు వ్యాసాలు రాస్తే జరుగుతున్న మార్పుల మంచి చెడులను బేరీజు వేసుకోవడానికి ఉపయోగపడుతుంది. ఇందుకు అవసరమైన ప్రయత్నాన్ని వీక్షణం సంపాదక మిత్రులు చేయాలని నా వినతి. వీ

### తడిసి ముద్దవుతున్న వరి ధాన్యం

వరి ధాన్యం కొనుగోలులో జరుగుతున్న జాప్యం వల్ల వర్షాలకు ధాన్యం తడిసి తెలంగాణలో రైతులు తీవ్ర ఇబ్బందులకు గురవుతున్నారు. పంట ఉత్పత్తిని దేశంలో ఎక్కడి మార్కెట్‌లోనైనా అమ్ముకోవచ్చని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అంటున్నాయి. తీరా ధాన్యం అమ్ముకునేందుకు వెళ్లిన రైతులకు అధికారులు అనేక రకాల నిబంధనలతో ఇబ్బందులకు గురిచేస్తున్నారు. తెలుగు రాష్ట్రాల్లో నిత్యం కురుస్తున్న వర్షాలకు తడిసిన ధాన్యం ఆరబెట్టినా కొనకపోవడం వల్ల రైతులు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. వర్షాలకు తెలంగాణలోని దాదాపుగా అన్ని జిల్లాల్లో మార్కెట్ యార్డులలో ధాన్యం తడిసి కొట్టుకు పోవడంతో రైతులు ఆవేదనతో ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు. రైతులు జాతీయ రహదారులను దిగ్బంధించి తమ ఆగ్రహాన్ని వ్యక్తం చేస్తున్నారు. తెలంగాణ వస్తే ధర్నాలు ఉండవని ధర్నా చౌక్‌లో నిరసనలు రద్దుచేయించిన టిఆర్ఎస్ ప్రభుత్వం ప్రజలు పోరాడి సాధించుకున్న ధర్నాచౌక్‌లో వరి ధాన్యం కొనుగోలు కోసం కేంద్రంపై ఒత్తిడి తెచ్చేందుకు నవంబర్ 18న ధర్నా చేసింది.

### ఉద్యోగ భద్రత కల్పించాలని ధర్నా

కరీంనగర్‌లోని ఆర్ట్స్ కళాశాలలో తెలంగాణ లెక్చరర్స్ ఫోరం (టిఎల్ఎఫ్) ఆధ్వర్యంలో నవంబర్ 14న ధర్నా చేశారు. తెలంగాణ రాష్ట్ర సమన్వయకర్త నాగయ్య ప్రైవేటు అధ్యాపకులకు ఉద్యోగ భద్రత కల్పించాలని, అందరికి హెల్త్ కార్డులు ఇవ్వాలని, ఉద్యోగ నియామకాలు చేపట్టాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. ఈ కార్యక్రమంలో కరీంనగర్ టిఎల్ఎఫ్ జిల్లా అధ్యక్షుడు, వర్కింగ్ ప్రెసిడెంట్, రాష్ట్ర నాయకులు తదితరులు పాల్గొన్నారు.

### ఆదివాసుల హక్కుల ఉల్లంఘన

రెండు తెలుగు రాష్ట్రాల్లో ఆదివాసుల హక్కులపై జరుగుతున్న ఉల్లంఘనలను అధికారుల దృష్టికి తీసుకువెళ్లినా స్పందించడం లేదని విశ్రాంత ఐఏఎస్ ఇ.ఎ.ఎస్. శర్మ అసంతృప్తి వ్యక్తం చేశారు. ఈ నేపథ్యంలో ఆయన తెలుగు రాష్ట్రాల ముఖ్యమంత్రులకు 7న లేఖ రాశారు. ఆదివాసీ ప్రాంతాల్లోని భూములపై వారికి ప్రత్యేక హక్కులు, చట్టాలు అమలులో ఉన్నాయి. అయినప్పటికీ రెండు రాష్ట్రాల్లోనూ వారి హక్కులకు పదేపదే భంగం కలుగుతోంది. భూ బదిలీ చట్టాలను అమలు చేయకపోవడం వల్ల వారి భూములను గిరిజనేతరులు విస్తృతంగా ఆక్రమిస్తున్నారు. పీసా, అటవీ హక్కుల చట్టం ఉల్లంఘనలు జరుగుతున్నాయి. ఈ విషయాలను గుర్తించి తగిన చర్యలు తీసుకోవాలి' అని ఆ లేఖలో కోరారు.

### ఫార్మా పరిశ్రమను వ్యతిరేకిస్తున్న గ్రామస్థులు

మెదక్ జిల్లా నర్సాపూర్ మండలం చిన్న చింతకుంట గ్రామంలో దశ ఫార్మాస్యూటికల్స్ ప్రైవేట్ లిమిటెడ్ కంపెనీ ఏర్పాటును ఆపాలని గ్రామస్థులు ఎంఎల్ఏను కోరారు. ఈ కంపెనీ నెలకొల్పడాన్ని వ్యతిరేకిస్తూ ఆ గ్రామస్థులు గత కొన్ని రోజులుగా ఆందోళన చేస్తున్నారు. నవంబర్ 9న స్థానిక ఎంఎల్ఏ, ఆర్‌డిఓ పరిశ్రమ నిర్మిస్తున్న ప్రాంతానికి రావడంతో స్థానికులు పెద్ద ఎత్తున నినాదాలు చేస్తూ నిరసన తెలిపారు. ఫార్మా కంపెనీ ఏర్పాటుతో తమ భూములు సారం కోల్పోతాయని, భూగర్భ జలాలు కలుషితం అవుతాయని ఆందోళన వ్యక్తం చేశారు.

### భూ నిర్వాసితుల ఆందోళన

నల్గొండ జిల్లా నాంపల్లి మండలంలోని కిష్టరాయిన్‌పల్లి ప్రాజెక్టు పనుల పునః ప్రారంభం తీవ్ర ఉద్రిక్తతకు దారితీసింది. లక్ష్మణాపురం భూ నిర్వాసితులు ప్రాజెక్టు పనులను నవంబర్ 9న అడ్డుకున్నారు. తాము కోల్పోతున్న పొలాలకు పూర్తి స్థాయిలో నష్టపరిహారం, మల్లన్నసాగర్ తరహా పునరావాసం కల్పించాకే పనులు చేపట్టాలని డిమాండ్ చేశారు. డిండి ఎత్తిపోతల పథకంలో భాగమైన ప్రాజెక్టుపై ఏళ్లుగా వివాదం నడుస్తోంది. ఫిబ్రవరి నుంచి పోలీసు బందోబస్తు మధ్య పనులు చేపట్టడంతో భూ నిర్వాసితులు పునరావాస సాధన దీక్ష చేపట్టడంతో పనులు నిలిచిపోయాయి. నవంబర్ 9న పోలీసుల బందోబస్తుతో తిరిగి పనులు చేపట్టడంతో 175 కుంటుంబాలకు చెందిన నిర్వాసితులు పెద్ద ఎత్తున ఆందోళనకు దిగి పనులను అడ్డుకున్నారు.

### పుస్తకావిష్కరణను అడ్డుకోవడం అప్రజాస్వామికం

మావోయిస్టు నాయకుడు రామకృష్ణపై ముద్రిస్తున్న పుస్తకాన్ని ప్రభుత్వం అడ్డుకోవడాన్ని ఖండిస్తూ ఆర్.కె. భార్య శిరీష, అమరుల బంధుమిత్రుల సంఘం ఆధ్వర్యంలో నవంబర్ 14న సోమాజిగూడ ప్రెస్‌క్లబ్‌లో మీడియా సమావేశం నిర్వహించారు. ప్రొ. హరగోపాల్ తమది మావోయిస్టు ఎజెండానే అని చెప్పిన కెసిఆర్, అధికారంలోకి వచ్చాక అందుకు విరుద్ధంగా వ్యవహరిస్తున్నారన్నారు. ఆర్.కె. పై వచ్చిన పుస్తకం ఆవిష్కరణకు అనుమతి ఇవ్వాలన్నారు. 2004లో ప్రభుత్వంతో జరిగిన చర్చల సందర్భంలో ఆర్.కె. మీడియాలోని కథనాలు, ఆయన ఇంటర్వ్యూలు, ఫొటోలు, 2010లో తాను అరెస్టు అయినపుడు పత్రికల్లో వచ్చిన కథనాలను కలిపి పుస్తకంగా తెచ్చే ప్రయత్నం చేశానని తెలిపారు. పుస్తకావిష్కరణకు రెండు రోజుల ముందే ప్రింటింగ్ ప్రెస్‌పై పోలీసులు దాడిచేసి పుస్తకాలు ఎత్తుకెళ్లారన్నారు. ముద్రణ సంస్థ యజమాని రామకృష్ణారెడ్డి, సంధ్యపై పెట్టిన అక్రమ కేసులు ఎత్తేయాలని డిమాండ్ చేశారు.

### తెలంగాణ, ఆంధ్రప్రదేశ్‌లో ఎన్ఐఏ సోదాలు

తెలుగు రాష్ట్రాల్లోని మావోయిస్టు సానుభూతిపరులు, ప్రజా సంఘాల నేతల ఇళ్లల్లో నవంబర్ 18న ఎన్ఐఏ సోదాలు జరిపింది. రెండు రాష్ట్రాల్లోని 7 జిల్లాల్లో 14 చోట్ల తెల్లవారు జామున మొదలైన సోదాలు సాయంత్రం వరకు కొనసాగాయి. ఛత్తీస్‌గఢ్ బస్తర్ జిల్లా నాగర్నర్ పోలీసు స్టేషన్ పరిధిలో 2019 జూలైలో జరిగిన ఎన్‌కౌంటర్ కేసు దర్యాప్తులో భాగంగా సోదాలు చేపట్టామని ఎన్ఐఏ అధికారులు తెలిపారు. ఈ సోదాల్లో కీలక పత్రాలతో పాటు, మావోయిస్టు సాహిత్యం, ఎలక్ట్రానిక్ పరికరాలను స్వాధీనం చేసుకున్నట్లు ఎన్ఐఏ ప్రకటించింది.

### కొనసాగుతున్న సిర్పుర్కర్ కమిషన్ విచారణ

దిశ నిందితుల అరెస్టు మొదలు కస్టడీ వరకూ పోలీసులు అన్నిరకాల నిబంధనలను ఉల్లంఘించారంటూ మృతుల కుటుంబ సభ్యుల తరపున న్యాయవాది కె.వి. కృష్ణమాచారి, న్యాయవాది వసుధ నాగరాజు తమ వాదనలు వినిపించారు. దిశ నిందితుల ఎన్‌కౌంటర్‌పై విచారణకోసం సుప్రీంకోర్టు నియమించిన సిర్పుర్కర్ కమిషన్ ముందు నవంబర్ 17న న్యాయవాది వసుధ వాదనలు వినిపించారు. దిశ నిందితుల ఎన్‌కౌంటర్ బూటకమని, దీనికి బాధ్యులైన వారిపై చర్యలు తీసుకోవాలని కోరుతూ సామాజిక కార్యకర్త సజయ కమిషన్‌కు పిర్యాదు చేశారు. ఆమె తరపు న్యాయవాది వసుద నాగరాజు అరెస్టు చేసిన నలుగుర్నీ ఎగ్జిక్యూటివ్ మేజిస్ట్రేట్ ముందు హాజరుపరచడం మొదలు రిమాండ్ విధించడం నుంచి విచారణ కోసం పోలీసు కస్టడీ వరకు ప్రతి అంశంలోనూ నిబంధనలు ఉల్లంఘించారన్నారు. ఎన్‌కౌంటర్‌లో పాల్గొన్న పోలీసుల తరపు న్యాయవాది ప్రవీన్ వాదనలు వినిపించారు. నిందితుల కాల్పుల్లో గాయపడి చికిత్సపొందుతున్న పోలీసుల ఆరోగ్య పరిస్థితి తెలుసుకోకుండానే జాతీయ మానవ హక్కుల కమిషన్ వాంగ్మూలం నమోదు చేసుకుందని, ఆ సమయంలో వారు మత్తుగా ఉన్నారన్నారు.

### సమస్యల పరిష్కారంకోసం సమ్మెకు దిగిన టిసిఐ కార్మికులు

తమ సమస్యలు పరిష్కరించాలని డిమాండ్ చేస్తూ హైదరాబాద్ ఆటోనగర్‌లోని ట్రాన్స్‌పోర్ట్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా (ఇటిఐ) కార్మికులు నవంబర్ 23న సమ్మెకు దిగారు. వారికి సిఐటియు రంగారెడ్డి జిల్లా ఉపాధ్యక్షుడు, జిల్లా కమిటీ సుభ్యుడు కార్మికుల అప్రకటిత సమ్మెకు మద్దతునిచ్చారు. వీ

### ఉత్తరప్రదేశ్‌లో జైలుకు నిప్పుపెట్టిన ఖైదీలు

ఉత్తరప్రదేశ్‌లోని ఫరూఖాబాద్‌లో ఖైదీలు జిల్లా జైలుకు నిప్పు పెట్టారు. అనారోగ్యంతో తోటి ఖైదీ మృతి చెందాడన్న వార్త తెలుసుకున్న ఇతర ఖైదీలు ఘటనకు పాల్పడ్డారు. సిబ్బందిపై రాళ్లు రువ్వడంతో 30 మంది పోలీసులతో పాటు ఆరుగురు ఖైదీలు గాయపడగా ఓ ఖైదీ మరణించాడు. డెంగీతో బాధపడుతున్న సందీప్ యాదవ్ అనే ఖైదీ స్థానిక సఫాయీ వైద్య కళాశాలలో చికిత్స పొందుతూ మృతి చెందాడు. సరైన వైద్యం అందని కారణంగానే అతను మృతి చెందాడని ఆరోపిస్తూ ఇతర ఖైదీలు జైలులో నిరసనకు దిగారు. అనారోగ్యానికి గురైన మరో ఖైదీ శివమ్‌ను ఆసుపత్రికి తరలిస్తుండగా మృతి చెందాడని పోలీసులు పేర్కొంటుండగా.. బుల్లెట్ గాయాలవల్లే ప్రాణాలు కోల్పోయాడని తోటి ఖైదీలు ఆరోపిస్తున్నారు.

### నలుగురు సుప్రీం కోర్టు లాయర్లపై యుఏపిఏ కేసు

త్రిపురలో ఇటీవల ముస్లింలను లక్ష్యంగా చేసుకుని జరిగిన దాడుల గురించి సోషల్ మీడియాలో మతసామరస్యాన్ని దెబ్బతీసేలా పోస్టులు పెట్టారన్న ఆరోపణలపై నలుగురు సుప్రీంకోర్టు న్యాయవాదులపై త్రిపుర పోలీసులు యుఏపిఏ కింద కేసు నమోదు చేశారు. నవంబర్ 10లోపు దర్యాప్తుకోసం తమ ఎదుట హాజరు కావాలని వారికి నోటీసులు జారీచేసినట్లు నవంబర్ 5న పశ్చిమ త్రిపుర జిల్లా ఎస్‌పి మాణిక్ దాస్ తెలిపారు. ఆ న్యాయవాదులు 'లాయర్స్ ఫర్ డెమోక్రసీ, నేషనల్ కాన్ఫడరేషన్ ఆఫ్ హ్యూమన్ రైట్స్ ఆర్గనైజేషన్, పీపుల్స్ యూనియన్ ఫర్ సివిల్ లిబర్టీ' (ఎల్) అనే సంఘాలకు చెందిన వారు.

### బిహార్‌లో ఇన్‌ఫార్మర్‌లను ఉరితీసిన మావోయిస్టులు

పోలీసులకు తమ సమాచారం ఇస్తున్నారని ఒకే కుటుంబానికి చెందిన ఇద్దరు అన్నదమ్ముల్ని, వారి భార్యల్ని ప్రజాకోర్టులో విచారించి వారి ఇంటి వద్దే ఉరితీసి చంపారు. డిటోనేటర్లతో ఆ ఇంటిని పేల్చివేశారు. బిహార్-జార్ఖండ్ సరిహద్దుల్లోని దుమారియా పోలీసు స్టేషన్ పరిధిలో నవంబర్ 14న ఈ ఘటన జరిగినట్లు పోలీసులు తెలిపారు. ఆ కుటుంబ సభ్యులు ఇన్‌ఫార్మర్‌లుగా వ్యవహరించడం వల్లే మార్చ్‌లో జరిగిన ఎన్‌కౌంటర్‌లో నలుగురు మావోయిస్టులు మరణించారని మావోయిస్టులు ఘటనా స్థలంలో వదిలిపెట్టిన లేఖలో పేర్కొన్నారన్నారు. గతంలో జరిగింది ఎన్‌కౌంటర్ కాదని, నలుగురు మావోయిస్టులకు ఆహారంలో విషం కలిపి పెట్టి, తర్వాత పోలీసులకు సమాచారమిచ్చారు. స్పృహలో లేని నలుగురిని పోలీసులు కాల్చిచంపి ఎన్‌కౌంటర్‌గా నమ్మించారని ఆ లేఖలో పేర్కొన్నారు.

### సల్మాన్ ఖుర్షీద్ ఇంటికి నిప్పు

నైనితాల్లో కాంగ్రెస్ సీనియర్ నేత సల్మాన్ ఖుర్షీద్ ఇంటికి నవంబర్ 15న కొంతమంది దుండగులు నిప్పు పెట్టారు. అయోధ్యపై ఖుర్షీద్ రాసిన 'సన్‌రైజ్ ఓవర్ అయోధ్య: నేషన్‌హుడ్ ఇన్ అవర్ టైమ్స్' పుస్తకంలో హిందూత్వను రాడికల్ ఇస్లామిక్ గ్రూపులతో పోల్చారని ఇటీవల వివాదం చెలరేగింది. ఈ నేపథ్యంలోనే దాడి జరిగింది. ఘటనకు సంబంధించి 21 మందిపై పోలీసులు కేసు నమోదు చేశారు.

### ఛత్తీస్‌గఢ్, మహారాష్ట్రలో ఎన్‌కౌంటర్‌లు

ఛత్తీస్‌గఢ్‌లోని దంతెవాడ జిల్లాలో అక్టోబర్ 31న జరిగిన ఎన్‌కౌంటర్‌లో ముగ్గురు మహిళా మావోయిస్టులు మృతిచెందారని దంతెవాడ ఎస్.పి. అభిషేక్ పల్లవ్ తెలిపారు. ఛత్తీస్‌గఢ్‌లోని నారాయణపూర్ జిల్లా బహకేర్ అటవీ ప్రాంతంలో నవంబర్ 15న భద్రతా బలగాలు, మావోయిస్టులకు మధ్య జరిగిన కాల్పుల్లో మావోయిస్టు కంపెనీ కమాండర్ మృతిచెందినట్లు నారాయణపూర్ ఎస్.పి. గిరిజాశంకర్ తెలిపారు. మహారాష్ట్రలోని గడ్చిరోలి జిల్లా ధనోరా తాలుకాలోని గ్యార్‌పట్టి అడవుల్లో కూంబింగ్‌కు వెళ్లిన సి-60 కమెండోలకు మావోయిస్టులు తారసపడడంతో ఇరు పక్షాల మధ్య జరిగిన కాల్పుల్లో 27 మంది మావోయిస్టులు మృతిచెందగా నలుగురు పోలీసు కమెండోలు గాయపడ్డారని పోలీసు అధికారులు ప్రకటించారు.

### కర్ణాటకలో చర్చిల పై నిఘా

చర్చిల కార్యకలాపాలపై కర్ణాటక ప్రభుత్వం నిఘా పెట్టింది. చర్చిల ఆర్థిక వ్యవహారాలు, వాటికి నిధులు ఎలా వస్తున్నాయి? ఎక్కడ నుంచి వస్తున్నాయి? తదితర అంశాలపై పోలీసు ఇంటలిజెన్స్ వర్గాలతో సమాచారం సేకరిస్తోంది. రాష్ట్రంలోని చర్చిలకు సంబంధించి సమీక్ష చేపట్టాలంటూ అక్టోబర్ 7న ప్రభుత్వం ఆదేశాలు జారీచేసింది. ఈ చర్యపై క్రైస్తవ సంఘాలు ఆగ్రహం వ్యక్తం చేస్తున్నాయి. దీంతో హోం మంత్రి మైనారిటీల సంక్షేమ శాఖ ద్వారా చర్చిలకు గ్రాంట్లు విడుదల చేసేందుకు ఈ సమీక్ష నిర్వహిస్తున్నామన్నారు.

### అస్సాంలో పోలీసు అధికారిని చంపిన మిలిటెంట్లు

మణిపూర్‌లో కుటుంబంతో కలిసి వెళుతున్న సైనిక అధికారిని ఐఇడిలతో దాడిచేసి కాల్పులు జరిపి చంపారు. నవంబర్ 13న చురాచాంద్‌పూర్ జిల్లాలోని సెహకాన్ గ్రామం వద్ద ఆయన వాహనమే లక్ష్యంగా ఐఇడిలను పేల్చిన తరువాత ఎత్తైన ప్రాంతం నుంచి కాల్పులు జరిపారని పోలీసు అధికారులు తెలిపారు. త్రిపాఠీ బెహియాంగ్ కంపెనీ నుంచి బేస్‌కు వస్తుండగా ఈ ఘటన జరిగిందన్నారు. ఆయన అస్సాం రైఫిల్స్ 46వ (ఖుగా) బెటాలియన్‌లో కమాండింగ్ అధికారిగా పనిచేస్తున్నారు. ఈ ఘటనలో త్రిపాఠీతో పాటు ఆయన భార్య, కుమారుడు, నలుగురు సిబ్బంది మరణించారు. ఈ దాడి చేసింది తామేనని పీపుల్స్ లిబరేషన్ ఆర్మీ, మణిపూర్ నాగా పీపుల్స్ ఫ్రంట్‌లు ప్రకటించాయి.

### మూడు నూతన వ్యవసాయ చట్టాల రద్దు

దేశ వ్యాప్తంగా రైతాంగం చేసిన పోరాట ఫలితంగా మూడు నూతన వ్యవసాయ చట్టాలను రద్దుచేస్తున్నామని ప్రధాని మోదీ నవంబర్ 19న ప్రకటించారు. ఢిల్లీ సరిహద్దుల్లో ఏడాది కాలంగా వ్యవసాయ చట్టాలను వ్యతిరేకిస్తూ రైతులు చేస్తున్న ఆందోళన విరమించి ఇళ్లకు వెళ్లాలని రైతుల్ని అభ్యర్థించారు. రైతు సంఘాల నేతలు ఈ ప్రకటనను నమ్మడంలేదంటూ చట్టాల రద్దుకు సంబంధించిన పార్లమెంట్ ప్రక్రియ పూర్తయ్యేవరకూ తాము కదిలేది లేదని తేల్చిచెప్పారు. ప్రధాని ఈ ప్రకటన రానున్న ఐదు రాష్ట్రాల ఎన్నికల్లో ఓడిపోతామనే భయంతోనే చేశారని, అదొక గిమ్మిక్కేనని భారతీయ కిసాన్ యూనియన్ నేత రాకేశ్ తికాయత్ ఆరోపించారు.

### దేశ అంతర్గత భద్రతపై సమావేశం

ఉత్తరప్రదేశ్‌లోని లఖ్‌నవూలో నవంబర్ 19-20 తేదీల్లో దేశంలోని అన్ని రాష్ట్రాలు, కేంద్ర పాలిత ప్రాంతాల డిజిపిలు, కేంద్ర పోలీసు బలగాల డైరెక్టర్ జనరల్స్ సమావేశం జరిగింది. ఈ సమావేశంలో ప్రధాన మంత్రి, కేంద్ర హోం మంత్రి, జాతీయ భద్రతా సలహాదారు అజిత్ దోబాల్ పాల్గొన్నారు. ఈ సమావేశంలో ప్రధానంగా దేశ అంతర్గత భద్రత, ఉగ్రవాదం, వామపక్ష ఉద్యమంపై చర్చలు జరిగాయి.

### 'అనుమతి లేకుండానే ఎవరి డేటానైనా తీసుకోవచ్చు'

వ్యక్తిగత సమాచార పరిరక్షణ బిల్లుపై నివేదికకు సంయుక్త పార్లమెంటరీ సంఘం (జెసిపి) విపక్షాల అసమ్మతి మధ్యనే నవంబర్ 22న ఆమోదం తెలిపింది. వ్యక్తుల సమాచారాన్ని ఏ విధంగా భద్రపరచాలి? ప్రభుత్వ, ప్రైవేట్ సంస్థలు ఎంతవరకు వీటిని తీసుకోవచ్చు? అనే అంశాలపై అధ్యయనం చేసింది. దేశ భద్రత తదితర సందర్భాల్లో ఏ వ్యక్తి నుంచి అనుమతి తీసుకోకుండానే ప్రభుత్వం, దర్యాప్తు సంస్థలైన పోలీసులు, సిబిఐ, ఇడి, రా, ఐబిలతో పాటు ఆధార్ కార్డులు ఇచ్చే ఉడాయ్, ఆదాయపు పన్ను శాఖ, ఇతర ప్రభుత్వ శాఖలు కూడా వారి సమాచారాన్ని తీసుకోవచ్చని ప్రతిపాదించింది. వీ

## రోమ్‌లో జి 20 దేశాల సదస్సు

ఇటలీ రాజధాని రోమ్‌లో జి 20 దేశాల సదస్సు అక్టోబర్ 31న ముగిసింది. ఈ సమావేశంలో ఇందన వనరులను అధికమొత్తంలో వినియోగించిన అభివృద్ధి చెందిన దేశాలే ముందుగా వాటి వినియోగాన్ని ఆపి కర్బన ఉద్గారాలను తగ్గించాలని భారతదేశం సూచించింది. కర్బన ఉద్గారాలను సాధ్యమయినంత త్వరగా సున్నాకు తగ్గించాల్సిన బాధ్యత ధనిక దేశాలపై ఉందన్నారు. బావితరాల భవిష్యత్ కోసం పర్యావరణ పరిరక్షణ చర్యల అమలుకు రాజీలేని కృషిచేయాలన్నారు. థర్మల్ విద్యుత్ ప్లాంట్లకు ఆర్థిక సహాయాన్ని నిలిపివేస్తామని జి 20 దేశాలు ప్రకటించాయి. కర్బన ఉద్గారాలను సున్నాకు తేవాలనుకునే ముందు అందుకు దోహదం చేసే పరిజ్ఞానం ఎంతమేరకు అందుబాటులో ఉందనేది దృష్టిలోపెట్టుకోవాలని ధనిక దేశాలకు సూచించారు.

## ప్రపంచంలో అత్యంత ధనిక దేశంగా చైనా

ప్రపంచంలో అత్యంత ధనిక దేశమైన అమెరికాను వెనక్కి నెట్టి చైనా నెంబర్ వన్‌గా అవతరించింది. గడిచిన రెండు దశాబ్దాల్లో ప్రపంచ సంపదలో చైనా సంపద మూడు రెట్లు పెరిగినట్లు బ్యూమ్‌బెర్గ్‌లోని నివేదిక వెల్లడించింది. మెకిన్సే అండ్ కో పరిశోధనా విభాగం 10 దేశాల బ్యాలెన్స్ షీట్లను విశ్లేషించి ఈ నివేదిక అందించినట్లు పేర్కొంది. ప్రపంచం మొత్తం ఆదాయంలో 60 శాతం ఈ పది దేశాల వద్దే ఉన్నట్లు పేర్కొంది. ఆ దేశాల జాబితాలో అమెరికా, చైనా, జర్మనీ, ఫ్రాన్స్, యూకే, కెనడా, ఆస్ట్రేలియా, జపాన్, మెక్సికో, స్వీడన్‌లు ఉన్నాయి. మెకిన్సే ఏజెన్సీ నివేదిక ప్రకారం ప్రపంచ వ్యాప్తంగా సంపద 2000లో 156 ట్రిలియన్ డాలర్లు ఉండగా, ఇది 2020లో అనూహ్యంగా 514 ట్రిలియన్ డాలర్లకు పెరిగినట్లు వెల్లడించింది. 2000 సంవత్సరంలో 7 ట్రిలియన్ల డాలర్లు ఉన్న చైనా సంపద ఇప్పుడు 120 ట్రిలియన్ల డాలర్లకు చేరుకున్నట్లు వెల్లడించారు. ప్రపంచ వాణిజ్య సంస్థలో చైనా చేరిన తర్వాత ఆ దేశ సంపద దూసుకెళ్తున్నట్లు మెకన్సీ తన రిపోర్ట్‌లో తెలిపింది.

## ఇరాక్ ప్రధాని నివాసం పై డ్రోన్ దాడి

ఇరాక్ ప్రధాన మంత్రి ముస్తఫా అల్ కరీమీ లక్ష్యంగా నవంబర్ 7న బాగ్దాద్‌లోని ఆయన నివాసంపై సాయుధ డ్రోన్ దాడి జరిగింది. ఈ దాడిలో ప్రధాని సురక్షితంగా బయటపడ్డారని భద్రతా బలగాలు స్పష్టం చేశాయి. గత నెలలో జరిగిన పార్లమెంటరీ ఎన్నికల ఫలితాలను ఆమోదించకుండా, ఇరాన్ మద్దతుతో కార్యకలాపాలు నిర్వహిస్తున్న మిలీషియా సభ్యులే తాజా దాడికి పాల్పడ్డారని భావిస్తున్నారు. బాగ్దాద్‌లోని అత్యంత కట్టుదిట్టమైన భద్రత ఉండే గ్రీజోన్లోని ప్రధాని నివాసాన్ని పేలుడు పదార్థాలతో కూడిన రెండు డ్రోన్లు ఢీకొట్టాయని, ఈ దాడిలో కరీమీ భద్రతా సిబ్బందిలో ఏడుగురు గాయపడినట్లు అధికారులు తెలిపారు.

## ఆఫ్ఘనిస్తాన్ రాజధాని కాబుల్‌లో పేలుళ్లు

ఆఫ్ఘనిస్తాన్ రాజధాని కాబుల్‌లో సైనిక ఆసుపత్రి వద్ద పౌరులే లక్ష్యంగా నవంబర్ 2న జరిగిన పేలుళ్లలో 19 మంది మృతిచెందగా పదుల సంఖ్యలో గాయపడ్డారు. ఆఫ్ఘనిస్తాన్‌ను తాలిబాన్లు హస్తగతం చేసుకున్నాక జరిగిన ఈ దాడులు తీవ్ర ఆందోళన కలిగిస్తున్నాయి. ఈ దాడులపై తాలిబాన్ అధికార ప్రతినిధి బిలాల్ కరిమి మాట్లాడుతూ... పౌరులే లక్ష్యంగా సర్దార్ మొహమ్మద్ దావూద్‌ఖాన్ సైనిక ఆసుపత్రి వద్ద పేలుళ్లు జరిగాయన్నారు.

## పెగాసస్ సంస్థ నూతన చీఫ్ రాజీనామా

ఇజ్రాయిల్ ఎన్ఎస్ఓ గ్రూపు ఆర్థిక, న్యాయపరమైన సవాళ్లను ఎదుర్కొంటున్నందున తన పదవికి రాజీనామా చేయాలని గ్రూపు సిఇఓ ఇజిక్ బెన్‌బెనిస్తి నిర్ణయించారు. సిఇఓగా కేవలం రెండు వారాలు మాత్రమే ఆయన ఆ పదవిలో ఉన్నారు. బెన్‌బెనిస్తి రాజీనామాపై ఎన్ఎస్ఓ గ్రూపు బహిరంగంగా ఎలాంటి ప్రకటన చేయలేదు. కానీ ఆయన సిఇఓ పదవి నుండి వైదొలగాలని భావిస్తున్నారని ఇజ్రాయిల్ మీడియాకు స్పష్టం చేసింది. కంపెనీపై తీవ్రంగా ఆరోపణలు వస్తున్న నేపథ్యంలో అమెరికా వాణిజ్య శాఖ ఎన్ఎస్ఓ గ్రూపును బ్లాక్ లిస్ట్‌లో పెట్టింది. ప్రపంచ వ్యాప్తంగా సామాజిక కార్యకర్తలు, జర్నలిస్టుల, రాజకీయ నాయకుల కార్యకలాపాలపై నిఘా పెట్టేందుకు పెగాసస్ స్పైవేర్‌ను ఉపయోగిస్తున్నారని విషయం బహిర్గతమైంది.

## జపాన్ ప్రధానిగా కిషిద మరోసారి ఎన్నిక

జపాన్ ప్రధాన మంత్రిగా ఫుమియో కిషిద మళ్లీ ఎన్నికయ్యారు. నవంబర్ 10న జరిగిన ఓటింగ్‌లో పార్లమెంట్ సభ్యులు ఆయన ప్రధాని పదవి చేపట్టేందుకు ఆమోదం తెలిపారు. పార్లమెంట్‌కు జరిగిన ఎన్నికల్లో కిషిద నేతృత్వంలోని అధికార లిబరల్ డెమోక్రాటిక్ పార్టీ (ఎల్‌డిపి) గెలుపొందింది. దిగువ సభలో మొత్తం 465 స్థానాలు ఉండగా, అధికార ఎల్‌డిపి 261 స్థానాల్లో విజయం సాధించింది. వైరస్‌పై పోరు, ఇతర సవాళ్లపై అతి తక్కువ సమయంలోనే కిషిద సర్కారు చేపట్టిన చర్యలకు లభించిన ప్రజా మద్దతుగా భావిస్తున్నారు.

## యూరప్‌లో పెరుగనున్న కొవిడ్ మృతులు: డబ్ల్యుహెచ్ఓ

వచ్చే ఫిబ్రవరి నాటికల్లా యూరఫ్‌లో కొవిడ్–19 భారిన పడి మరో ఐదు లక్షల మంది మృత్యువాద పడే అవకాశం ఉందని ప్రపంచ ఆరోగ్య సంస్థ (డబ్ల్యుహెచ్ఓ) ఆందోళన వ్యక్తం చేసింది. ప్రస్తుతం యూరప్ రీజియన్ పరిదిలో 53 దేశాల్లో కరోనా వ్యాపించి ఉదని డబ్ల్యుహెచ్ఓ యూరప్ డైరెక్టర్ హన్స్ క్లుగే నవంబర్ 5న మీడియాకు తెలిపారు. ప్రస్తుత ధోరణి ఇలాగే కొనసాగితే, యూరప్ దేశాల్లో మరో ఐదు లక్షల మంది ప్రాణాలు కోల్పోయే ప్రమాదం పొంచివుందని అన్నారు. రష్యా, బ్రిటన్ తదితర దేశాల్లో కొవిడ్–19 మరణాలు కొనసాగుతున్నాయి. పలు కేసులతో యూరప్ దేశాలు అల్లాడిపోతున్నాయి.

## ఆస్ట్రేలియాలో కొవిడ్ అనుకూల, వ్యతిరేక ప్రదర్శనలు

ఆస్ట్రేలియాలో వీధుల్లో వ్యాక్సినేషన్ అనుకూల, వ్యతిరేక ప్రదర్శనలు, నిరసనలు నవంబర్ 20న జరిగాయి. కొవిడ్ వ్యాక్సినేషన్‌ను తప్పనిసరి చేయడాన్ని నిరసిస్తూ వేలాదిమంది వీధుల్లోకి రాగా, మద్దతుగా కూడా చిన్న చిన్న ప్రదర్శనలు జరిగాయి. 16 ఏళ్లు ఆ పైన వయసున్న వాళ్లలో దాదాపు 85 శాతం మంది ఈ నెల 19 నాటికి పూర్తిగా వ్యాక్సిన్ వేసుకున్నారు. దేశవ్యాప్తంగా వ్యాక్సినేషన్ అన్నది స్వచ్ఛందం చేశారు. కానీ రాష్ట్రాలు, ఇతర ప్రాంతాల్లో చాలా వృత్తులకు వ్యాక్సినేషన్ తప్పనిసరి షరతు చేశారు. వ్యాక్సిన్ వేసుకోని వారిని సంగీత కచేరీలకు, హెూటళ్లకు నిషేధించారు. ఈ నేపథ్యంలో ఆందోళనలు, ప్రదర్శనలు జరుగుతున్నాయి. మెల్‌బోర్న్ నడిబొడ్డున గల ప్రాంతంలో వేలాది మంది వ్యాక్సిన్ వ్యతిరేకులు, వందల మందితో వ్యాక్సిన్ అనుకూలురు ప్రదర్శన నిర్వహించారు.

## ఉక్రెయిన్‌కు ఆయుధ సరఫరా వద్దంటున్న రష్యా

ఉక్రెయిన్‌కు ఆయుధాలు సరఫరా చేయవద్దని అమెరికాను రష్యా హెచ్చరించింది. ఇటీవల కుదిరిన కొత్త ఒప్పందం ప్రకారం ఉక్రెయిన్‌కు ప్రాణాంతకమైన ఆయుదాలను అమెరికా సరఫరా చేసినట్లైతే ఆ దేశంలో అంతర్యుద్ధం మరింత పెచ్చరిల్లుతుందని, శాశ్వత ప్రాతిపదికన శాంతిని నెలకొల్పే ఒప్పందం మరింత కఠనతరమవుతుందని అమెరికాలోని రష్యా రాయబారి హెచ్చరించారు. అమెరికా, ఉక్రెయిన్ దౌత్యవేత్తలు సంతకాలు చేసిన భాగస్వామ్య ఒప్పందంలో ప్రమాదకరమైన నినాదాలు ఉన్నాయన్నారు. రష్యాను వ్యతిరేకించేలా భౌగోళిక, రాజకీయ సాధనం వుందని వ్యాఖ్యానించారు. ఆయుధాలు సరఫరా చేయాలన్న ప్రణాళికతో ఉక్రెయిన్‌లో పరిస్థితి మరింత అధ్వానమవుతుందని హెచ్చరించారు. నవంబర్ 10 ఈ ఒప్పందంపై అమెరికా, విదేశాంగ మంత్రి, ఉక్రెయిన్ విదేశాంగ మంత్రి సంతకాలు చేశారు. వీ

# వీక్షణం 2021 సూచిక

*కొవిడ్ లాక్‌డౌన్ వల్ల వీక్షణం జూన్ సంచిక అచ్చు వేయలేక సాఫ్ట్ కాపీ తెచ్చాము. అందువల్ల 2021లో 11 సంచికలు మాత్రమే అచ్చులోనూ, ఒక సంచిక సాఫ్ట్‌కాపీ గానూ వెలువడ్డాయి.*

ఆర్థిక లక్ష్యాల కన్న రాజ్యాంగ ఆదర్శాలే మిన్న – ఆనంద్ తేల్తుంబ్డే
ఐదు రాష్ట్రాల ఎన్నికల మినీ సంగ్రామం – ఎ. నర్సింహారెడ్డి
అందమైన నినాదాలు – అబద్ధాల మూటలు – తండా సదానందం
మయన్మార్‌లో సైనిక పాలన బీభత్సం – బి. రామకృష్ణ
నేపాల్‌లో భారత విస్తరణవాదం– ఇటీవలి పరిణామాలు – యస్. కృష్ణమూర్తి
పెట్టుబడి – స్వేచ్ఛ: వర్తమాన భారతం – కొండూరి వీరయ్య
వలస రాయలసీమలో మహిళా చైతన్యం–4 – డా. షేఖ్ మహబూబ్ బాషా
సంస్థాగతం – వీక్షణం రచయితల సమావేశం
సంస్మరణలు – సింగమనేని నారాయణ, కొల్లూరి చిరంజీవి; ఉప్పు కృష్ణ; పురందర్; అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి, కాకరాల సూర్యకాంతం; మోహన్‌రావు
ఈనేల; ఇరుగు–పొరుగు; భూగోళం – వై. రామచంద్రం

**మే 2021** **సంచిక : 235**

పాఠకుల వీక్షణం
మూర్ఖత్వానికి పరాకాష్ట – రాజేంద్రబాబు అర్విణి (సంపాదకీయం)
కోవిడ్‌తో విల విల–కొరవడిన రాజకీయ సంకల్పం; ఆడలేక మద్దెల వోడు అన్నట్టు ఎన్నికల బహిష్కరణ; అంతర్యుద్ధం దిశగా మయన్మార్ – ఎ.నర్సింహారెడ్డి (సంపాదకీయ వ్యాఖ్యలు)
కొత్త పుస్తకాలు
ప్రశ్నించే గళాలు, కలాలపై ఎన్ఐఎ దాడులు – ఎ. నర్సింహారెడ్డి
ఖైదీల హక్కులు రాజ్యాంగ బద్ధమే – సిఎస్ఆర్ ప్రసాద్
రెండవ దశ కోవిడ్ విజృంభణ – వైద్యుల, శాస్త్రవేత్తల బహిరంగ లేఖ
తెలంగాణలో కొనసాగుతున్న అవినీతి, అణచివేత – చిక్కుడు ప్రభాకర్
ఆపరేషన్ ప్రహార్ ఒక్కటే సమాధానమా! – లక్ష్మణ్ గడ్డం
తక్షణ విశ్లేషణలు – తప్పుడు నిర్ధారణలు – జహంగీర్
తత్వశాస్త్రం అంటే ఏమిటి? – యు.ఎ. ఖరిన్
ఒక కలం వీరునికి ఇన్ని కష్టాలా! – అర్విణి రాజేంద్రబాబు
రాఫెల్ విమానాల కొనుగోలు ఎవరికోసం? – బి. రామకృష్ణ
జో బైడెన్ విదేశాంగ విధానం – సంతోష్
ఉద్యమంతోనే ఖాజిపేట రైల్వేకోచ్ ఫ్యాక్టరీ సాధ్యం – బండి దుర్గాప్రసాద్
విద్యా సంస్థల మూసివేత పరిష్కారమా? –గొడిశాల వెంకటేశ్వర్లు
ఆంధ్రప్రదేశ్‌లో కొవిడ్ – విద్యా సంస్థలకు సెలవు – చిమ్మో. జాన్‌బర్నబాస్
తిరుపతిలో దొంగలు పడ్డారు! – ఎం.కె. కుమార్
తెలంగాణ ఆర్థిక నిర్వహణపై కాగ్ విశ్లేషణ – డా. ఎ. పున్నయ్య
ధీమాలేని బీమా – ఆర్. లక్ష్మి
రిటైర్మెంట్ వయస్సు పెంపు ఎవరి ప్రయోజనం ? – డి. శ్రీనివాసులు
అసంబద్ధ పిఆర్‌సికి అభిషేకాలెందుకు? – చుంచు శ్రీశైలం
చిక్కుల్లో మహారాష్ట్ర ప్రభుత్వం – నర్సింహ
ఇక రాష్ట్రాలు ఉనికిలో ఉండవా! – సతీష్ బైరెడ్డి
రాజకీయ సిద్ధాంతవేత్తగా మార్క్స్ – కొండూరి వీరయ్య
సామాజికవేత్త మనముందు పెట్టిన ప్రశ్నలు – హేమలలిత
పుస్తక సమీక్ష–సామాజిక బాధ్యతను గుర్తుచేసే వ్యాసాలు – వంగాల సంపత్ రెడ్డి
సంస్మరణలు – మధు, జర్నలిస్టు అమర్‌నాథ్, రచయిత మధు; కె.పి. సుబ్బారావు, ఒద్దిరాజు వేణుగోపాల్ రావు
ఈనేల; ఇరుగు–పొరుగు; భూగోళం – వై. రామచంద్రం

**జూన్ 2021** **(సాఫ్ట్ కాపి)**

పాఠకుల వీక్షణం
ఈ అసాధారణ మరణాలన్నీ వ్యవస్థ చేసిన హత్యలే (సంపాదకీయం)
పీనుగల మీద ప్యాలాలు ఏర్క బుక్కుడంటే గిదే...
మహా విపత్తు సమయంలో ప్రభుత్వ బాధ్యత; గాజాలో ఇజ్రాయిల్ ఆటవిక దాడులు – ఎ.నర్సింహారెడ్డి (సంపాదకీయ వ్యాఖ్యలు)
సంస్మరణలు – చంద్ర; సోలి సొరాబ్జీ; ప్రొ. బాలస్వామి; యలవర్తి రాజేంద్రప్రసాద్; శెట్టి కొమ్మాలు; కె.కె. రంగనాథాచార్యులు
ప్రజా సంఘాల నిషేధ లక్ష్యం శ్మశాన శాంతి స్థాపన – ఎన్. వేణుగోపాల్
అధికార క్రీడలో ఈటెల అవుట్ – బి. రామకృష్ణ
రఘురామ కృష్ణరాజుపై 'రాజద్రోహం' కేసు – చిమ్మో. జాన్ బర్నబాస్
ఆంధ్రప్రదేశ్ దాగుడు మూతల బడ్జెట్ – నర్సింహా
ముగిసిన మినీ ఎన్నికల ప్రహసనం – ఎ. నర్సింహారెడ్డి
సిల్గేర్‌లో పోలీసు క్యాంపు–ఆదివాసుల వ్యతిరేకత – కురుసం శంకర్
కోవిడ్ 19 – ప్రత్యేక వ్యాసాలు –
వాక్సిన్ రాజకీయార్థిక అంశాలు – ఆనంద్ గ్రోవర్
స్వేచ్ఛా వాణిజ్యం కోరల్లో కరోనా వ్యాక్సిన్లు – కేశవ్
దేశమంతా శవాలు కాలుతున్న వాసన – బైరెడ్డి సతీష్
దేశ ప్రజలను పీడిస్తున్న రెండు మహమ్మారులు – బి. ఎస్. రాజు
కరోనా మూడవ వేవ్ అనివార్యం – శాస్త్రజ్ఞుల ప్రకటన
పాలకుల నిర్లక్ష్యమే కరోనా సెకండ్ వేవ్ – డా. ఎ. పున్నయ్య
దారుణ మారణహోమానికి బాధ్యత ఎవరిది? – డా. కొల్లా రాజమోహన్
ఉపాధ్యాయుల ప్రాణాలు తీసిన ఎన్నికలు – డి. శ్రీనివాసులు
మేడే, ప్యారిస్ కమ్యూన్, శ్రామికోద్యమ నవ నిర్మాణం – భూసారం శివన్న తత్వశాస్త్ర
ప్రాథమిక ప్రశ్నలు – యు.ఎ. ఖారిన్
సంస్మరణలు – అదృష్ట దీపక్;చల్లా నరసింహారెడ్డి; సుందర్ లాల్ బహుగుణ; నర్సిములు; గోపి; ఎం.రాజేంద్ర
నేపాల్: రాజకీయ సంక్షోభంలో ఓలీ ప్రభుత్వం – ఎస్. కృష్ణమూర్తి
అఫ్ఘన్ నుంచి అమెరికా సైన్యం నిష్క్రమణ – సంతోష్
నేపాల్ పై చర్చ: కొన్ని గమనించాల్సిన అంశాలు – ఎం. కృష్ణ ఆదిత్య
పుస్తక సమీక్ష – రైతు బిడ్డడు కార్మిక వర్గ నాయకునిగా – లంకా పాపిరెడ్డి
ఈనేల; ఇరుగు–పొరుగు; భూగోళం – వై. రామచంద్రం

**జూన్–జూలై 2021** **సంచిక : 236**

పాఠకుల వీక్షణం
దొంగ లెక్కల, అబద్ధాల ప్రభుత్వాలు (సంపాదకీయం)
అబ్బ, దొర పోకడ మారినట్టున్నదిలే!
ప్రజల మీద అదనపు పన్నుల భారం
జి–7 దేశాల తాజా భౌగోళిక రాజకీయాలు – ఎ. నర్సింహారెడ్డి(సంపాదకీయ వ్యాఖ్యలు)
పాఠకుల వీక్షణం
ఏడేళ్ల మోడీ పాలనలో దేశం అధోగతి – ఎ. నర్సింహారెడ్డి
ఏడేళ్ల తెలంగాణ ముఖచిత్రం – ఆర్విణి రాజేంద్రబాబు
రఘురామ రాజన్ దృష్టిలో వర్తమానం – బి.ఎస్. రాజు
ప్రజా సంఘాల నిషేధ లక్ష్యం శ్మశాన శాంతి స్థాపన – ఎన్. వేణుగోపాల్
ఆంధ్రప్రదేశ్‌లో ఆస్తి పన్ను పెంపు భారం! – చిమ్మో. జాన్ బర్నబాస్
రాజ్యాంగ సంస్థలు – పారదర్శకత – సిఎస్ఆర్ ప్రసాద్
చారిత్రిక ప్రజా ప్రతిఘటన సిల్గేర్ – ఏమ్లా వాగాలు
వాక్సిన్ రాజకీయార్థిక అంశాలు – ఆనంద్ గ్రోవర్
ప్రజల ఆరోగ్య, ప్రాణ రక్షణ బాధ్యత ప్రభుత్వానిదే – డా. ఎ. తిరుపతయ్య
ఇక్కడ ఏదీ రహస్యం కాదు – కేశవ్
ఆహార సంక్షోభం – పాలకుల వైఫల్యమే – డా. ఎ. పున్నయ్య
రైతుల ఆదాయాలు ఎందుకు పెరగడం లేదు? – కన్నెగంటి రవి, శేరుపల్లి రాజేష్
ఆరోగ్య హక్కు పన్నులు కట్టేవారికేనా? – వి. జనార్దన్
ప్రభుత్వ విధానాలను ప్రశ్నించడమే దేశ ద్రోహమా? – అన్వేషి
సాకులు సబబేనా? – ఆర్. లక్ష్మి
బెంగాల్‌లో వామపక్ష పరాజయాన్ని ఎలా అర్థం చేసుకోవాలి? – కొండూరి వీరయ్య
తత్వశాస్త్ర ప్రాథమిక ప్రశ్నలు – యు.ఎ. ఖారిన్
దగాపడ్డ పాలస్తీనా – బి. రామకృష
చిలే, పెరూ ప్రజా విజయాలు – సంతోష్
హిందుత్వ – మార్కెట్ ముట్టడిలో లక్షద్వీప్ – సతీష్ బైరెడ్డి
ఈనేల; ఇరుగు–పొరుగు; భూగోళం – వై. రామచంద్రం

**ఆగస్టు 2021** **సంచిక : 237**

పాఠకుల వీక్షణం
ప్రతి మనిషి జేబులో పోలీసు! (సంపాదకీయం)
మత్పరిచ్చనీకి మల్లొక సుట్టరికం!
నిరుద్యోగుల జీవితాలతో చెలగాటాలా?
ఆఫ్ఘనిస్తాన్‌లో పుంజుకుంటున్న తాలిబనిజం – ఎ. నర్సింహారెడ్డి (సంపాదకీయ వ్యాఖ్యలు)
పాఠకుల వీక్షణం
ఫాదర్ స్టాన్ స్వామి ఉజ్వల వ్యక్తిత్వం – సూసన్ ఎబ్రహాం
ఫాదర్ స్టాన్ స్వామి మావోయిస్టా? – ఫెలో వాకర్
మాటల్లోనే దళితుల సాధికారత – సంతోష్
కేంద్రం గుప్పిట్లో తెలుగు ప్రజలు – అరుణ్
పెగాసస్, ఆర్సెనాల్–చెల్లని భీమా కోరేగాం కేసు – ఆనంద్ వెంకటనారాయణ్
సంస్మరణ – హక్కుల నేత స్టాన్‌స్వామి మృతి
బిజెపిది కూడా ఎమర్జెన్సీ ఆధిపత్య తత్వమే – చరిత
ఉపశమనం లేని ఉద్దీపన ప్యాకేజీలు – డా. ఎ. పున్నయ్య
ఆంధ్రప్రదేశ్ నిరుద్యోగుల ఆందోళన – చిమ్మో. జాన్ బర్నబాస్
'ఢిల్లీ కీ దూరీ, దిల్ కీ దూరీ' కశ్మీర్ – రాజేంద్రబాబు అర్విణి

